వెంకటసుబ్బరాయగుప్త, గ్రంధి

ఆంధ్రమాత

చెన్నపురి, 1921

Record no. 367

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వెంకటసుబ్బరాయగుప్త, గ్రంధి.
ఆంధ్రమాత : అయిదంకముల నాటకము / గ్రంధి వెంకటసుబ్బరాయగుప్త విరచితము.- 1. ముద్రణము.- చెన్నపురి : ఉపేంద్రప్రచురణాలయము, 1921.
(3), 6, 115 p. ;20 cm.
Record no. 367

Veṅkaṭasubbarāyagupta, Grandhi.
Āṃdhramāta : ayidaṅkamula nāṭakamu / Grandhi Veṅkaṭasubbarāyagupta viracitamu.- 1. mudraṇamu.- Cennapuri : Upēndrapracuraṇālayamu, 1921.
(3), 6, 115 p. ;20 cm.
Record no. 367

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB    Date filming began:

ఓమ్

బదరీనారాయణనమః

"జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి"

# ఆంధ్రమాత

(అయిదంకముల నాటకము.)

గ్రంథి - వెంకటసుబ్బారాయగుప్త

విరచితము




ప్రథమముద్రణము ప్రతులు—1000

ఉపేంద్రప్రచురణాలయము

17, నారాయణమొదలివీధి,

చెన్నపురి.

1921

370

యగనిసంతతంబుతల ♦ దండ్రులమించుచున్న సాకి ది ।
వ్రయశముగాంచి ధర్మముల ♦ బావులచెర్వుల నేర్పరించి ని ।
యమగుసత్యజీవనము ♦ నలజరియించిన కంకిపాటితా ।
యసరమాంబులన్న తిహృ ♦ దాబ్జమునందొనరింతు భక్తితోన్ ॥

[illegible]సంబు[illegible]నస ♦ హాయోద్యమసమితి, దేశసేవనొనర్చు ♦ ధీరుడెతడు ।
[illegible]నుశ[illegible] ♦ సనయొనర్చను పేంద్ర, ప్రచురణాలయము ♦ స్థాపనము నెతడు ।
[illegible]నందుదా ♦ రముదీయునట్టుల, సాధన జేయించె ♦ సతికి నెతడు ।
వసుధపవిత్రపా ♦ ణిసగోత్రమందున, భూరిప్రఖ్యాతిని ♦ బొందె నెతడు ।
[illegible]లంగను వాసంత ♦ గ్రంధనిలయ । మెతడు గృహమందు నలరించె ♦ నట్టిసుప్రజ ।
[illegible]సుపుత్రుడు గోనుగుం ♦ ట్లాఖ్యవంశ । ఘనుడు సఖుడౌచునుండ భా ♦ గ్యంబుగాదె ॥

తె.సా. 212

# పీఠిక.

ఈగ్రంథము ఆంధ్రమహాసభలు ప్రారంభమైనప్పుడే వ్రాయమొదలిడి పూర్తి చేసినను ద్రవ్యలోపమువల్ల ముద్రణగాకుండుటయు నూతనాంశముల చేర్చుటకు వీలు కలిగినందులకు సంతసించవలసియున్నది దీనిప్రచురమునకు మ-రా-రా-శ్రీ కుర్చేటి-కేశవరావుగారు సహాయమొనర్చి నాప్రయత్నమునకు తోడ్పడినందులకు వారికనేక వందనములు. దీనిరచనకుగడంగి చాలాకాలమైయుండుటచే ఇప్పటి పాకమునకు వెనుకటి పాకమునకు భేదముకనుపించవచ్చును. నాకు దెలిసినంతవరకు దేశభక్త ధర్మాత్ములచరిత్రల బొందుపరచితిని ఆంగ్లనైఘంటిక వైమానికనిర్మాణ చిత్రలేఖనములందు వైశ్యులనే పేర్కొనవలసివచ్చినందులకు జాత్యభిమానము వహించినట్లైనను వలదు ఇందలిగాథ కొంతవరకచ్చటచ్చట పురాణముల ననుసరించియున్నను చాలా భాగము చరిత్రాత్మకమైయుండుట చదువరులకు బోధపడగలదు పంజాబుదురంతములు ఖిలాపతువిషయములు కూడా చేర్పబడియున్నవి. గురుశిక్షణచేయబడిన కవిత్వముగానందున దోషములుండునని వేరుగా జెప్పనక్కరలేదు ధారాశుద్ధియైనా కలదో లేదో నాకు తెలియదు నేనీగ్రంథరూపమున నాసోదరసేవ జేయగలిగితినని జెప్పుట కర్హుడగానని తోచుచున్నది. చదువరులు తప్పులు మన్నించుటకు ప్రార్థితులు. ధన్వంత్రి ౧ సంపుటం ౧౩ సంచిక వైశ్యమాధవుని చరితమును ఆంధ్ర౨ సంపుటం ౨౨ సంచికయందు ప్రచురించిన పంజాబువధలు 13-9-20 ఆంధ్రపత్రిక మిస్‌పీటరుసన్ గారి వాక్యముల నాధారము చేసికొని బొందుపరచితిని ఖిలాపతుసమస్య కృష్ణాపత్రిక ననుసరించి వ్రాసియుంటిని. ఆంధ్రకృష్ణా పత్రికలు రెండును నాగ్రంథరచనకు చాలా తోడ్పడి యున్నందులకు తత్పత్రికాధిపతులు వందనీయులు

గ్రంథకర్త.

గ్రంధి - వెంకటసుబ్బరాయగుప్త,

గుంటూరు, నంబూరు.

## ఈ నాటకమందలి పాత్రలు.

పురుషులు.

1. నటి సూత్రధారులు.
2. బదరీనారాయణుడు
3. ఆనందగుప్త.
4. పౌరాణికుడు
5. ప్రబుద్ధి (ఆంధ్రమాతభర్త)
6. హాస్యకుమారుడు
7. మహమ్మదీయకుమారుడు.
8. ఆంధ్రపుత్రుడు.
9. పాంచాలకుమారుడు.
10. వ్యాసుడు.
11. సూతుడు.
12. శౌనకుడు
13. నవీనశర్మ.
14. సనాతనశాస్త్రి.
15. రాముడు.
16. హనుమంతుడు. } దేశభక్తులు.
17. భుజగేశుడు } దేశభక్తులు.
18. కృష్ణుడు } దేశభక్తులు.

స్త్రీలు.

1. ఆంధ్రమాత (కథానాయకి)
2. బంగాళమాత.
3. మహారాష్ట్రమాత.

## కృతిప్రోత్సాహకునివంశము.

—:O:—

చం॥ పలువిధదానధర్మముల పారముగానొనరించుచున్నదా ।
కలుములదేలియాచకుల గాచుచుకన్యకదేవిభక్తివి ।
ట్కులమలరారుగౌతమస గోత్రముతత్కులమందువన్నెగాం ।
చె, లసదనూనకీర్తికురు చేటిసువంశముఙానమించెడిన్ ॥

కం॥ ఆవంశంబునబుట్టెను । భావజరిపుపాదపద్మ భక్తియుతుండై ।
శ్రీవిభవంబులనొప్పుచు । భావజ్ఞుండమ్మనార్య ప్రావీణ్యుడిలన్ ॥

గీ॥ అమ్మనార్యుడుసతి రత్నాంబవలన । గాంచెపుత్రులనిర్వుర కలితయశుల ।
నాంగిలేయాంధ్రభాషాద్వ యప్రవీణు । లనగుణాఢ్యులసౌఖ్యాజీవనులఘనుల ॥

కం॥ రామబ్రహ్మము గుణముల । రామబ్రహ్మంబెకీర్తి రంజిలుశేషుం ।
డేమహీశేషయ్యార్యను । ధీమణినిశ్చలనితాంత ధీరములందున్ ॥

చం॥ గుణములసత్యవర్తనల కోవిదవర్గముమెచ్చ సంతతం ।
బునుధనకాంక్షబూనకను బుద్ధినిగీష్పతిబోలిలెక్కలన్ ।
దొనరబుధేంద్రులాయపర యూక్లిడటంచనివాడు చుండగా ।
ననుపమకీర్తిగాం చెధర యమ్మనపెద్దకుమారుడెంతయున్ ॥

గీ॥ అక్సుఫర్డుకేంబిడ్జిక ళాలయమున । జేయలేనట్టిలెక్కల జేసిపేరు ।
గొనెను మిగులరామబ్రహ్మ కోవిదుండు । ఆంగ్లవిద్యావిశారదు లాత్మమెచ్చ ॥

గీ॥ పాఠశాలాధికారస త్పదవియందు । పేరుగనినబర్సురియే ధీరుగణిత ।
శాస్త్రపద్ధతులకుమెచ్చి సంతసించె । నలవిశాలమనస్కుడై నట్టిరామ ।
బ్రహ్మగుప్తుని నెన్నగా బ్రహ్మకగునె ॥

క॥ పూజితుడైయాంగ్లమునన్ । దాజయమును గాంచిభాష దనరిఘనంబున్ ।
రాజప్రతినిధులౌనన । రాజిలెశేషయ్యగుణవి రాజితుడిలలోన్ ॥

కం॥ పూర్ణముగాఎఫ్ యేను । తీర్ణుండై ప్రథమమందు దృష్టిజెలంగన్ ।
కర్నల్ మెక్డొనర్డునె । స్వర్ణసుపతకంబుగొనెను సరసులుమెచ్చన్ ॥

కం॥ శ్రీచర్చిమిషన్ స్కూలులో । దాచదివిబియేపరీక్ష దార్ఢ్యతమీరన్
ధీచతురతపతకముసం । కోచములేకిలనుగొనెను గురుతరబుద్ధిన్ ॥

కం॥ రామబ్రహ్మసుధీమణి । భామామణిగంగమాంబ భార్యవలనస ।
త్కామితమీడేరగ నెన్ । కోమల గాత్రులను దివ్య గుణయుతులధరన్ ॥

కం॥ కాంతలు వెంకటసుబ్బమ । కాంతినిగని మెచ్చుచుంద్రు కాశ్యపిలక్ష్మి ।
కాంతాంబాసుమధన్యని । కాంతను సుందరమునందు గాదనుచుండున్ ॥

కం॥ ధీయుతుడార్యవినతుడాం । గ్లేయచికిత్సకుడుభూరి కీర్తియుతుడువి ।
ద్యాయతుడవనిన్ కేశవ । రాయాఖ్యుండలరువిబుధ రాట్టతిమెచ్చన్ ॥

సీ॥ శస్త్రాదికర్మప్రశస్తమౌ నాంగ్లేయ భేషజకృత్యప్రవీణ్యుడితడు ।
సద్వాక్యధోరణి సరణిదేలుచునుప న్యాసంబులిచ్చుధ న్యాత్ముడితడు ।
సతతప్రయత్నంబు సల్పుచు నెల్లెడ వేడుకజెందుస్త్రీ విద్యకితడు ।
శాస్త్రేతిహాససం చయములశోధించి మించుధర్మముల భాషించునితడు ।

గీ॥ వివిధవిద్వాంసకవికుల విబుధవంద్య । విమలవితరణగుణముల వెలయునితడు
ఆర్యవైశ్యకులాబ్ధిహి మాంశుడవని । కేశవార్యుండుదివ్యసం కాశయశుడు ॥

చం॥ సుమనసబంధు మిత్రతతి శోభిలచుట్టును జేరియుండసం ।
భ్రమమున జేరివందనము భక్తినొనర్చుచు నాంధ్రమాతగ్రం ।
థముపినుపించ మెచ్చిసురు ధర్మమటంచెదలో దలంచికా ।
ర్యము నెరవేర్పవచ్చునని వచ్చుగసాయము జేసెద్రవ్యమున్ ॥

గీ॥ గొనుచు ద్రవ్యంబునంతయు ద్రణమొనర్చి । ప్రచురపరచితినాంధ్రులు బారజూచి ।
గారవించుచు తప్పుల గాంచిదిద్దు । కవిజనంబుల ప్రార్థింతు కరముప్రీతి ॥

---

శ్రీ బాలవైద్యసుధాబ్ధి ప్రథమభాగము ఇందుస్త్రీల చికిత్సలు ఆయుర్వేదము యూనాని ఇంగ్లీషు హోమియోపతి జలచికిత్సలుకూడా చేర్పబడియున్నది పద్యకావ్యము తెనుగుతాత్పర్యసహితము పోస్టేజిగాక 2-0-0

డిటో రెండవభాగము ఇందుబాలచికిత్సలు ఆయుర్వేద యూనాని మొదలగు వాటిని తెలుపబడియున్నవి వెలపోస్టేజీగాక 2-0-0

ధన్వంతరి వైద్యలహరి ఇందు సన్నిపాతవాతపైత్య శ్లేష్మజ్వరాది వివరములు చికిత్సలు దెలుపబడియున్నవి నూటయిరువది కజ్జలీయౌషధములు చూర్ణములు తైలములు వివరింపబడియున్నది పద్యకావ్యము తాత్పర్యసహితము వెలపోస్టేజితో. [illegible]-0-0



ఉ॥ శ్రీనరుడాదిశంకరవ శిష్యులుగౌతముడేసు నాధరా ।
మానుజమధ్వనానక మహాత్ములు బుద్ధమహమ్మదాఖ్యులే ।
జ్ఞానివిలాసతేజముల భావములన్గని సంతసించిర ।
జ్ఞానిమదాత్మలోదలతు వర్థిలబూనినకార్యమెంతయున్ ॥

ఉ॥ శ్రమహిమాబ్ధిరాముడయి క్షేమము లిచ్చుచు భక్తకోటికిన్ ।
వేమరుభూతజాలముల వేడ్కసుఖంబులనొందజేసి స ।
త్కామితజాలమిచ్చుచును కాశ్యపిపోషణజేయునెవ్వడా ।
స్వామిముదంబు మీరగను భారతమాతను గాచుగావుతన్ ॥

ఉ॥ శ్రీవిభవంబులొక్కతరి జెందగజేయుచునొంగు దేశమున్ ।
తావులకన్నవస్త్రముల దార్ఢ్యతమీరగ నొక్కఖండమున్ ।
జీవనవృత్తులన్ జెరపి చింతలనొందగ జేయునెవ్వడా ।
దేవుడు సర్వమానవుల దిక్కెదెసంగని బ్రోచునేకతన్ ॥

ఉ॥ దీపితహేమభూషణసు ధీమణిశాంకరిలోకమాతవి ।
ద్యాపరిపూర్ణశోభితసు ధామయమూర్తిని కన్యకాంబను ।
ప్పాపవినాశనీవిబుధ భక్తము నింద్రసురౌఘపోషణీ ।
శ్రీపరమేశ్వరీకరుణ జేకొని బ్రోవవెనాంధ్రదేశమున్ ॥

ఉ॥ ధీజనలోకవందితుడు దీనజనావను డవ్యయుండు వి ।
భ్రాజితభక్తపాలుడు విభాకరపావక ఋక్షపఙ్క్తికిన్ ।
తేజమొసంగిసంతతము ద్రిప్పెడివాడఘనాశు డర్థిస ।
ర్భాజుడు జార్జిరాజునిల పూర్ణచిరాయువుగా నొనర్చెడిన్ ॥

ఉ॥ హాయినిజెందుచుండగని హైందవజాతిని దక్షిణాఫ్రికా ।
బోయరులెల్ల కష్టముల బొందగజేయగ ధైర్యమూనివా ।
లాయముశాంతయుద్ధమవ లంబనజేసిన సన్మహాత్ముడా ।
శ్రీయుతగాంధిదేశహిత సేవకునెంతుముదంబుమీరగన్ ॥

మ॥ కరుణన్ జూపుచు నాంధ్రసోదరులపై కష్టంబులన్ జూడకే ।
స్థిరతాంధ్రావని పాదపద్మములసం సేవించుచున్వేగనా ।
దరమొప్పారగసర్వసంఘముల భేదంబెంచకన్ జూచువే ।
ఙ్కరయాంబాసరసోత్తమున్ దలతుకొండా వెంకటప్పాహ్వయున్ ॥

మ॥ అరుదందన్ సుధలొల్కు వాక్యములచే శారాధనంబూనిసు ।
స్థిరతన్ సల్పుచునుండి గొప్పపదవుల్ చేకూర్చ విద్యాంబులా ।
సరవిన్ సల్పుచుగొర్న మెంటుహితులై సామంబె మేలంచు సో ।
దరులన్మోసము జేయకుండనిడుదున్ దండంబు లెల్లప్పుడున్ ॥

ఉ॥ నేరిచియాంగ్లభాషనుమ నీషులుపూజ్యమటంచు నెంచుచున్ ।
గోరక వేతనంబులను గొప్పగనే బిరుదంబు లెంచకన్ ।
జేరకపాలనాసమితి జెందసుఖంబును సోదరాళినిం ।
పారనమస్కరించెద సహాయనిరాకరణంబు బూనగన్ ॥

చం॥ పలుమరువాగ్ధనంబులను భావములొక్కటి దానబోయుచున్ ।
సలలితదేశసేవలను సల్పుచు వృద్ధిని గోరునేమహా ।
త్ములుదగవారిసూచనల బుద్ధిని నిల్పుచు విశ్వసించగన్ ।
వలగొని మొక్కెదన్మిపుల భక్తినిజూపుచు నీవసుంధరన్ ॥

మ॥ ఘనుడొక్కం డురుదంతమున్వ్బరికి దోర్గర్వాత్ములౌ వైరులన్ ।
దునుమాడెన్ మరిపూరిమొక్కడిడుచున్ దుష్టాత్ములన్ దుర్మించడే ।
దనరారన్ గనయాత్మశక్తియగు ప్రా ధాన్యంబుతచ్ఛక్తినే ।
ర్పునసాధించగలాభమబ్బుమనకున్ బోరాటమేలాధరన్ ॥

ఉ॥ యూరపుసంగరంబునబలోద్ధతిజూపవరప్రదానముల్ ।
భారతభూమికిత్తుమని బల్కి జయంబును గొన్నవెంటనే ।
మారుపుజేసి ఘోరతర మార్షలు రౌలటు శాసనాళి స ।
త్కారమొనర్చినట్టిసర కారునుసంస్తుతిజేయవేడెదన్ ॥

చం॥ కలుగగ పాడిపంటలకు కష్టము గుడ్డలులేక గట్టబా ।
ధలుబడుచున్నసోదరుల దారినెరుంగక నన్నలారవా ।
రలగతితోడలంపకతి రంబుగబ్రాహ్మణ బ్రాహ్మణేతరుల్ ।
కలహముబూని దేశమున గాథము ద్రోయకనుండ మ్రొక్కెదన్ ॥

చం॥ చదువుచునాంగ్లవిద్యలన జస్రము నాత్మనుగోరియున్న స ।
త్పదవులు జిక్కకన్ జనుల పక్షముబూనుచు దేశముద్ధరిం
చెదమని పైకిటీపిగను జెప్పుచుబ్రాహ్మణ బ్రాహ్మణేతరుల్ ।
హృదయములందు వైరముల నెంచకనుండ నమస్కరించెదన్ ॥

గీ॥ అంటపుచికోపుకుఫ్రీను యంత్రయాసు। గురులియానిడుమొక్సీముగోర్కిటాలు
స్టాయిమొదలగురష్యాప్ర చారకవుల। బోలిజాతీయబోధము పూర్ణగతిని।



కవులుచిత్రించుటకును వేడ్కతోనుతింతు।

చం॥ పలువిధభక్ష్యభోజ్యముల పాయసముల్దిని పెద్దభాగ్యసం ।
తులుసుఖమందిసంపదల దూగుచు బీదలజూచుచుండిరే ।
కలవరమెంతజేసినను కార్యముగాదటు లాంగ్లవర్గముల్ ॥
దలచరె భూరిసౌఖ్యముల ధర్మమటంచని జెప్పనొప్పునా॥

చం॥ సమముగమెట్టపల్లములు సల్పిబలంబిడపండుసస్యముల్ ।
క్రమముగసల్లె బీదలకు గౌరవనీయులు భాగ్యవంతులన్ ।
సమమగు భావముల్గలిగి సత్యముశాంతమహింసలూనిసే ।
ద్యమునొనరించకోర్కెలుప్ప ధాజనకన్ ఫలియించు నెంతయున్॥

చం॥ ఫలితములేని మార్గముల బట్టకతీవ్రముమాని శాంతమా ।
త్మబలధరియించిభేదముల దల్చకమిక్కిలి రాజభక్తితో ।
మెలగుచునేకమౌచునుస మిష్టికుటుంబముబోలి దేశహా ।
క్కులకొనరించయత్నమను కూలముగా ఫలియించుసత్వరన్ ॥

చ॥ పలువిధయంత్రగేహముల పారములౌచును మిల్లులట్టులే ।
వెలయుచుసర్వవర్ణముల వృత్తులనెల్లను బీల్చెబిప్పిగా ।
బలయుతులౌచువర్తకులు భాగ్యములన్ దులదూగగల్గెనా ।
కలిదహనంబుపాలగుచు మాడగడంగిరి బీదలెంతయున్ ॥

ఉ॥ నేమముగోరకన్ ప్రజల చిత్తమెరుంగక జేసిచట్టముల్ ।
వేమరువేచువారలను వృద్ధినొనర్చుచు సౌఖ్యమిచ్చుచున్ ।
బాములకైనపండుగల పాలనొసంగుదయాసమేతులన్ ।
బాములనొందజేయగను భావ్యమెనీకిల దీనపోషణా।

ఉ॥ ఏయెడదేశభక్తిపయి కింపుగ జూపుచులోసహాయమున్ ।
జేయుచుగౌర్న మెంటుకు విశేషముగామితవాదులెంచకో ।
మాయలబన్నుచున్ బిరికిమందుల ద్రాపగడంగె నేర్పుతో
బాయకెరుంగగుట్టునిల బాధ్యులుమాయతివాదపుంగవుల్ ॥

చం॥ మనకిలగౌర్నమెంటుమటు మాయరహస్యము నెల్లవెల్లడిం ।
చినదయరాములెల్లరును సేమముగూర్చినవారెపూజ్యులే ।
గనపడెపాలనావిధము గౌరవమంతయుగోలు పోతిమం ।
చనిదగనిద్రమేల్కొనిజయంబునుగాంచెడి త్రోవజూడరే॥

ఉ॥ జ్యోతిషవైద్యశాస్త్రముల శోధనజూచినపూర్వచాపశ ।
స్త్రాతిశయంబుగాంచినమ హాహవధర్మము దైవభక్తి రా ।
జ్నీతిదలంచినన్ ప్రజవి నిందితవర్తన భారతీయులో ।
కాతతశక్తితెల్లమగు నార్యజనంబుల కెల్లమార్గమా॥

చం॥ మునుమనవారు యంత్రముల మోఘశతఘ్నులు వహ్నిగోళసా ।
ధనములుమేల్విమానములు దండకకృత్యము కృత్రిమంబులన్ ।

గనుగొని వానివల్లకడు కష్టము వాటిలి నిల్పిసట్లుసూ ।
చనలు గ్రహించగానబడు సంగర గాథలు పుస్తకంబులన్ ॥
ఉ॥ వేలును వందలాదులను వేతనముల్గొనుచుండి బోట్లరన్ ।
జాలకనౌకరీలుకలు పంబనియొంచక కర్షకాళిచే ।
పొలనుచల్లలన్ గొనుచు పప్పుకునుప్పుకు చీట్లు వ్రాసివా ।
చాలము జూపికోమటుల సారము బీల్చక నుండ వేడెదన్ ॥
చం॥ సమముగ భారతీయులకు సర్వవిధంబుల నాంగ్లులెల్లసం ।
భ్రమమలరారగన్ స్వపరి పాలన మిచ్చెదమంచు బల్కిస ।
త్యము ప్రచురించు నంతకిల దాస్య మటంచని నౌకరీలనే ।
హ్యము గనుగాంచి గౌరవము నంది మహోన్నతి మించ మొర్రిక్కెదన్ ॥
చం॥ సుమనసు లెందు జూచినను శోభిలుచుంద్రు యశంబు మించి భా ।
గ్యముగలవారినే నృపులు గౌరవనీయులటంచు జూడభా ।
వ్యముమహా నీయులెల్లధన వంతుల గేహములందు బుట్టిరా ।
సమముగ గాంచగావలెను సర్వజనంబుల ధర్మమేర్పడన్ ॥
మ॥ మతవేదంబును సత్యశీలముల ధర్మంబేమియున్ లేకదు ।
ష్కృత మోపుణ్యమొ నీతినీమముల సత్కార్యాములో కానియే ।
గతియైనన్ తమసౌఖ్యమే పరమ మోక్షంబంచు భావించిను ।
ర్గతులన్ బొందెడి జాతియుద్యమములన్ గారించగా తెల్లమా ॥
చం॥ విరివిగ నెందరో బ్రతుకు వృత్తుల నెల్లను గుంజివైచియే ।
వ్వరో బదిమంది కార్మికుల భారము మోసెడి యంత్రశాలలే ।
ర్పరచి ధనీకులెల్లజను భారతభూమిని బాడు జేయకే ।
ల్లరు సుఖ జీవనంబులని లన్నొనరించగ జూడగావలెన్ ॥
చం॥ ప్రకటిత గౌర్నమెంటుపరి పాలనశాసన బంధనంబు లెం ।
చకరపదంబులాత్మగుణ శక్తులనందరిగట్టివైచెకా ।
ర్మికులవిగాక దేహముల మేటిధనీకుల సేద్యపాళిచి ।
క్కులనురి త్రాళ్లజుట్టబడి కొంపలు సౌఖ్యములేక నీల్గెడిన్ ॥

## క రు వు ను గూ ర్చి.

సీ॥ జొన్నలన్నము నైన తృప్తితీర భుజించి, కాలముబుచ్చగా గడగినాము ।
కలిమొగంజియునైన కడుపార నింపుచు, పొద్దులబుచ్చగా బూనినాము ।
తమిదేల జావైన ద్రాగుచు దినములు, గడపెడి నేర్పును గాంచినాము ।
కొఱ్ఱలు సనుగుల కూడైన మెక్కుచు, జీవించు సాధన జేసినాము ।
గీ॥ వేళకేదైన దినుచును వేడ్కమీర । పంటబండించి పొట్టకు బట్టకైన ।
జాలకుండిన బ్రతుకంగ జాలినాము । క్షామమామృత్యునింకేమి సలుపగలవు ॥



ఓమ్ బదరీనారాయణాయనమః.

# ఆంధ్రమాత.

—:(o):—



కరుడైజగంబునొగి ♦ చిత్రవిచిత్రముగానొనర్చుచున్ ।
సాకుచు ప్రాణులన్మివుల ♦ సంతసమందగ దేశపాళినా ।
లోకనజేయుచున్విబుధ ♦ లోకముకెల్లను మేలుగూర్చుచున్ ।
వీకవెలుంగునెవ్వడల ♦ వేలుపు బ్రోచెడు నాంధ్రదేశమున్ ॥

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశము.)

సూ. స్త్రీలలంకారమునందు తెలివితేటలు జూపించెదరు గాని కర్తవ్యకార్యంబులం దుపయోగింపరు సమయాసమయంబులైనను గనిపెట్టనేరరు.

నటి. (ప్రవేశించి సభికులకు పుష్పాంజలియొనర్చి) మనోహరా "రూపేచరంభ" భార్య సుందరమున రంభను బోలియుండవలెనని జెప్పియుండ ఈశ్వరుం డొసంగిన రూపము నలంకరించుకొనవలదా.

సూ. మగువా భగవంతుడు ప్రసాదించిన దాని బాగొనరించుకొనుట కర్తవ్యమని బలికిన వచనమమోఘముసుమా? స్త్రీలు తెలివిహీనులని దలంచుచుంటిని గాని యది నేటికి పరిహారమైనది.

నటి. నాధా ఈ ప్రభావగర్భితముగా మాటలాడుటయందు ప్రావీణ్యుడవనియే నెరుంగుదు గాని ఏమర్మగర్భితముగా బల్కినదిగాదు.

సూ. (నవ్వి) ఉ॥ నీలభుజంగవేణినవ ♦ నీరజనేత్ర విచారమందగా ।
నేలప్రసంగవాక్యముల ♦ నేర్పడబొంగిన దానికేమిలే ।
స్త్రీలిటుమర్మవాక్యముల ♦ జెప్పుటలోకప్రసిద్ధమేకదా ।
కాలము వెంటబల్కితివి ♦ గాదనిబల్కిన లాభముండునే ॥

నటి. చిత్తేశ్వరా నీవు బల్కిన వాక్యములందుగల సందర్భము గోచరము నన్ను పరిభవించుటకా యేమి.

సూ. సఖీ భర్త భార్యను పరిభవించుటయు భార్య భర్తను పరిభవించుటయు సంతాపకరముగాదు గదా.

మ॥ ముగుదా యీశుడొసంగినట్టి తనువున్ ♦ బొల్పొప్పగా జేయుట ।
ల్దగుసంతోషము ధర్మమార్గమగునీ ♦ దారిన్ విలోకించిమా ।

మగవారట్టుల జేయబూనినను క్షే ♦ మంబొసగా నెంతయుం ।
పుగదేశంబునకట్టి మార్గములనే ♦ పుణ్యుల్ప్రసాదింతురో ॥

నటి. ఔను స్వయంప్రకాశుడగు భగవంతుడు ప్రసాదించినదాని బాగొనరించుకొనుట కర్తవ్యముగాని పురుషులూరకుండిరా యలంకరిష్ణులుగారా.

సూ. (నవ్వి) తా మలంకరించుకొనిన జాలునా దేశమాత నలంకరించవలదా. మన యాంధ్రదేశము దుర్దశల జిక్కియుండ దాని బాగొనరించకుండుట పురుషులకు కర్తవ్యమా.

నటి. సత్యము ఈశ్వరుడొసంగిన క్షేత్రముల బాగొనరించి తగు పాటుబడినగదా ఫలప్రదంబై యలరారి ప్రజలకు సుఖంబొసంగుట.

సూ. నిజమాడితివి దీర్ఘసుమాంగల్యవై వర్ధిల్లుము.

నటి. నీ యాశీర్వచనార్థము లెస్సగా ఫలించునుగాక మనమిచ్చట కరుదెంచియున్న విషయ మింతవరకు దెలిసినదిగాదు.

సూ. గీ॥ రాజభక్తినిబోధించు ♦ రమ్యచరిత । దేశభక్తినిబురికొల్పు ♦ దివ్యశక్తి ।
మహిమజూపెడుశ్రీయాంధ్ర ♦ మాతనాట । కముప్రదర్శింపగాదెయో ♦ కమలనేత్ర ॥

నటి. (జ్ఞాపకము దెచ్చికొనినట్లభినయించి) ఔను ప్రసంగవశంబున మరచితినిగాని యేతద్గ్రంథమును రచించినవారెవరు.

సూ. చం॥ వసుగణజాతమైయలరు ♦ వైశ్యకులంబున ధీరవంతుడౌ ।
బసవయనందనుండుశివ ♦ భక్తుడు పున్నయగుప్తసత్సుతున్ ।
భసితత్రిపుండ్రధారినుతి ♦ పాత్రయశుండును గ్రంధివంశసా ।
హసగుణ సుబ్బరాయకవి ♦ యంచు నెరుంగవె మానసంబునన్ ॥

నటి. ఓహో శ్రీ బాలవైద్యసుధాబ్ధి శోఫరోగనివారణి ధన్వంత్రీ వైద్యలహరీ వస్తుగుణప్రకాశికాది వైద్యగ్రంథములను గురుత్రయ ఘణియాగాది నాటకంబుల వ్రాసినవాడా.

సూ. ఔను. కవివరులపేరు లూరక జెప్పవలయునా.

నటి. ఈ గ్రంథమును వ్రాయుటకు కారణమేమి.

సూ. సీ॥ గణితంబునను బేరు ♦ గాంచెనపరయూక్లి, డౌననిధాత్రినె ♦ వ్వానితండ్రి ।
ప్రాకటశక్తిడి ♦ ప్టీక లెక్చరుజేసి, విలసిల్లెనెవ్వాని ♦ బిన్నతండ్రి ।
సుగుణశీలంబుల ♦ శోభిల్లిపతిభక్తి, వర్తనమించెనె ♦ వ్వానితల్లి ।
పరిచర్యలొనరించి ♦ భర్తకర్థాంగిని, యైనుతిగాంచెనె ♦ వ్వానిభార్య ।
గీ॥ అట్టిమచ్చేటివంశదు ♦ గ్ధాబ్ధిచంద్రు । డైనకేశవరాయని ♦ దానఘనుడు ।
వైశ్యకులమణిదేవేంద్ర ♦ వైభవుండు । కృతికిపాత్రత్వహితుడనస ♦ మ్మతముగాద ॥



నటి. ఓహో దెలిసినది బృందావనపురి నివాసియు వైశ్యకులమణియునగు డాక్టరు కేశవరావు యల్. యమ్. పి. గారు, దేశాభివృద్ధికి హేతువగు జాతీయ ప్రబోధగ్రంథముల ముద్రించుటకు సహాయమొనర్చుట శుభసూచకమే.

నటి. పురాణగాథలవలె జాతీయ సుబోధగ్రంథముల రచించువట్టి కవులు వెడలుట మాత్రము దేశాభివృద్ధి మార్గముగాదా.

సూ. కాలమునకు దగినబోధనములు చిత్రించుటకుబూనుట భావికాల భాగ్యాభివృద్ధి హేతువని జెప్పవచ్చును.

నటి. మానినీ వృత్తము.

కాలము వెంటను దేశ మొకప్పుడు ♦ గాంచుసమున్నత భాగ్యములన్ ।
కాలము వెంటను దేశ మొకప్పుడు ♦ గాంచునుహీనదశల్దలపన్ ।
కాలము వెంటను దేశ మొకప్పుడు ♦ గాంచునుకర్వులరోగములన్ ।
కాలము వెంటను దేశ మొకప్పుడు ♦ గాంచుయశంబును పూర్ణముగన్ ॥

సూ. చానా నీవుబాడినగీతము శ్రావ్యముగానున్నది యొకప్పుడు దేశము భాగ్యవంతమై యలరారుటయు నొకప్పుడు దుర్దశల ననుభవించుటయు నిజము మనయాంధ్రదేశముగతి గనబడుటలేదా ఓడలుబండ్లు బండ్లుఓడలు కొన్నినాళ్లు వెన్నెల కొన్నినాళ్లు చీకటి మనచేత నేమికాగలదు యొకప్పుడు దేవతలచే యోటువడిన బలిచక్రవర్తి యొకప్పుడు యింద్రాధిపత్యము వహించియుండలేదా అంతయు ఈశ్వరేచ్ఛ.

నటి. ఔను. సుగంధి వృత్తము.

లోకమందు దేశపాళి ♦ లోనభాగ్యభోగ్యముల్ ।
లేకచాల కష్టమోర్చి ♦ లేమిజిక్కిచాలరా ।
స్వ్యాకుదీసి పోకనిల్చి ♦ సాహసంబుజూపుచున్ ।
శ్రీకరంబుగా జపాను ♦ చెల్వుమించలేదొకో ॥

మనకీ విచారమేల చేతనరక్షకుడగు శ్రీమద్బదరీనారాయణుడు మన భారతవర్షమున కధిపతియైయుండ మనకు కొదవేమి కాలయాపనమౌచున్నది పోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు)

ఇతి ప్రస్థాపన.

---

# ఆంధ్రమాత - ప్రథమాజ్ఞము.

(ప్రవేశము - బదరీనారాయణుడు.)

సీ॥ నాయధికారంబు ♦ సంగలభారతా, వనికుమారికలస ♦ ద్వర్తనములు।
తెలియవచ్చుటలేదు ♦ స్థితిగతులెంచగా, వారిసంతానమై ♦ భవములెట్లొ।
దేశమాతలసేవ ♦ దృష్టిగాజేయుచు, నున్నట్లుదోచదు ♦ గన్నసుతులు।
హాయిగనొకరిస ♦ హాయముగోరక, బ్రతుకుమార్గంబుల ♦ బాటవిడచి।
గీ॥ సేవకావృత్తియేమహా ♦ శ్రేష్ఠమనుచు। దాల్చియుద్యోగములనుదు ♦ ర్దశలబొంది।
కష్టబడుచున్న తమ్ముల ♦ గాంచకతమ। ఘనతకేబొంగుచుండుదు ♦ రనవరతము॥

ప్రజలు స్వయంజీవనాపరులై మతభేదంబులమాని సహోదరభావముల నైకమత్యముబూని దేశాభివృద్ధికై పాటుపడుచుండిన దుర్దశాకష్టములేలగల్గును. కృషియొనర్చక భగవంతుడున్నాడని నిద్రబోవుచున్న యతడేమి యొనర్పగలడు. అమ్మయైనను అడుగనది బెట్టదను సామ్యమైనా వారికి తెలియకుండెను వారికర్మ కేవరేమి చేయగలరు. దేశమాతలయినను సంతతుల కష్టములకు విచారపడుచుండుటెగాని సదుపదేశములు జేయుచుండుటలేదు. ఐనను వెన్నెలకొన్నినాళ్లు చీకటికొన్నినాళ్లు సౌఖ్యములనెప్పుడు నొక్కదేశమే యనుభవించుచుండునా ఒకప్పుడు సుఖము నొకప్పుడు దుఃఖము ననుభవించవలసియేయుండును. దేశమాతలు తత్సంతతులు నిద్రమేల్కొనినప్పుడే నాసహాయము జూపవచ్చును. నన్ను మరచియున్నప్పుడు వారిసంగతులు నాకేల.

సీ॥ ఏరాజ్యమరయగ ♦ భూరివిద్యాపాంధి, గాంచునొయది పెంపు ♦ గాంచగలదు।
యేరాజ్యమరయగ ♦ భూరివాణిజ్యాభి, వృద్ధిజెందునొయది ♦ వృద్ధిజెందు।
యేరాజ్యమరయగ ♦ భూరిసేద్యంబుల, నెలకొల్పబడెడినో ♦ నెగడునదియు।
యేరాజ్యమందున ♦ భూరిభక్తిని దేశ, మాతబూజింతురో ♦ ఖ్యాతినలరు।
గీ॥ నరయ నేదేశమందున ♦ నైకమత్య। మునను వర్తించుచుందురో ♦ పురుషులంత।
గాంచు నాదేశమెప్పుడు ♦ మించుభాగ్య। ములను సౌఖ్యంబులను ♦ పుణ్య ♦ ములజెలంగ॥

(నిష్క్రమించును)

ప్రవేశము - పౌరాణికుడు.

సీ॥ విష్ణుచరిత్రల ♦ విమలధర్మంబుల, వినగోరరెవ్వరు ♦ వేడ్కమీర।
వీనులకింపుగా ♦ వేదవేదాంతార్థ, ములగాంచరెవ్వరు ♦ మోదమలర।



విజ్ఞానమయమగు ♦ వేమనసూక్తుల, జెప్పిననేరికి ♦ చెవులజొరవు।
ఆశ్రమపద్ధతు ♦ లరసివర్తింపంగ, జూడరు స్త్రీలను ♦ జూచుచుంద్రు।
గీ॥ సంస్కృతంబనతలనొప్పి ♦ శాస్త్రములన। నిరసనముశీలమెంచగ ♦ నిందితంబు।
దేశభాషలయభిరుచి ♦ దిరిగిపోయె। కాలమహిమంబదేమొనే ♦ గాంచలేను॥

"ఆర్యావర్తపుణ్యభూమి" యనిజెప్పియుంత దీనికిన్ని కడగండ్లు గలుగుచుండె రాజకీయవ్యవహారంబులకు తద్భాషాభ్యాస మొనరించినను తల్లివిద్యయగు సంస్కృతమందును దేశభాషయగు ఆంధ్రమందును నిరసనమేలజూపవలెనో దోచకున్నది.

(ప్రవేశము - హాస్యకుమారుడు)

పౌరాణికా నీమాటలు చెవినిబడినవి సంస్కృతాంధ్రములు కూడుగుడ్డనిచ్చునాయేమి ఏమో నాలుగింగ్లీషుముక్కలు చదివితే బ్రతుకుదెరవు లంచములో పంచములో ఎటులయినా డబ్బు సంపాదించవచ్చును. పలుకుబడియుంటుంది.

ప్రవేశము - ఆనందగుప్త.

ఆ. పౌరాణికశాస్త్రి వందనము (నమస్కరించును)

పౌ: దీర్ఘాయుర్భవతి వాణిజ్యలాభసిద్ధిరస్తు.

ఆ. మీరెద్దియో విచారమొందుచున్నటులున్నదే.

పౌ. నావిచారము పురాణములు శాస్త్రములు పంచాంగములు యెవరికిబట్టును జెప్పినను వినువారెవరు నాన్నెన్ను పురాణములట దానియర్థముకూడా నాకు తెలియదు.

హా. మన నవనాగరికులకు పురాణములు తలనొప్పియే.

ఆ. ఉ॥ భీమగదాహవంబునల ♦ భీష్మునిసైన్యపతిత్వపద్ధతిన్।
స్తోమము కర్ణసాహసము ♦ శూరుకిరీటి పరాక్రమంబుశ్రీ।
ధాముని చక్రసాధనవి ♦ ధానము నాయభిమన్యుశక్తియున్।
రాముని విక్రమంబుకపి ♦ రాముని భక్తివినంగజెల్లదా॥

పురాణములంగల మహావీరుల చరిత్ర లాకర్ణించుట పాపమా? గావుననే శౌర్యబలాదుల బోగొట్టుకొని నది కేవలము శ్రవణ మనన నిధి ధ్యాసలులేనిదెద్దియు పట్టుబడనేరదు విజ్ఞానమమాత్రము పట్టుబడునా. భారత భాగవత రామాయణాది గ్రంథములవినవలె వారిశౌర్య ధైర్య గాంభీర్యాదుల పట్టుబడవలె ప్రహ్లాదచరిత్రమనేక సారులు చిన్నతనమందు భజియించియుండుటచేతనే మహాత్మా గంధి దేశభక్తుడైనది.

హా. చిన్నా భారతమే వినవలె తినినా గారెలనేతినవలె. ఎన్నినవలలు జదివినా సార్థకమేమి.

పా. ఏమోయిగుప్తా నీదెబ్బ ఒకపద్యములోనే భారత భాగవత రామాయణముల మహావీరుల జేర్చుకొనినావు యిప్పుడిట్టివి చదివితే నవనాగరికులు కొట్టవచ్చెదరు.

ఆ. నేను భయపడను.

సీ॥ అలమహాదేవునా ♦ హవమందుజయమును, గొన్నరుద్రమదేవి ♦ వన్నెగాంచ ।
మగవేసమునవైరి ♦ మదమణగించిన, రాణిదుర్గావతి ♦ రామగాంచ ।
పురుషరూపమునయ ♦ క్బరుజంపబూనిన, వనితరామాబాయి ♦ వాశిగాంచ ।
పతివైరిచేజిక్కి ♦ హతమైనవెన్కక, ర్మాదేవిసాహస ♦ క్రమముగాంచ ।

హా. అరణ్యకమలుడు భర్తనుజంపి తన్నవమానపరచ దలచినపుడు ఎడమచేతిని తాను ఖండించుకొని సేవకునిచే కుడిహస్తమును ఖండింపజేసికొని తండ్రికిని మామకు నాచేతులబంపి యీనూతనదంపతులు స్వర్గమున సుఖముగానున్నారని వర్తమానమంపిన కర్మాదేవియా ఏమిసాహసము. ఇట్టివారిని గనియున్న భారతభూమి నేడెట్లులున్నదో చూడుడు.

ఆ-గీ॥ బ్రహ్మనాయునిరణమున ♦ బరిభవించి । నట్టినాయకురాలిధై ♦ ర్యంబుగాంచ ।
నిపుడుభయమగుపురుషుల ♦ నెరుగనిటుల । కాలగతిబకై ధీరవి ♦ క్రమములణగి ।

హా. మంచిదెబ్బ దీసినావు, బాగాయున్నది. మహాధైర్యసాహసములుగల్గిన సోమయాజిగారి యుపదేశమువలన నీకీమార్గము పట్టువడినట్లున్నది.

పా. వేదార్థముల ప్రచురించిన లక్ష్మీనరసింహ సోమయాజిగారి దుహిత్రుదేవియో సన్మానపతకము లందినట్లు వదంతి బుట్టియున్నదే. ఆ. ఔను.

సీ॥ శృంగారమల్లరార ♦ చిత్రలేఖనమున, మాంసాశనంబును ♦ మద్యపాన ।
దోసములనుగూర్చి ♦ వ్యాసములనువ్రాసి, లలితమైమించునీ ♦ లగిరిసర్వ ।
జాతీయనీతిప్ర ♦ చారసంఘముచేత, ధర్మపతకముల ♦ వడసినట్టి ।
సరసుడుమాజేటి ♦ సత్యనారాయణ, మల్లికార్జునరాయ ♦ మహితయశుడు ।
గీ॥ దగనిరాపథవైద్యశా ♦ స్త్రపరిచయుడు । కవితజ్ఞానామృతాదిస ♦ ద్గ్రంథకర్త ।
భక్తిశాంతిపథంబుల ♦ వ్రాసినట్టి । యువకుడార్యవైశ్యోత్తము ♦ డవనిబరగు ॥

హా. అబ్బా నీలగిరి సర్వజాతీయ నీతిప్రచార (The international order of good templars) సమితిచేతనా.

ఆ. ఇంతియేనా. బర్మింగుహామ్పట్టణ ది యూనియన్ ఆఫ్ ఎడ్యుకేషనల్ యిన్‌స్టిట్యూషన్సువారిచే చిత్రలేఖోన్నత పరీక్షగౌరవము వడసియుండెను. శ్రీజీవదయాజ్ఞానప్రసారక సంఘమువారు భారతభూమి కేర్పాటుజేసిన శాకాహారప్రాశస్త్య మాంసాహారఖండనములకును, దేవతల్లకు జంతుహింసారూపకమగు బలులనిచ్చుట అశాస్త్రీయమని నిరూపించుటనుగూర్చి వ్రాసిన వ్యాసములకు గౌరవపతక పత్రగ్రంథధనముల గైకొనియుండెను.



పా. ఆహా యంతటివాడా, యువకుడేగదా.

ఆ. బుద్ధివ్యాపనమునకు యువకులైనను పెద్దవారైనను యొకటే.

హా. ఆంధ్రరాష్ట్ర చిత్రలేఖన ప్రదర్శనమున తైలమిశ్రమనీరమిశ్రమ చిత్రలేఖనములందు ప్రథమగౌరవ సువర్ణపతకములను వడసియున్నాడటే.

ఆ. యదార్థము.

గీ॥ క్షీరమృత్తికపానీయ ♦ చిత్రభాను । కిరణఫలనిరాహారచి ♦ కిత్సలరసి ।
బీదజనములకేవేళ ♦ ప్రేమమీర । సల్పుచుండునుసద్ధర్మ ♦ సరణిదేలి ॥

హా. అబ్బా క్షీరపానచికిత్స, జలచికిత్స, సూర్యకిరణచికిత్స, నిరాహారాదిచికిత్సల జేయగలడా లక్ష్మీసరస్వతు లొక్కతావున నివసించుట ఈ యువకునియందు దక్క మరొకచోట గనుపించుటలేదు.

ఆ. మేనమామ పోలికలు మేనత్త సారికెలుగదా ఈ విద్యావిభ్రాజితుని మేనమామ చిత్రలేఖనాప్రవీణుడు మాతామహుడు వేదవేదార్థప్రవీణుడు పితృవ్యాదులతి ధనికులు.

హా. ప్రతిమాలేఖన కుశలుడా. (ఆలోచించి) దెలియకున్నదే.

ఆ. మ॥ ఘనశృంగారముగాను చిత్రపటముల్ ♦ ఖ్యాతిన్గనన్వ్రాసెనే ।
యనఘుండారవివర్మసాటియయిశి ♦ ల్పాదుల్మదిన్మెచ్చిసై ।
యనరూపంబులదీర్చునట్టిసుగుణుం ♦ డాత్మజ్ఞశ్రీరామమో ।
హనరాయుండలరారుపూర్ణతరబ్ర ♦ హ్మానందసుస్వాంతుడై ॥

హా. ఓహో దెలసినది ఇప్పుడనేకాంధ్రులు వారిచే శిక్షితులై చిత్రలేఖనాకుశలులై యొప్పుచున్నారు. రామమోహనుడు కళింగదేశాధీశుడైన ఆనందగజపతిమహారాజావారి సన్నిధిని కొంతవరకును, కొద్దికాలము రవివర్మగారి సమక్షమునను తచ్ఛిష్యుడైన పరమేశ్వరంపిళ్ల సదనంబునను చిత్రలేఖనావిద్యను గ్రహించి ప్రావీణ్యుడైనది నాకు గోచరమే.

పా. బృందావనపట్టణంబున పూర్వమునుండి వైశ్యులలో పేరుప్రతిష్ఠలు గలవారలున్నట్లు దెలియుచున్నది. సోమయాజులుగారికి పూర్వమింకెవ్వరో యున్నారు. జ్ఞాపకము వచ్చుటలేదు.

ఆ. ఉ॥ వేమయస్మార్తకర్మలను ♦ వేడుకసల్పుచు వైశ్యజాతిలో ।
నామకుడౌచు సంస్కృతము ♦ నన్ ఘనమైన శతావధానముల్ ।
భూమినొనర్చి బిర్దులను ♦ బొందుచు పండితరాయుడైనయా ।
మామిడి వెంకటార్యుజన ♦ మాన్యనెరుంగవె విప్రపుంగవా ॥

హా. కోమటులలో కూడా ప్రసిద్ధులున్నారే?

ఆ. వెంకటార్యులవారు వ్రాసిన శబ్దార్థకల్పతరువు అను సంస్కృత నైఘంటికమునకు గౌర్నమెంటువారు వేయివరహాలు బహుమతినొసగి పండితరాయలను బిరుదమొసంగి తమ పండితసభలో ప్రథమపండితునిగా నేర్పాటుజేసికొనియున్నారు.

పా. ఇంకేమయినా గ్రంథముల వ్రాసియుండెనా?

ఆ. విశేషశబ్దచింతామణి ఆంధ్రలక్షణము రత్నశాస్త్రము మొదలగు గ్రంథముల వ్రాసియుండెను. వారిగ్రంథము లీనెనుక ముద్రితములు గాకయుండుటచే నైఘంటికాదుల మరికొందరు పేరులమార్చి శబ్దములమార్చియు తమపేరుబెట్టుకొనియున్నారు.

హా. ఇంతమంది నైశ్యధనికులుండి కన్నులదెరచిజూచుచు మిన్నకుండిరా. వారికి ద్రవ్యమే ప్రాధాన్యము. పసువుప్రతిష్ఠలెందుకు.

ఆ. ప్రస్తుతము భూమండలము ఆఫ్రికా అమెరికా ఆసియా ఆష్ట్రేలియా ఐరోపా యను ఖండములైదుగా విభాగింపబడి యున్నదిగదా యివి మనపురాణములలో వివరించిన భూగోళవివరమున కేమయినా సంబంధించియుండునా.

పా. మన మేఖండములోని వారమని చెప్పుదురు.

ఆ. ఆసియాఖండములోని వారమట.

హా. ఎవరిపిచ్చి వారికానందము ఈగుప్తపు ప్రస్తుతము జరుగుచున్న భారతావనియాందోళనము నిరంకుశపాలనావిధానము యుద్ధమధ్యమున హైందవులకుబంపిన వాగ్దత్తములు భారతవీరుల సహాయముచేజయముగొనినపిమ్మట జూపిన యసంతృప్తి రౌలటుబిల్లు దేశభక్తుల ప్రవాసశిక్షలు ఇవియేమియుబట్టవు పురాణములనిన చెవులుకోసికొనును. ఏమిపాపమో మనవారికి రాజకీయవిధానములు గ్రహించడమును పత్రికాపఠనమును తలనొప్పి చీట్లపేకయనిన నిద్రాహారములయినను మానుచుందురు. క్లబ్బులలోకూడా చతుర్ముఖరామాయణపారాయణమే.

పా. నాకివి తెలియవుగాని సూర్యరస్మి యెంతవరకు ప్రసరించునో యంతవరకుగల భూమి ప్రియవ్రతుని రథసంచారమున జంబు, ప్లక్ష, శాల్మలి, క్రౌంచ, కుశ, శాక, పుష్కర, ద్వీపసప్తకమును సప్తసముద్రములుగా నేర్పడెననియు అందు జంబూద్వీపంబున ఐరావత భద్రాశ్వ హిరణ్మయ భారత రమణక కేతుమాల కింపురుష ఇలావృత హరివర్షములు తొమ్మిదిగలవనియు దెలియవచ్చును.

ఆ. నవఖండములెవ్వి.

పా-గీ|| సౌమ్యగాంధర్వవారుణ ♦ చరుగభస్తి। భరతనాగేంద్రతామ్రము ♦ లరయగుప్త।
భరగునవఖండములువీని ♦ ద్వాపరాంత। మునసుయోధనుడేలెను ♦ ఘనతమించ||



ఆ. మనదేద్వీపము యేవర్షము యేఖండము.

పా-గీ|| దెలుపనేరనునేరేడు ♦ దీవిమిత్ర। భరతఖండముభారత ♦ వర్షమింపు।
క్షితిధరాదులుపుణ్యాసు ♦ క్షేత్రసమితి। దేజరిల్లునుదివ్యన ♦ దీనదములు ||

ఆ. మనది పుణ్యభూమియని జెప్పుచుందురది నిజమా.

హా. ఈతెప్పగడచితే పుణ్యభూమియే మనసంగతులకు మన మానందము చెందవలసినదే.

పా. వాస్తవము.

ఉ|| భారతవర్ష జంతువుల ♦ భాగ్యములేమని జెప్పవచ్చునీ
భారతవర్షమందుహరి ♦ పల్మరుబుట్టుచు జీవకోటికిన్ ।
ధీరతతోడ దర్శ్యముప ♦ దేశముజేయుచు జెల్మిసేయుచు ।
న్నారయబాంధవాకృతిగ ♦ తార్థులజేయుచు నుండు నెంతయున్ ||

భాగవతము – పంచమస్కంధము.

హా. వృధా కాలయాపనమే సత్కథాకాలక్షేపముగాదు నిరంకుశపాలనా విషయములుగావు ముందు బువ్వదొరికితే పిమ్మట పురాణములు.

పా. మనవర్షంబున మనుజుడంత్యదశయందొకక్షణము హరినామస్మరణ గావించిన వైకుంఠము లభించగలదు.

ఆ. అవసానకాలమందదిమాత్రము సులభమా మరణావస్థయందు సూనుడగు నారాయణుని జీరియేకదా అజామీళుడు వైకుంఠమునకేగినది.

హా. జావనున్నవారిని నారాయణ యనిపించుట సులభమా అబ్బో ఎట్టులయినా మొదటియక్షరములైనా పలికించెదమనిబూని నారయనమనిన పీచందురు.

ఆ. మన జంబూద్వీపమునకేమయినా యుపద్వీపములున్నవా.

పా. ఆహా. గీ|| మందరాసరత్నవలురము ♦ మాణహరిణ ।
చంద్రశుక్లము స్వర్ణప్ర ♦ స్థములుపాంచ ।
జన్యసింహాళములు ధాత్రి ♦ జలగుచుండు ।
హితయుపద్వీపములుగాను ♦ సతతమెంచ ||

హా. ఓహో మనవారు సింహళము (సిలోను-లంక)ను గనుగొనియున్నారే వారికి సముద్రయానము తెలియదను వారేమి చెప్పుదురు.

ఆ. మన ఖండమునందెన్ని దేశములున్నవి.

పా. చప్పన్నారుదేశములు అనగా యేబదియారు.

ఆ. అవియెవ్వి.

పా. సీ|| అంగకొంకణకళింగ ♦ గాంధారవరవంగ, మాళవనేపాళ ♦ మగధచోళ ।
కాశ్మీరసౌరాష్ట్ర ♦ కాంభోజసౌవీర, పాంచాలసింహళ ♦ పాండ్యమద్ర।

నాటకర్ణాటపు ♦ రాటప్రళిందాంధ్ర, గాంధారబాహ్లీక ♦ సింధువత్స ।
మళయాళమహారాష్ట్ర ♦ మత్స్యకొంకణగౌళ, కేరళకుంతల ♦ సూరసేన ।
ఘూర్జరపారశ్వ ♦ కురుకరూశవిదేహ, జాలంధ్రబర్బర ♦ సాల్వయవన ।
గీ॥ లాటద్రావిడహూణాంగ ♦ రాతభోజ । ద్రవిళకేకయచేదివి ♦ దర్భకుకుర ।
కోసలదశార్ణదేశముల్ ♦ గూడికొనిత్రి । గర్తయేబదియారగు ♦ ఘనవిచార ॥

ఆ. మన ఆంధ్రదేశ మెంతవరకుగలదు.

పా. తూర్పుసముద్రమంటి గంజాంజిల్లావరకును దక్షిణము చెన్ననగరంబువరకును పడమర బళ్లారి తుదవరకును యుత్తరమున నైజాములో కొంతవరకునుగలదు.

ఆ. భాషనుబట్టియేనా దేశవిభజనము. పా. ఔను.

ఆ. మనదేశమునకు జుట్టియున్న దేశభాషలెవ్వి.

పా. గీ॥ ధనరునోఢ్రముతూర్పున ♦ దక్షిణమున। బరగుద్రవిడము నాపైన ♦ పడమరదిశ।
కన్నడము యుత్తరంబున ♦ ఘనతయుర్దు। భాషలొప్పునుదిక్ప్ర ♦ భావమునను॥

ఆ. ఆంధ్రమునకు తెనుగునామ మెటులకలిగినది.

పా. క॥ శ్రీక్షితిధరకాళేశ్వర । దాక్షారామంబులనగ ♦ దనరారెడునీ ।
త్రిక్షేత్రంబులలింగము । లీక్షితినిత్రిలింగసంజ్ఞ ♦ కెన్నికకెక్కెన్ ॥
గీ॥ తత్త్రిలింగనివాసమై ♦ దనరుకతన । ఆంధ్రదేశముదాత్రిలిం ♦ గాఖ్యమయ్యె ।
దెలుంగగుచుద్భవముదాని ♦ వలనబొడమె । వెనుకకొందరుదానినే ♦ తెనుగునండ్రు॥

హా. ఈగుప్త కోమటియుక్తిచే శాస్త్రిగారి నగాధమునకుదింపి పరిభవింపజూచుచున్నట్లున్నది.

ఆ. శా॥ ఏయేపుణ్యతరంగిణుల్గలవొయిం ♦ దేగాయకుల్గల్గిరో ।
ఏయేక్ష్మాధర రాజముల్వెలుగునో ♦ యేదేవతల్ పూజ్యులో ।
ఏయేయాత్రలో ఘోరకాననములే ♦ యేసస్యపుంజంబులో ।
యేయేసత్కవులేరు దానపరులో ♦ యింపారగాదెల్పుమా ॥

పా. జన్మపావనమగు సంగతులడుగుచున్నా వీదినము శుభదినమని తలంచెద. అడుగు వారులేక నాజిహ్వ తృప్పుబట్టిపోయినది.

హా. శాస్త్రిలుగా రుబ్బిపోవుచున్నారు చివరకు మనగుప్త యేమొనర్చునో తెలియకున్నది.

పా-గీ॥ వినుతికెక్కినశ్రీకృష్ణ ♦ వేణితుంగ।భద్రగౌతమీనదులుస ♦ భంగయుక్త ।
వారిచేపూతమైదన ♦ రారయాంధ్ర ♦ దేశమొప్పును సుక్షేత్ర ♦ దీప్తమగుచు ॥

దీక్షితత్యాగరాయాది మహాగాయకులచే యలంకరింపబడి సింహాచల భద్రాచల వేదాచల ద్రోణాచలాది యచలంబులుగల్గి యనేక గిరిదుర్గమారణ్య సత్ఫలభరి



తాగమ కుసుమవల్లీవితానసస్యంబులం దేజరిల్లి మనయాంధ్రభాషాభిక్షాపరుల నేత్రంబులకు విందొనరించుచుండును నెల్లూరు గుంటూరు నల్లగొండ భూపాటి రేనాటి పూగినాడు పెనుగోడు మాడురేవి మొదలగు సీమలుగల్గి శ్రీశైల కాళహస్తి కాళేశ్వర ద్రాక్షారామ వేదాద్రి మంగళాద్రి సింహాద్రి మొదలగు క్షేత్రంబులచే పవిత్రవంతమై హనుమంత విఘ్నేశ్వర శివ విష్ణు పరమేశ్వరి మొదలగు దేవతానిలయమై శోభస్కరముగానుండును.

హా. పౌరాణిక స్వభావముపోదు యనేక దివ్యమసీదులతోను అనిన పరువుప్రతిష్ఠలకు నష్టమా. మహమ్మదీయ సోదరులకును సంతోషకరముగా నుండును గదా. మరియు క్రైస్తవచర్చిలున్ను అని పొందించిన మిక్కిలి బాగుగానుండి యుండునుగదా. అటుల మతసహనము బూనిన ఐకమత్యము ప్రబలి దేశము బాగుపడిన లాభమేమి.

ఆ. ఆంధ్రగర్భములో నివసించువారందరి ప్రార్థనామందిరముల జేర్కొనవలసినదే.

పా. ఏమో. పూర్వకాలమువాడను నాకిప్పటి గొడవులు బట్టవు.

సీ॥ భారతాంధ్రీకృత ♦ ప్రావీణ్యులౌకవి, త్రయమునుగన్నట్టి ♦ తలిరుబోడి ।
భక్తిప్రధాన్యుడౌ ♦ బమ్మెరపోతనా, మాత్యునిగన్నట్టి ♦ మహిమరాలు ।
రామాయణమ్మునాం ♦ ధ్రమునరచించిన, భాస్కరుగన్నట్టి ♦ పరమసాధ్వి ।
ద్విపదకావ్యంబును ♦ ధీరతవ్రాసిన, రంగనాథునిగన్న ♦ రమ్యచరిత ।
గీ॥ విమలరాఘవపాండవీ ♦ యమునువ్రాసి । నట్టిపింగళిసూరనా ♦ ర్యునిబుక్క।
పట్న వెంకటాచార్యుని ♦ బడసినట్టి । యతులకరుణాసమేతయీ ♦ యాంధ్రమాత ॥

హా. రాఘవపాండవీయ మచలాత్మజాపరిణయ ద్వ్యర్థిప్రబంధకర్తలా. త్ర్యర్థి చతుర్థికావ్యముల వ్రాసినవారు గలరట నలయాదవరాఘవపాండవీయమను చతుర్థికావ్యకర్త యొక్కరున్నారని ప్రతీతికలదది నాకు లభించియుండలేదు.

ఆ. ఏదైనను మాతపడునుగాని హాస్యకుమారునినోరు మాతపడదు పౌరాణికశాస్త్రి వానితోనేమి వివరింపుము.

పా-సీ॥ ధరనాంధ్రకవితాపి ♦ తామహుండలసాని, పెద్దనార్యునిగన్న ♦ ముద్దులమ్మ ।
వసుచరిత్రము వేడ్క ♦ వ్రాసినశ్రీరామ, రాజభూషణుగన్న ♦ రమ్యచరిత ।
భావజ్ఞునెలకూచి ♦ బాలసరస్వతి, త్ర్యర్థిసత్కవిగన్న ♦ తలిరుబోడి ।
హృద్యంబుగాసీస ♦ పద్యంబులనుగూర్చు, శ్రీనాధుకవిగన్న ♦ చెలువమిన్న ।
గీ॥ కీర్తిమించినకవివర్య ♦ కేతనాఖ్యు । విష్ణుచిత్తీయమునువ్రాసి ♦ వినుతిమిఱచు ।
కృష్ణరాయక్షితీశుని ♦ కృపనుగన్న । యతులపుణ్యనదీపూత ♦ యాంధ్రమాత ॥

హా. ఎంతమంది కవులున్నను ఏదో పుక్కిటిపురాణముల వ్రాసిరేగాని టర్గినీవు, టాలుస్టాయి, డస్టోయస్కీ, మెక్సిమ్‌గోర్కీ మొదలగు కవిపుంగవులవలె దేశమును నిద్రనుండి మేల్కొల్పగల్గిరా. మానవులను స్వతంత్ర్యమునకై పాటుబడుమనటుల బోధించిరా *‘‘సకల మానవులకొరకు సృజింపబడిన భాగ్య భోగ్యములను ఏకొలదిమందియో రాజ్యాధికారముచేతను ధనబలముచేతను హస్తగతము జేసికొని అశేషజనమును దారిద్ర్యకూపమున బడవేసి వారియన్న తిని నిరోధించుచున్నపుడు లోకములోని నేరములకు నిజముగ నెవరు బాధ్యులు’’ అని డస్టాయస్కీ వ్రాసిన శ్లోకవులు గ్రంథములవ్రాసి బీదజనముల కుపదేశ గురువులై యలరారియుండిరి ఏనాటకములో యేనవలలో ఏకావ్యములో ఏదో అంతుపొంతులేని కథలతోనే ప్రొద్దుపుచ్చుకొని శరీరయాత్ర జాలించు కొని యుండిరి.

పా-గీ॥ అకటవికటకవిని ♦ సకలదేశంబుల । చిత్రకథలస్తోత్ర ♦ పాత్రుడైన ।
రామలింగకవిని ♦ ప్రేమతో గాంచిన । యాంధ్రమాతబొగడ ♦ నలవియగునె ॥

హా. ఓహో రాయలువారతల్లి మామిడిఫలముల పేక్షించి పరమపదించుటచే బ్రాహ్మణ శ్రేరిలంబున బంగారపు మామిడిపండ్లను దానమివ్వ గని యోచ్చక తనతల్లి వాతముచే పీడింపబడి రక్షలుకోరి జచ్చినదనిజెప్పి కాల్పించి భయంపెట్టి సువర్ణచూతఫలములన్నియు గుంజినవాడా జలే యతనికొంటెపనులు నాకు చాలాసంతోషము.

ఆ. నీవట్టివాడవే గాన సంతోషమే. మధ్య నిదియొకమిడిమేలము.

పా- గీ॥ క్షేత్రవిస్తీర్ణముల గ్ర ♦ హించెడివిధంబు ।
లరసిగ్రంథంబుగావ్రాసి ♦ నట్టిపావు ।
లూరిమల్లనగణితవి ♦ శారదుని మ ।
హాకవినిగన్నగుణజాత ♦ యాంధ్రమాత ॥

గీ॥ వాసిగనురామచరితము ♦ వ్రాసినట్టి ।
మొల్లమాంబనుబొగను ♦ ముద్దుపళని ।
విమలసుజ్ఞాని తరిగొండ ♦ వెంగమాంబ ।
యువతులనుగని మనయాంధ్ర ♦ యుర్విప్రబలె ॥

కం॥ మంత్రియుగంధరుభాస్కర । మంత్రినిరామప్రధాను ♦ మతిలిక్కనస
న్మంత్రినియక్కనమాదన । మంత్రులనేమాతవడసె ♦ మహితఖ్యాతిన్ ॥

హా. యుగంధరుడు యుగంధరుడే.

---

* 19 సంపుటము 34 సంచిక 6 పేజి కృష్ణాపత్రిక.



ఆ. ఆహా పూర్వము మనదేశజనని కెట్టి పుత్రికాపుత్రులు లుద్భవించియుండి రట్టిధీరో దార శౌర్యపరాక్రమ విఖ్యాతచరిత్రులును దేశభక్తులును యిప్పుడు గని పించుట దుర్లభముగదా కాలవైపరీత్యము.

హా. కాలవైపరీత్యమా. అట్లనిన మిళితద్రవ్య వ్యాపారసమితుల కాగ్రహము వచ్చు నేమో. వారికి కాలము బాగానేయున్నది. ఈమధ్య కంట్రోలుపద్ధతికూడా వారిని బాగానరించినది.

ఆ. వృథా కాలయాపనమౌచున్నది వినుపించదలచిన విషయములను వివరింపుడు.

పా-గీ॥ జైనమతమునుఖండించి ♦ జయముగాంచి । వేదధర్మంబులనునిల్పి ♦ వినుతికెక్కి ।
నట్టివానికుమారిల ♦ భట్టుపుత్ర । రత్నమును గాంచిమించినే ♦ రమ్యగాత్రి ॥

సీ॥ *ఆంధ్రసత్సామ్రాజ్య ♦ మాదినిస్థాపించి, నట్టివాడేమాత ♦ పట్టిగాడ ।
దిగ్విజయము గొన్న ♦ ధీరసముద్రగు, ప్తాఖ్యుడేజననికి ♦ నాత్మజుండు ।
గోతమీపుత్రుడౌ ♦ శాతవాహనశాత, కర్ణుడేతల్లికి ♦ గన్నసుతుడు ।
రణరాగుడనుఖ్యాతి ♦ గ్రాలినజయసింహ, వల్లభుడేయమ ♦ ప్రౌఢసుతుడు ।

గీ॥ వేంగిపురనాథుడైనశ్రీ ♦ విజయదేవ । వర్మయేదేశజనయిత్రి ♦ వరతనయుడు ।
చోడవిక్రముడేభూమి ♦ సూనుడెంచ । నట్టిమనయాంధ్రమాతపెం ♦ పలరలేదె ॥

సీ॥ రాట్పరమేశవి ♦ రాజబిరుదుగొన్న, పృథ్వీవల్లభుగన్న ♦ వెలదిమిన్న ।
త్యాగసముద్రస ♦ ద్భోగవిక్రమచోడు, కడుపారగన్నట్టి ♦ కుంజనేత్ర ।
భారతకృతికర్త ♦ భాగ్యుడౌరాజన, రేంద్రునిగన్నట్టి ♦ చంద్రవదన ।
దర్పాఢ్యుడైనప్ర ♦ తాపరుద్రునిరుద్ర, సముపార్థివునిగన్న ♦ సత్యవాణి ।

గీ॥ దేశభాషానదూటీని ♦ దివ్యముగను । పోషణ మొనర్చినట్టిస ♦ త్పుణ్యుకృష్ణ ।
దేవరాయలగన్నట్టి ♦ ధీసమేత । గాదెమనయాంధ్రమాతవి ♦ ఖ్యాతచరిత ॥

హా. వెనుక నిట్టి యున్నతదశ నందియుండియే యిప్పుడిట్లుంగలార్చుట యిప్పుడు మాత్రము కొద్దిగనో గొప్పగనో లేకుండిరా.

ఆ. శా॥ దేశారాధన మార్గబోధనలస ♦ ద్దివ్యోద్యమాలింసుసం ।
కాశంబందగనాంధ్రపత్రికనుప్ర ♦ ఖ్యాతిన్గనన్ జేసెనా ।
కాశీనాథుని వంశసాగరవిధున్ ♦ కారుణ్యదీప్తాత్మునా ।
గేశార్యున్ భువినెన్నగాదరమెనా ♦ గేశుండెసత్యంబుగన్ ॥

హా. శేయింబవలు పురాణములు పంచాంగములు జదువుకొను వారికి పత్రికాధిపతులు భాషాసేవను లెట్లు దెలియగలరు.

---

ఆంధ్రవిష్ణువు.

ఆ. మ॥ చదువన్బాగుగ నాంధ్రు లెల్లరునుక్రొ ♦ త్తాపత్రికల్ బంపుచున్ ।
హృదయంబుల్వికసించి ధైర్యమునుస ♦ ద్దీప్తంబుగావించి సం ।
పదలందన్దగు మార్గకీతులనుదె ♦ ల్పన్ బూనె నేధీరుడా ।
ముదితాత్ముల్ బుధు లెంచగాదగదశ్రీ ♦ ముట్నూరికృష్ణాహ్వయుల్ ॥
గీ॥ వసుధనాంధ్రులచరితంబు ♦ వ్రాసికీర్తి । వెలయజేసిన చిలుకూరి ♦ వీరభద్ర ।
రాయునిహరిసర్వోత్తమ ♦ రాయుకోమర । రాజసద్వంశలక్షణ ♦ రాయులనగ ।
నెంతవారనిదలచితో ♦ స్వాంతమందు ॥

చరిత్ర లెటువంటివో యెరుగనివారిని ప్రశంసించిన నేమిఫలము.

పా. కాలయాపనమగుచున్నది తొల్లింట వీరులను జెప్పికొనినంత నె వచ్చులాభ మేమి యిప్పుడా బ్రహ్మచర్యవ్రతము లెక్కడ బలసంపన్ను లెక్కడ పూర్వులయౌన్నత్యంబు పులుసునగలసినది మున్ను ఆంధ్రచాళుక్యులు ఆంధ్రపల్లవులు ఆంధ్రచోడులు తెలుగుపల్లవులు పల్లవచోడులు యాదవచాళుక్యులు కాకతీయాంధ్రులవక్ర విక్రమాఢ్యులై మనదేశమలంకరించి వెక్కుదండయాత్రల విజయంబుగొని యన్యదేశంబుల నైతము వశమొనర్చికొని పాలించియుండలేదా వారి జీవితదేహబలంబుల దలంచి యిప్పటి దుర్బలులనుగన విచారమందవలసి వచ్చును సార్థక మేమి తలిదండ్రులే చిన్నతనమందు బెండ్లిండ్లుజేసి బొమ్మల పెండ్లివలె రమ్యముగానున్నారని సంతసించుచున్నారు.

హా. అట్లు తలచుట తప్పుగాదు యిప్పటి స్వరూపములే నిజముగా బొమ్మలే వెనుకటి దీర్ఘకాయు లిప్పు డెచ్చటనున్నారు.

ఆ-గీ॥ అడుగ మరచితిసికనొండు ♦ నార్య ఆంగ్లు । లైన జ్యోతిష్యపండితు ♦ లవనిదిరుగు ।
చున్నదని జెప్పుసిద్ధాంత ♦ మొగితలంప । నిజమెరవిచుట్టివచ్చుట ♦ నిజమొ జెపుమ ॥

పా. మనవారు సూర్యుడే దిరుగుచున్నట్లు దెల్పియున్నను భూమియు దిరుగుచున్నదని సూచించియున్నారు. 'గౌఃగమనశీలః' విద్యారణ్యభాష్యము 'గౌగః మనశీలః' ఋగ్వేదవిద్యారణ్యభాష్యము 'గౌఃగమనశీలః' భట్టభాస్కర భాష్యము.

ఆ. పూర్వజ్యోతిషు లెంతటి ప్రజ్ఞావంతులు యిప్పు డాంగ్లేయసిద్ధాన్తులు కనిపెట్టినది మున్నె మనవారు కనిపెట్టియున్నారు. మనవారు కనిపెట్టిన శాకాహారలంఘనాది ప్రాశస్త్యంబు లిప్పుడిప్పుడు వారికి బట్టుచున్నవి యదిపోనిండు మనకేమైనా భావిదశ బాగాయున్నదా.

పా. (గుణియించినట్లభినయించి)

చ॥ విధుగురుశుక్రముఖ్యగురు ♦ వీక్షణజూడగ ముందు మేలుస ।
త్ఫధములద్రొక్కుచుండెనిల ♦ భావిదశన్గన మంగళంబగున్ ।



బుధశనులొప్పకుండినను ♦ పూర్వపురీతిని నాంధ్రదేశమే ।
విధమున నైనవృద్ధిగను ♦ భేదముమ్మానుమతంబులన్నియున్ ॥
చ॥ సుకరముగా జెలంగిమరి ♦ శోభిలుముందటికాలమందు బా ।
లకులుగ్రమంబుగాజదివి ♦ లక్షణకార్యవిధానమూనిదూ ।
షకులనడంచిదుర్దశల ♦ శక్తివిచారముమాపి యాంధ్రమా ।
తకుదగ సేవజేయుచును ♦ దాల్తురుకీర్తివిశేషసంపదల్ ॥

ఆ. ''దూరస్యపర్వతాకారం'' దూరపుకొండలు నునుపు సమీపించితే యన్నియు శిలలే.

హా. నేదలంచినట్లుగాలేదు సదుద్దేశములుగానే వెళ్లిపోయినవి అయినా శాస్త్రి ఇప్పుడు పంచములవృద్ధి గోరువారు లేరుగదా.

పా. ఆహా మాలలకు మంచములు బ్రాహ్మణులకు చాపలు ''కలౌపంచసహస్రాణి జాయతేవర్ణసంకరః'' జెప్పవలసిన బనియేమున్నది.

ఆ. శాస్త్రజ్ఞులు ఇట్టి భేదభావములు వ్యాపింపజేసియే దేశము నధోగతిపాలొనరించినారు.

హా. ఆహా మర్దల వాగ్వాదములకు దిగినారు వినవలసినదే.

ఆ-గీ॥ సూకరంబునసహ్యత ♦ జూచుచుంద్రు । దానిదినునట్టికొందర ♦ దాకవచ్చు ।
మాలమాదిగలనుముట్ట ♦ మైలవచ్చు । శాస్త్రవేత్తలమాటలు ♦ ఛాందసములె ॥

హా. చదువుకున్నవారికంటె చాకలివాండ్లు మేలని చెప్పునదిందుకే.

పా. గుప్తా చివరకు నీ తెలివితేట లీతీరున పరిణమించుచున్నవా శుచులైయున్నపుడు వారిపేరులు చెవులపడిన మరల శుద్ధులుగావలయునే యిటులుండ వారిని స్పృశించుట కంగీకరించవలయునా బాగుగనేయున్నది.

ఆ. ఇటుల వారి నతినీచులుగాజూచి యవమానించుటచేతనే వారితరమతమునందు బ్రవేసించుచున్నది వారి స్థూలసూక్ష్మములు మన స్థూలసూక్ష్మము లొక్కటియే మనదేహము పాలు వారిది నెత్తురుగాదు అంతయు నొకటియే.

పా. మనవారిటుల జెప్పుచుండుటచేతనే వాండ్లు బొత్తిగా నాబోటివారిని రాచుకొనియేపోచారు నోరెత్తుటకు వీలులేదు.

హా. పక్షపాతపండితుల కంతేగావలయును. లొంగిపోయినకొలది మరిపైకెక్కుతారు.

ఆ-గీ॥ పెంటదినునట్టికుక్కల ♦ బెంచిప్రేమ । దాకనగుగానిమానవ ♦ తనువుగల్గి ।
కష్టపడిజీవనంబుల ♦ గడపుకొనెడి । మాలమాదిగలనుదాక ♦ మైలగల్గు ॥

హా. నిజముమాట్లాడిన నిష్ఠూరముగాని అరుంధతి ఎచ్చటబుట్టినదో.

ఆ. మనలో మనకేగాని ఈశ్వరుని కందరు నొక్కటియే పంచములలో మాత్రము మహాభక్తులు లేరా.

హా. అసలు శఠగోపుడు ఆళ్వారాదు లెవ్వరో.

ఆ–గీ|| పాపవర్తనుండు ♦ బ్రాహ్మణుండయ్యును । నిజముశూద్రుకంటె ♦ నీచతముడు।
సత్యశౌచధర్మ ♦ శాలిశూద్రుడయ్యు । వాడె సద్విజుండ ♦ యనిరిమునులు ||

పా. అబ్బా యిది నీ స్వకల్పితముప లెనున్నది.

ఆ. శ్రీమహా భారతములోనిది వాస్తవముగా పలినవర్తనగలవాడె మాదిగ పరిశుద్ధ
వర్తనగలవాడె పారుడు.

పా. సరే మన మెట్ల వేదాంతములకేమి గాని యూరపు క్రైస్తవమతనీతియెటులున్నదో

హా. ఎవరిపిచ్చి వారికానందము. అంతయు అయినది ఇక మతమువచ్చిపడినది. ఏమత
మైననేమి సమ్మతమే. ఏబొట్టు అయితేనేమి నేతిబొట్టుకు లోటువె.

ఆ–గీ|| ఇచ్చటాడంబరమెజూడ ♦ నచ్చటేమి । గానుపించదుపుణ్యమో ♦ కల్మషంబొ ।
గాని సౌఖ్యముగుడుచుటే ♦ ఘనత మోక్ష । మగదలంచెద రెంతయు ♦ ముఖ్యముగను ||

హా. అదియేమంచిది ఒకమతము కట్టుదిట్టములేమిటి.

పా. ప్రవర్తన భక్తిభావము లెటులున్నవో.

ఆ. వైరులు తనను కొరతవేసినను వారి నాశీర్వదించిన పరమపురుషుడగు ఏసుమహా
త్ముని దివ్యోపదేశతత్వముపై నొకసారి మనోదృష్టి నిగుడింపజేసియున్న మన
మింతకాలము స్వాతంత్ర్యాధికారమునకు కష్టబడవలసి వచ్చియుండునా.

గీ|| ఒకరినొక్కరు ప్రేమింపు ♦ డోర్పుచెలగ । చెడుగులకుమంచి నెప్పుడు ♦ జేయుడనుచు ।
బలికియుండిన ఏసుస ♦ ద్వాక్యములను । దెలియనేడెట్టులుండెనో ♦ తెల్లమగును ||

హా. అబ్బో అచ్చటెట్టులున్నను మధ్య క్రైస్తవులది వచ్చిపడినది వారికి మనగ్రంధ
ములు కృష్ణరామాదులెల్లరు నిందితులు గానే యున్నారు.

ఆ. ఇట్టి వాక్యము లుచ్చరింపబడుచున్న వేగాని అనుచారమునకు రాలేదని డుహామెల్
తననాగరికమను గ్రంధమున దెలపియుండెను.

పా. వారిలో మాత్రము నిష్పక్షపాత బుద్ధిగలవారు లేకయుందురా. ఇంకేమి
విశేషములు.

ఆ–గీ|| ఆత్మనుతిపరనిందపై ♦ నమరమనదు । సదనములుగట్టబడియెను ♦ సంతతాధి
కారసామ్రాజ్యములనుకు ♦ బేరపూజ । లనొనరించెడిమనముక్రీ ♦ స్తునుసభక్తి ।
పూజసల్పుటలేదని ♦ బోధజేసె ||

పా. సత్యము వారికి అధికారబలము సామ్రాజ్యము ద్రవ్యము యివి మూడు వైకుంఠ
కైలాస సత్యలోకములుగానున్నవి.

ఆ.సీ|| ఎల్లదేశంబుల ♦ నిపుడాచరించెడి, పద్ధతిసద్ధర్మ ♦ బద్ధులైన ।
యుద్యమమనిచూడ ♦ నొప్పనిప్రజలంధు, లైయుండవలయువి ♦ ధాయకముగ।



నీయుద్యమముమించి ♦ పోయినకొలదిని, ప్రేమసమత్వముల్ ♦ పెంపుజెందు ।
నికనంతమనదుభా ♦ తికనాగరికమదు, గంటునుక్రీస్తుజ ♦ నాళిమింట ।
గనుపించునీచిహ్న ♦ మునుజూడకుంటయు, గనియువైరులకిది ♦ గర్వభంగ ।
మనిదలచుటయుదు ♦ రాదృష్టమంతియు, గానియాహేతువ ♦ మానవులకు ।

గీ|| గలుగుననిలాభమెవ్వరు ♦ గాంచలేదు । వ్యర్థరణముచకంపియు ♦ వకులమంచి ।
వర్తనముపాడుజేసిరి ♦ వలుకనిజము । వారికారాగృహంబుకు ♦ బంపబూనె ||

పా. ఎవరి భాగ్యభోగ్యములు వారివి ఎవరి సౌఖ్యములు వారివి సర్వభూతదయాళు
త్వము సున్నగాని మొన్న అండ్రూసుకూడా ఏమో చెప్పియున్నాడటే.

ఆ. ఔను జ్ఞానసంపన్నులమార్గ మొక్కటియేగదా వారి ధర్మోపదేశము లొక్కటియే.

హా. చివరకు వీరిద్దరు ఒకవిధముగా సఖ్యతలోనికి దిగుచున్నారే.

ఆ. ఉ|| భారతదేశ మొక్కటియె ♦ బాగుగక్రీస్తునిజస్వరూపమిం ।
పారగజూపగల్గునిక ♦ నాతనిబోధనలొప్పుతత్వదీ ।
ప్తారతివర్తనంబులను ♦ సర్వముజూపగనొప్పు నెంతయున్ ।
యూరపునందుక్రీస్తునకు ♦ నున్న దెతావరమింత గాంచగన్ ||

బుద్ధకబీరునానకులు మొదలగు మహానుభావులు జన్మించిన హైందవదేశమందే
క్రీస్తుకు స్థానముగలదని అండ్రూసు తత్వజ్ఞునినమ్మకము.

హా. ఇందు తప్పేమిలేదు. దానికి యిప్పుడు మన భారతక్రైస్తవులే సాక్షి.

పా. బుద్ధుడు బుట్టినదెక్కడ నతని ప్రచారమెక్కడ జన్మదేశమందు ప్రకాశించుట
దుర్లభము ఇప్పుడు మహాత్మా గాంధిమాత్ర మటులగాక సర్వత్రా ప్రశంసింప
బడుచున్నా డమ్మహాపురుషుని ముఖ్యోపదేశము లెవ్వియో.

హా. దేశమంతయు ఉఱ్ఱూతలూగుచున్నను మహాత్మ గాంధి సందేశములే నీకు జెప్ప
వలసివచ్చినది. మరే మీకు దేశభక్తులు దేశము గావలయునా. మంత్రము జట
ఘన సంహితలు సంతలు యీ కాలమునందవి జూచువారెవ్వరో.

గీ|| బిరుదములగౌరవోద్యోగ ♦ సరవిగనక । మరి సుపట్టాపాలన ♦ మండలసభ ।
లందుసర్కారువారిల ♦ బొందుపరచు । స్థానములవదలగనుప్ర ♦ శంసమగును ||

గీ|| పరగనుద్యోగజనములే ♦ వ్వరచునట్టి । గానిత్వద్వారవార్థము ♦ గానిజరుపు ।
సత్కారంబులగొనకను ♦ జనకవిందు । లకునుసర్కారుదర్బారు ♦ లవిడువవలె ||

హా. చివర కెట్టులగానున్నదో ప్రస్తుత మధికారదర్పమును మూలకూలద్రోచినారు.
సంచారము వెళ్లినప్పుడు తెగదినుచుండేవారు.

ఆ–గీ|| గౌర్నమెంటుసహాయము ♦ గాంచునట్టి । బడులనుండియుతత్వాఠ ♦ భవనములను ।
చదువువారిని బోనీక ♦ సాటిగాను । విమలజాతీయవిద్యాల ♦ యములవేగ ।
స్థాపనంబును జేయంగ ♦ సమయమగును ||

పౌ. గౌర్నమెంటువారి శిక్షనుబొందు బాలురకు ఆచారములే పనికివచ్చుటలేదు బొట్టు జుట్టు మోటు అయినదవు.

హా. మెడలలో జంధ్యములే వంకెలను లెక్కించుచున్నారు.

ఆ-గీ॥ న్యాయవాదులుకక్షులు ♦ హాయిగోరి । వదలుచునుకోర్టులెల్లవి ♦ వాదములను । జనులెబాపుకొనంగపం ♦ చాయతీని । లయములనునిల్పుకొనగవి ♦ జయముగాదె॥

హా. ప్లీడర్లుగొంతుకులు పడినది యిదివర కేసభలందుజూచినవారే. ఇప్పుడు స్వరూపములే గనుపించవు.

ఆ-గీ॥ సైనికులుగానిలేఖక ♦ జనులుగాని । కూలివారలుబనిసేత ♦ కూడదెందు । మెసపుటోమియలోనిది ♦ మిత్రులెల్ల । బూనిబీదలకునుదెల్ప ♦ బూననగును ॥

గీ॥ సకల నూతనశాసన ♦ సభలకెవరు । బ్రతినిధులుగానునిల్వగ ♦ బనికిరాదు । భాసురమగుదేశీయమ ♦ హాసభసదు । పాయనిర్ణీతములదల ♦ పకవిరుద్ధ । ముగనునిలచినవారికి ♦ ముఖ్యముగను । ఓటులియ్యంగకూడదు ♦ జాటుడయ్య ॥

గీ॥ నిష్కపటవృత్తిబూనిబ ♦ హిష్కరించ । వలెనుశీఘ్రముగవిదేశ ♦ వస్తువులను । సప్తనియమంబులనుబూన ♦ జయముగల్గు । వత్సరంబునస్వాతంత్ర్య ♦ వైభవంబు॥

హా. ఇవి సప్తఋషుల యుపదేశరత్నములనియే భారతీయులు గ్రహించవలసినదే.

పౌ. గౌర్నమెంటు సహాయులుకూడా యున్నారదవుగదా.

హా. ఉండవలసినదే.

ఆ-గీ॥ చెన్నపురిరాజధానిజ ♦ స్టీసుపక్ష । ప్రజలహితులుగమిగిలిన ♦ రాజధాను । లందుమితవాదజనులనే ♦ బందుగులుగ । గాంచుచుండెనులోపల ♦ గౌర్నమెంటు॥

పౌ॥ అటులనా అతివాదమితవాదులకుగల భేదమేమి.

ఆ-గీ॥ సత్వరస్వరాజ్యముగోరు ♦ సరసులనతి । వాదులందురుదానినే ♦ త్వరపడకను । గోరుచానినిమితవాద ♦ కోటులండ్రు । ప్రస్తుతస్థితిపాలనా ♦ పక్షులనే । స్థిరముగాగోరువారెజ ♦ స్టీసులగును ॥

హా. జస్టీసువారిదే మంచిదెబ్బ గొప్పపదవులన్నియు వారివే.

ఆ. మంచిమేలువార్త యొకటిగలదు వినియున్నావా.

పౌ. లేదు. హా. మహారాజా వారిదేఅయియుండవచ్చును తొందరేల.

ఆ-గీ॥ దివిజులానంద మొందహైందవశపమునుదహనకర్మకుగొనిపోవు ♦ తరుణమునను, అతులభక్తినిజూపిమ ♦ హమ్మదీయు । లెవరుమోసెనుచరితంబు ♦ లెంచిచూడ ॥

పౌ. ప్రస్తుత మిదియొకవింతగానున్నదే.

ఆ. గంగాధరతిలకు స్వర్గస్థుడైనప్పుడు మాలానాసౌకతాలి మోసియుండలేదా.

హా. పట్టివారుకాదు మాలానా.

పౌ. ఏమికాలమహిమ వారు మహాపండితులే బంధుబృందమియ్యకొనెనా.



హా. మాలానాసౌకతాలి తక్కువవాడా.

ఆ. కోటివరహాలిచ్చినను భాగ్యసంపన్నుడగు సౌకతాలీమాత్ర మంగీకరించునా హైందవముస్లీముల ఐకమత్యమునకు మార్గముజూపించెను.

పౌ. ఏమొ నాయనా మనవారి యుద్యమములజూచిన యిటులున్నవి నాబోటివారికి మహాకాటకము సంభవించినది బ్రతుకుటెఅవే గనుపించుటలేదు.

హా. నిజమే బీదలెట్లు మాడినను మీకేమికొరత సంభావనలచేతనైనా జీవించవచ్చును మడిమాన్యములున్నను యాచనకు మొనగాండ్లేకద. ఆకలిచే నీళ్లువారికన్నమిడరుగాని జందెములవారన్న రూకలకురూకలే చివరకుచీవాట్లే ఇది ధనికుల దురాదృష్టము.

ఆ-సీ॥ బరిమార్చివైరుల ♦ ప్రభువుకువిజయంబు, సమకూర్చేవీరులై ♦ శక్తినెవరు । జాలకున్ననుకూలి ♦ సల్పుచుకష్టము, కర్షకజనముల ♦ గాచునెవరు । స్వల్పజీతములకు ♦ వ్రాయుచులెఖ్ఖలు, గూర్చులాభముపణి ♦ కోటికెవరు । యంత్రాలయములస్వ ♦ తంత్రమునులేకున్న, మించుకార్యములసా ♦ ధించునెవరు,

గీ। పల్లెలకుబోవనుద్యోగ ♦ పాళికొలువు । జీతబత్తెంబులనులేక ♦ జేయునెవ్వ । రట్టిబీదలస్థితిగతు ♦ లరయకెవరు । శాస్త్రవేదార్థనిపుణని ♦ శ్చయముగాను ॥

దినమెల్ల మిడమిడగాయునట్టిఎండకోర్చి పనిజేసినను విశ్రాంతినీయక ఏడిపించి నాలుగుఅణాలు కూలినిచ్చి ధనికులు మేము బ్రతికించుచున్నామని ప్రగల్భములు గొట్టుచుందురు.

హా. ఈవిషయము కులాభిమానము వహించక బాగానే చెప్పుచున్నాడుగాని అంతరంగ మెటులున్నదో.

ఉ॥ కరువుసమస్తబీదలను ♦ గాల్చుచునుండినలాభికారిరైయు । బరగెగవర్నమెంటుకది ♦ ఐర్తకపాళికిద్రవ్యమబ్బెన్న । త్తిరుసుముయర్బుదంబులకు ♦ దీరెపరాక్రమసైనికోత్తముల్ । దొరకెనసంఖ్యగారిపుల ♦ దున్మిజయంబునుగూర్చనాజిలోన్ ॥

పౌ. ఏదైనా మనమైకమత్యము వహించినవారైనా సహాయముజేయకపోరు ధనాశను జయించినవారెవరు.

ఆ-గీ॥ ఘనమహాత్మమోహనదాసు ♦ కరుణచందు । గాంధియనువైద్యనిపుణుడు ♦ గాంచియాంగ్ల । దేశధనతృష్ణరోగము ♦ ద్రేకమణగ । ప్రకటితచికిత్ససల్పన్ ♦ రాజ్యమలరు ॥

ఆనంద పౌరాణిక హాస్యకుమారులు నిష్క్రమించుదురు.

ప్రవేశము - ప్రబుద్ధి.

ప్ర-చం॥ సుతులుజనించకున్ననొక ♦ శోకముబుట్టినమీదవారికిన్ ।
గతులొనగూడకున్నమరి ♦ గంపెడుదుఃఖముకాటకంబుచే ।
సతతమువాడుచుండెసిరి ♦ సంపదలెల్లను దూరమాయెహా ।
సతులకుజెప్పధైర్యమున ♦ సాధ్యముయేడ్చినలాభమున్నదో ॥

స్త్రీల కెంతజెప్పినను ప్రయోజనములేదు బిడ్డలకష్టములో బిడ్డలకష్టములో యని రేయింబవలు విలపించిన వినువారెవరు ధైర్యముదెచ్చికొని స్వయంకృషివలన జీవనములొనరించునట్టి మార్గములజూపి బాగుపరచవలెగాని తలిదండ్రులు చింతిలిన పుత్రులకష్టములు దీరునా. ఇక పుత్రులో ఆంగ్లేయ విద్యాభ్యాసమునకు గడంగిన వాదిగా గౌరవమెంటు నౌకరీలను గోరుచుండుట్ల యనుచారముగా వచ్చుచున్నది. హా యేమి కాలము.

చం॥ జనములబిల్చిబిప్పిగను ♦ జేసిసుఖంబులబొందుచుంటివే ।
తనములగోరకన్ విమల ♦ ధర్మముబూనివిదేశవస్తువుల్ ।
అనయముదాల్చకన్ ఘనస ♦ హాయనిరాకరణంబుబూనినం ।
దనులుజయంబుగాంచియును ♦ దంబునబొందుదురెల్లసంపదల్ ॥

ప్రవేశము - ఆంధ్ర.

అంబురుహ వృత్తము.

సోమరులైతమదేశపుదుస్థితి ♦ జూడకేమనమందునన్ ।
భామములందున నిద్రమునుంగుచు ♦ దారిగాననివారలై ।
లేములమిక్కిలిబొందుచుకూటికి ♦ లేకనాకలిమాడనే ।
నేమొనరించెదపుత్రులకష్టము ♦ లెంచదుఃఖముబొంగెడిన్ ॥

నాథా గట్టిగుడ్డలును త్రాగ గంజియైనలేక అలోయని సంతతులేడ్చుచుండ నాకడుపు దరిగిపోవుచున్నది నా మొరాలకించువారెవరు బిడ్డలగోడు జూచువారెవరు మగవారు బెట్టువారా బెంచువారా మీకేమియుదెలియదు నే నీబిడ్డల కష్టములను జూడజాలను.

సీ॥ వెనుకనిట్లెప్పుడు ♦ వృత్తులగోల్పోయి, కష్టంబులనుబొంద ♦ గాంచినామొ ।
వెనుకనిట్లెప్పుడు ♦ వీధులలోదూచి, కట్టెపుల్లలనమ్మ ♦ గాంచినామొ ।
వెనుకనిట్లెప్పుడు ♦ వేతనస్థులగురు, ఘాతుకకృత్యము ♦ గాంచినామొ ।
వెనుకనిట్లెప్పుడు ♦ వీలగుద్రోవల, బెంచగాధరలును ♦ గాంచినామొ ।
గీ॥ వెనుకనిట్టులవేలకు ♦ వేలపన్ను । గట్టవర్తకులకుబాడ ♦ గాంచినామొ ।
వెనుకనిట్టులబిడ్డలు ♦ దినుసుకూడు । గట్టగుడ్డలకైయేడ్వ ♦ గాంచినాము ॥

ప్ర. సత్యము సతీ గతకాలముదలంచిన మనస్సునకు సంకటము ఆకాలమిక జూడము ఆపాడిపంటలు యాసూనుల సత్యమార్గము సర్వసమత్వము యాశరీరపటిష్ఠము



లాశౌర్యధైర్యము లాశూరత్వము లావృత్తినిర్ణయము లాసౌఖ్యము లాపూర్ణాయువులిపుడు దలంచిన విచారముగలుగుచుండు నిప్పటివారికవిసున్న వెనుకటి మహాత్ముల యుపదేశములే బనికిరాకున్నవి ఆరోగ్యమును గాపాడుకొనుటయే తెలియదు వ్యాయామపరిశ్రమలులేనివారికి ఆహార మెటులనడుచును నడచిన యాహారమెటుల జీర్ణముగాంచును నాకివియన్నియు దెలసియు పురుషుడను గాన యేదో ధైర్యముదెచ్చుకొని నాకృత్యము నేనొనరించుకొనుచున్నాడను.

ఆం. ఏమొ మీరింతగుడిచి మీపనులకు మీరుబోవుచుందురు పెట్టి పోషించుభారము నాదిగాన కష్టనిష్ఠురములు నాకు దెలసును.

కం॥ ఎల్లెడవర్షోదకమొక । పల్లమునన్ జేరినిండు ♦ పగిదిధనంబుల్ ।
కొల్లలుగజేరునొక్కెడ । నెల్లరుజీవనముజచ్చి ♦ యేడ్వగనాథా ॥

ప్ర. చానా నీవుజెప్పినటుల యావర్షోదక మొకపల్లమునజేరినను యానీ రందరికుపయోగపడుచుండును దానికి కష్టములేదు ఒకచోటజేరిన ధనజనవాటుల సకల జనజీవనముల కుపయోగపడకుండుటయేగాక సర్వసంతతుల జీవనాధారవృత్తుల నాక్రమించుకొని క్షుత్పీడనము గలిగించుటకు మార్గమగుచున్నది.

ఆం. నాథా వాస్తవము వెనుక యేధనికుని ద్రవ్యము సద్వినియోగమున కుపయోగపడకుండునో వానిధనముల భూమిపతులు గైకొని దేశక్షేమకరములగు సత్కార్యములకు నుపయోగించవలసినదిగా ధర్మశాస్త్రములు బోధించుచున్నవి యాసదుపదేశము లిపుడెవరికిబట్టును.

ప్ర. సత్యము.

ఉ. నిక్కముగానుమాతలపు ♦ నిర్మలభక్తిని సేవజేయుచున్ ।
చక్కగజీవనంబులను ♦ సల్పుచుసేద్యమొనర్చిభాగ్యముల్ ।
మిక్కిలిగాంచిసోదరుల ♦ మేలునుగోరిసుఖంబులిచ్చుచున్ ।
తక్కినదేశనందనులు ♦ దార్ఢ్యతమీరగనుండిరేసతీ ॥

ఆం. ఏమొ తెలియదు అందరు మనవంటి దురదృష్టులేనా.

ప్ర. అక్కచెల్లెండ్రవ సంతతులక్షేమములు నీకు తెలియకుండునా. (శబ్దమాలించినట్లభినయించి) ఎవరో వచ్చుచున్నట్లున్నది వారేకావచ్చును మరలేతెంచెద నీవును లోపలికివెళ్లి వారికి తగినయేర్పాటుజేసి బరతెంచుము.

ఆం. చిత్తము. (నిష్క్రమింతురు)

గద్య

ఇయ్యది వైశ్యకులపారావారసుధాకరశత్పన్గభీకర గ్రంధినంశ కౌండిన్యసగోత్ర పవిత్ర తాతయార్యదుహిత్ర బసవయ సుబ్బమాంబాప్రియపుత్ర సజ్జనమిత్ర బంధుజనాప్త వెంకటసుబ్బరాయగుప్త విరచితాంధ్రిమాత నాటకంబున ప్రథమాఙ్కము.

---

# ఆంధ్రమాత - ద్వితీయాఙ్కము.

ప్రవేశము - ఆంధ్రి.

ఆం. నాథర్తవలికినట్లు సోదరీమణులు దాపునకే వచ్చిరి. నేడు సుదినము.

(ప్రవేశము బంగాళ మహారాష్ట్రిమాతలు హాస్యకుమారుడు.)

హా. తల్లీ వందనము. ఆం. దీర్ఘాయుర్భవతి.

ఆం. సోదరీమణులారా క్షేమమా.

బం. ఆహా మనతండ్రి బదరీనారాయణుని యనుగ్రహంబున క్షేమము చెల్లీ నీముఖము విన్నబోయి యున్నటుల గనుపించుచున్నది నీకేవిచారములు లేవే యిటులుండుటకు గతమేమి.

ఆం. ఔను విచారములు లేనివారి కటుల నేయుండును.

మ. మాకు తెలియని కష్టములు నీకేమున్నవి.

హా. మీకన్నియు దెలసియే యున్నవి యున్న నేమి.

ఆం. జెప్పిన సార్థక మేమి.

మహ. ఒకప్పుడు సార్థకము గలుగునేమొ.

ఆం. ఉ॥ ఏమని జెప్పుదానునిక నేర్పడ ♦ పుత్రులవర్తనంబులన్ ।
ప్రేమయొకింతజూపకయె ♦ బ్రీతినినాదగు సేవ జేయకే ।
సోమరులౌచు విద్యలను ♦ శోధనజేయక నిద్ర జెందుచున్ ।
వేమరుపుత్రులెల్లరును ♦ వేబడుచుండిరికష్టపాటులన్ ॥

సీ॥ వర్ణవ్యవస్థలు ♦ వరలి దేశంబున, నిర్ణీతజాతులు ♦ నిలచిపోయె ।
నొక్కొకజాతిలో ♦ లెక్కకుమించిన, భేదముల్వెలసెను ♦ వాదములను ।
యొకరినర్తనమువే ♦ రొకరికిగోరగాక, పోరాటములు హెచ్చె ♦ పూర్ణముగను ।
నీచజాతులటంచు ♦ నిందించికొందరు, సన్యమతంబుల ♦ కంపెనహహ ।

గీ॥ గోత్రసూత్రములమరచి ♦ కొంతెలగుచు దేశభాషనుదిగద్రొక్కి ♦ దృష్టినితర ।
భాషపైజూపువారలు ♦ ప్రబలెనెందు । నరయనాభాగ్య మేమందు ♦ నక్కటాగ ॥

సీ॥ ఐకమత్యముదూర ♦ మైపొగరముజొచ్చె। పోరాటములుమించె ♦ పుత్రులందు ।
పెద్దలమాటలు ♦ బిన్నలాలించరు । దేశాభిమానము ♦ దృశ్యమగ్యు ।
సత్యవాక్యంబుల ♦ సంచరించరుసదా । బల్కుదురసత్యము ♦ బాడిదప్పి ।
పూర్వధర్మంబులు ♦ పులుసులోపలజేరె, నూతనాచారముల్ ♦ ఖ్యాతిదాల్చె ।



గీ॥ బ్రహ్మచర్యవ్రతంబుల ♦ బట్టినడచు । మనుజులెందునగానను ♦ మందునకును ।
సైననాగర్భమునబుట్టి ♦ యార్యమతము । బూనియిట్టులజెడనేల ♦ పుత్రులకట ॥

హా. అందరన్న లోకకటిగా నుందురాయేమి. భాగ్యమున్నవారు బీదలను బాగుజేయవలయునా, యెవరిదివారికి.

ఆం-సీ॥ బాలవితంతువులై ♦ వాహములాశ్చర్య, కరములై మించెజ ♦ గంబునిండ ।
ముద్దుబాలికలను ♦ ముదిబొమ్మలకొసంగి, త్రాడుదెంచగనుని ♦ ర్దయులువెలసె ।
పాలుద్రాగెడిపసి ♦ పాపలకున్ జేయు, పెండ్లిండ్లుమిక్కిలి ♦ వృద్ధిగాంచె ।
దయమానివిధవల ♦ తలలనుగొరిగించు, నాచారమేధర్మ ♦ మాచుజెలగె ।

గీ॥ కన్నెలనువిక్రయించెడి ♦ ఘనతమీరె । వరులకట్నంబులధికమై ♦ వాసిగాంచె ।
అహహ కాలమహత్వంబు ♦ నరయదుఃఖ । మిచ్చుచుండెను నావ్రాత ♦ కేమిజేతు ॥

హా. అహా నీవ్రాతనీకే మావ్రాతమాకే.

ఆం. కలిపురుషునిమహిమో లేక నాదురదృష్టమో పుత్రులవివేకులై పోవుచుండిరి తొల్లిటి పుత్రరత్నములు గనిపెట్టిన వైద్యసూత్రములు విచిత్రశిల్పకౌశలములు శస్త్రాస్త్రవిద్యలు నశించుచున్నవి యిప్పటి సంతతులందు ధైర్యశౌర్యసాహసాదిగుణములే గనుపించుటలేదు ధరించుటకైనా స్వదేశవస్త్రవితానములు బనికిరాకున్నవి. ఎంతవింత యితరఖండములకు ధనమెట్టుల ప్రవహించుచున్నది సూనులుజూచుచుండి మిన్నకుండిరి. చేతిపను ఉడుగంటినవి యిండ్లయందు నూలువడకుకొనుటే మోటయినది. ఏమికాలము.

హా. అమ్మా నీగర్భమందు బుట్టుటె మాకు మోటుగానున్నది.

మహా. అమ్మా దుఃఖించిన లాభమేమి.

హా. లాభములేకేమి ప్రొద్దుబోవుచుండును.

ఆం. ద్విపద

శిల్పశాస్త్రంబులు ♦ శిథిలమైచిత్ర । కల్పనలణగెను ♦ గాంచగనక్క ।
చౌషష్టివిద్యల ♦ సారమొకింత । యాపథంబునకైన ♦ నగపడదమ్మ ।
వ్యూహముల్పన్నుట ♦ యుద్ధకౌశలము । దేహపరిశ్రమ ♦ దివ్యాస్త్రవిద్య ।
లన్నియుశూన్యమై ♦ యసనిలోగలసె । బెన్నిధులందరు ♦ బీదలైపోయె ॥

హా. భాగ్యవంతులు బీదలుకావలసినదే వారిద్రవ్యము మాకేమయినా సహాయము జేసినదా.

ఆం-సీ॥ పరమధర్మంబని ♦ పసికూనలకుపెండ్లి, జేసియనాథల ♦ జేయుచుండె ।
కన్నెలంచుదలంచ ♦ కనుకార్యములజేసి, బలహీనులనొనర్చి ♦ బాలికలను ।
ఆరోగ్యశాస్త్రము ♦ లారసితనువుల, బలములగాపాడి ♦ బాగుపడరు ।
విభుసెరుంగనిపిన్న ♦ విధవలకైనను, భర్తలగూర్చగ ♦ బాటుపడరు ।

గీ॥ యితరకులములజేయుచు ♦ హేళనంబు । తమదుకర్తవ్యమేమియో ♦ దలచగెందు।
నిటులబిడ్డలుబొందెడి ♦ హీనదశను । గాంచతల్లికినిద్దుర ♦ గల్గునెటుల ॥

హి. అమ్మా నీకు బట్టకున్నను క్షుద్బాధచే మాకు బట్టుచునేయున్నది.

మహా. అక్కా నీకింత విచారమేల నీబిడ్డలు పాలుద్రాగు పశికూనలుగారుగదా వారే తెలివిదెచ్చుకొనగలరు వారికై విచారమందనేల పెక్కుసంతానము పెక్కుదుఃఖములకు కారణము యిప్పుడొకింత పుత్రులకష్టములు జూడవలసి వచ్చినను మాయందరిలో నదృష్టవంతురాలవీవె.

సీ॥ భరతఖండముననే ♦ బదియారుదేశమా, తలశిరోరత్నమా ♦ తరుణివరయ ।
ధనకటకాదిభూ ♦ ధవులనుగనిధాత్రి, ప్రఖ్యాతివడసిన ♦ పడతివరయ ।
భాసిలుశశిబిందు ♦ సార్థినామోత్తముచేత, తతనతిగన్నకాం ♦ తవుదలంప ।
సూత్రాధికారియౌ ♦ శోభితాపస్తంబ, మునిప్రసిద్ధునిగన్న ♦ ముదితవరయ ।

గీ॥ పరమశంకరపీఠాది ♦ పతినిబుక్క । మంనవేశ్వరసచివుని ♦ మాధవాఖ్యు ।
వేదభాష్యప్రవీణుని ♦ విమలమూర్తి । గనినసద్భాగ్యశాలివి ♦ గాదెయక్క ॥

హి. అమ్మలారా వెనుకటివారి పేరులజెప్పికొని సంతసింపవలసినదే.

బం. అక్కా నీవుగనిన శూరాగ్రేసరులగు ధారుణీధవుల నేసోదరీరత్నములు గనియున్నారు యొకప్పుడు దిగంతప్రఖ్యాతివహించిన ప్రతాపరుద్ర కృష్ణదేవరాయ రాజరాజనరేంద్రాది భూపతులను యుగంధరాది మంత్రిపుంగవులను త్యాగరాయాది గానప్రవీణులను త్యాగసముద్రమహావీరాగ్రేసరులను గనియున్నావు.

ఆం. ఎందరిగనినను విద్యావిశారదులును వీరాగ్రేసరులగు మీపుత్రులను సరివచ్చువారుగాయున్నారా మహారాష్ట్రివి ఔరంగజేబును ఎదిరించిన ఆశ్చర్యకరముగానుండును.

హి. వీరాగ్రేసరుడగు శివాజిపుత్రుడు శంభాజివర్తనము ఆశ్చర్యకరమే.

మ. ఆంధ్రాంబ నీవేమన్న.

ఆం.సీ॥ సామాన్యగృహమున ♦ సంభవమందియు, స్థాపించిరాజ్యము ♦ చక్కగాను ।
సాధింపబూనిన ♦ సాహెబుయౌరంగ, జీబుకృత్యములకు ♦ చెదరకమది ।
ఖానునఫ్జుల్లాది ♦ ఘనతురుష్కులనెల్ల, యోధుడైద్రుంచుచు ♦ యుద్ధమందు ।
చాముండికరుణచే ♦ జయమునుగాంచుచు, రాయగడానిదు ♦ ర్గములరెండు ।

గీ॥ నందలకుపైనయెనుబది ♦ వరుసగెల్చి । పాలనముజేసినట్టిస ♦ త్పృథునిఛత్ర ।
పతిశివాజినిగన్నట్టి ♦ భాగ్యశాలి । వరయనీసాటియెవ్వరే ♦ యవనియందు ॥

హి. ఆమహమ్మదీయ చక్రవర్తులు యాశివాజియేసరి ఔరంగజేబు కారాగృహమున నుంచడము జామఫలముల తట్టయందు దాగి తప్పించుకొనడము వారికార్యములు వినోదకరమే ?



ఆం. అమ్మా మహారాష్ట్రాంబా ఛత్రపతి శివాజియననేల రఘునాథబలాలు శామ్రాజి పంతు మోరోపంతు జనార్దనపంతు బాలాజిపంతు దత్తాజిపంతు మొదలగు ప్రధానామాత్యులకు సాటివారి నేతల్లులు బడసియుండిరి ఇదిగాక రామదాసు తుకారాములవంటి భక్తశిరోమణుల నేసహోదరి గనియున్నది భాగ్యశాలివి ఇప్పటికిని భారతమాత సేవాపరులగు బాలగంగాధరతిలకు గోపాలకృష్ణ గోఖేలాది ధీరాగ్రేసర స్వార్థపరిత్యాగుల గనియున్నావు నీ యదృష్టమేమన వచ్చును.

హి. వారిష్టమువచ్చినటుల మాట్లాడుటకు వీలున్న యదృష్టవంతురాలే, యిట్లాటి వారిని మాటలాడనిచ్చువారెవరు.

మహా. ఆబిడ్డల రణకౌశల ధీరవర్తనంబులు జ్ఞప్తికివచ్చినంతనే విచారముగలుగుచుండును "నక్కెక్కడ నాకలోకమెక్క"డన్నట్లు అప్పటి సూనులకు నిప్పటి తనూజులకు హస్తిమశకాంతర వ్యత్యస్తము యిప్పుడేనును నీతోసమానముగానేయున్నాను వెనుకను సమానులమే ఏలనన నేనొక రామదాసునిగనియున్నాను నీవొక రామదాసును గనియున్నావు నేను ఛత్రపతి శివాజిని గనియున్నాను నీవు కృష్ణభూపతిని వడసినావు.

హి. ఆంధ్రాంబ కుమారుడగు రామదాసు నవాబు పైకము తనదిగా భావించి భద్రాద్రిరాముని దేవాలయముగట్టించి కారాగృహవాసము చేసినాడు నీ రామదాసు యటులజేయలేదే. గాన నీకు నీవె మాతల్లికి తల్లియే.

బం. అమ్మా నీమాటలకు నవ్వుబుట్టుచున్నది. (నవ్వును)

ఆం. నాబిడ్డల వర్తనలు నవ్వులుగానేయున్నది.

మ. చెల్లీ అట్లనవలదు.

హి. అటులనినను బాగానేయున్నది.

ఆం. ఉ॥ పేదరికంబుసంసుతులు ♦ బెట్టెడిదుఃఖమపార మెంచనా ।
ఖేదముజూచువారెవరు ♦ క్రిందటికాలముమంచిదమ్మరో ।
నీదశమంచిదౌనుగన ♦ నీతివిభూషణసత్యసంధులన్ ।
వేదవచోవిలాసులను ♦ వేడుకగర్భముదాల్తువేతరిన్ ॥

హి. వాస్తవము అట్టివారినే గనియున్నది గాని కేరళ సింధుమాతలకు మీరెవ్వరు సరిగారు. మీలోమీరు పొంగుచున్నారు యేమి మీబిడ్డలు మతస్థాపకులా వైద్యశాస్త్రవిశారదులా.

బం. బంగాళాంబా కేరళసోదరియనిన జ్ఞాపకమువచ్చినది.

తే-గీ॥ ప్రబలధైర్యముతోడన ♦ ద్వైతమతము । దేశదేశములందున ♦ తేజరిల్ల ।
స్థాపనంబొనరించెనే ♦ జ్ఞానమూర్తి । గురుడుశంకరుడేయంబ ♦ కొమరుడౌనా ॥

మ. కేరళసోదరీకుమారుడే. ఒక్కొక్కతరి తలిదండ్రులకు ఖ్యాతిదెచ్చునట్టి పుత్రులు బుట్టి దేశముల నుద్ధరించుచుందురు.

హా. యిప్పుడును దేశద్రోహులు బుట్టుచునే యున్నారు.

ఆం. శంకరుడట్టి మతస్థాపకులు మనకు లేకపోయిననుసరే తత్వశాస్త్రవిశారదులుగా కున్ననుసరే దేహబలము నభివృద్ధిజేసికొని స్వయంకృషివలన జీవించుసాధనోపాయమే లేకుండెనుగదా. శారీరమొకరికమ్మి జీవించుట మగటిమా.

హా. ఏచదువు లెటులున్నను ఇంగ్లీషుచదివినవారు నౌకరీలు చేయవలసినదే దొరతనమువారికి లాభముగూర్చి గౌరవమందవలసినదే. ప్రజలచేత ఎట్టిజేయించుకొనవలసినదే.

బం. శారీరమనిన జ్ఞాపకమువచ్చినది.

ఉ॥ సాహసమొప్పవైద్యమును ♦ సాధనజేయ సహాయకారియై ।
లోహకషాయమాత్రలువె ♦ లుంగగచూర్ణములట్లుతైలమం ।
దోహముస్వేదకర్మగుణ ♦ దోషములౌషధులొప్పదెల్పెనా ।
శాహటసూత్రకర్తయగు ♦ వాగ్భటియెవ్వరిపుత్రుడోధరన్ ॥

మ. సింధుసోదరీకుమారుడు.

హా. వాగ్భటివిరచిత యష్టాంగహృదయము నభ్యసించిన వ్యాధులను నిర్మూలింపవచ్చునుగాని యింగ్లీషుశాస్త్రిములుండగా నిప్పుడవి యేరికిబట్టినవి.

ఆం. ఉ॥ భారతవర్షమందువర ♦ పండితులైతనదేశభాషలో ।
నారడసితత్వమార్గముల ♦ నాంగ్లమునన్ కవిసార్వభౌములై ।
బేరుగనెంమహర్షిపద ♦ విన్ బుధులెంచరవీంద్రనాథతా ।
కూరునుబోలునట్టిసుతు ♦ కోరికగాంచితినేముదంబునన్ ॥

హా. మీయక్కకుమారుడేగా. యెవరుగనిననేమి.

ఆం. ఆంగిలేయవిద్యలో ప్రఖ్యాతివహించిన శ్రీమత్సరోజిని యేసహోదరికుమారికారత్నమో

హా. ఏవ్వారైతేనేమి ఆమె దేశభాషలో పేరొందెనా.

మహా. మన బంగాళాంబ కవి సార్వభౌముల గన్నట్టిదిగా? యదృష్టవంతురాలే.

ఆం. ఆమె పుత్రులందరు రత్నములే అట్టివారి నేమాతలు గనియున్నారు.

బం. నీవుమాత్రము గనియుండలేదా నీకుమారులకేమి తెలివితేటలుగలవారు ముందువారే బాగుపడగలరు నీవిటుల దుఃఖపడిన లాభమేమి మనోవ్యాధికి మందులేదు తల్లులు బిడ్డలకుగ్గుపాలలోనే ధైర్యస్థైర్యములగరుపుచు సాకవలయును. మనమేధీరము చెడిన వారికెటులబ్బును. నీది వట్టియారాటమేగాని విచారించిన నీతనూజులలో మాత్రము విద్యాధురీణులులేరా.



ఆం. ఎవ్వరు ప్రవేశ పెట్టిజూపింపుము.

బం. ఏమీ నీసుతులలో నాంగిలేయభాషాప్రవీణులు లేనేలేరా.

హా. అమ్మా జ్ఞాపకముదెచ్చికొనుము తొందరపడవద్దు.

బం. సత్యమతస్థాపకుడును ఆంగిలేయ నైఘంటికౌరచనాకుశలుడగు పాలూరి శంకరనారాయణగుప్త యెవ్వరి కుమారుడు.

మహా. ఆహా యేమమ్మా నీపిచ్చి.

ఆం. అత డన్నిటియందును సమర్థుడే తాను నేర్పుతోగనిపెట్టిన నూతనవిధానవస్తునిర్మితసూత్రములదేశమున వ్యాపింపజేయకయే స్వర్గమునకేగియుండె మీకేమి యుగాంతమువరకు కీర్తిని వెలుంగజేసినట్టి కుమారరత్నముల గనియున్నారుగాన నిర్విచారముతోనున్నారు.

బం. నీవు ప్రతిమాటకు సమాధానము జెప్పుచునేయున్నావు అన్ని రుచులుగుడిచినవారికే మొగమువాపి యెక్కువ యొకప్పుడు మహదైశ్వర్యవంతురాలవై పృథ్వీవల్లభ జయసింహరణరాగాది శూరాగ్రేసరులను కనియుండి యిప్పుడట్టివారు లేరని బొక్కుచున్నావు మేముమాత్రము మీకంటె భాగ్యవంతురాంద్రమా.

ఆం. ఆహా.

సీ॥ సకలమతగ్రంథ ♦ సారంబుదీసియు, బ్రాహ్మమతమెవడు ♦ బట్టినాడె ।
పశికూనలనుబట్టి ♦ భాగీరథికొసంగు, నట్టియాచారంబు ♦ నవనిగల్పె ।
పతులతోసతులను ♦ భస్మంబొనర్చెడి, పద్ధతినెవ్వడు ♦ బాడుజేసె ।
విధవలబెండ్లిండ్లు ♦ వేదసమ్మతమంచు, దెల్పినాడెవ్వాడు ♦ దివ్యముగను ।
గీ॥ సింధ్లుమొదలగుదుష్టవి ♦ చేష్టితముల । మాన్పజేయగనింగ్లండు ♦ మహికినేగి ।
విజయుడైకీర్తిదాల్చెనే ♦ విధిసమాను । డట్టిరామమోహనుడునీ ♦ పట్టిగాదె ॥

బం. ఔను నేనేమాటజెప్పినను నీకు కోపముగాని భాషాసేవకుడగు కందుకూరి వీరేశలింగమొనరిసూనుడు ప్రప్రథమమున వితంతూద్వాహంబులవారికి సహాయకారిగానిలచి తనను బహిష్కరింపజూచిన శ్రీశ్రీ శంకరాస్వాములవారిని హైకోర్టులో నపరాధిగానొనరించిన ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజీమాత్రము సామాన్యుడా: స్వకులము నుద్ధరించుచు దేశసేవజేసినవాడేగద ఆకాలమున పండితదాసు శ్రీరామశర్మ మాత్రము సంస్కరణపరిశ్రమజేసియుండలేదా.

హా. వారిద్దరిని నేనెరుంగుదు శర్మగారు వేధవా కేశఖండనమశాస్త్రీయమని సిద్ధాంతముజేసి చిన్నపొత్తమునుకూడా వ్రాసియున్నాడు.

ఆం. చం॥ హృదివిధవావివాహముల ♦ నెంతయొబూనికనిర్వహించితా ।
బిదపకుతూహలంబెసగ ♦ వేదములూరుజజాతికెంతయున్ ।
వదలకదెల్పెకర్మతతి ♦ భావము శ్రీనరసింహయజ్వడో ।
సుదతిసుబోధనాపరుడు ♦ శూరుడుకార్యములన్ దలంచగన్ ॥
మహాశయుడేగాని కృతకృత్యుడుగాకనే కాలగతి నొందియుండెగదా. అట్టి మాతృసేవాపరులేల దీర్ఘకాలము జీవింతురు.

హా. ప్రౌఢవివాహుడైయుండి నిర్భయముగా సంఘసంస్కరణలకు పాటుబడుచు సోమయాగముజేసినవాడె. తెల్లదొరల లక్ష్యపెట్టనివాడే.

బం. ముందు స్వకులమునుద్ధరించుటొక మహత్కార్యమే ఇంటగెలచి రచ్చగెలువవలె.

ఆం. నీవెటులైన నన్నోదార్చ బూనుకొనినావు గాని నీకుమారులవంటి విద్యాసంపన్నులను రాచకార్యవైదుషీమణుల నేనును గనియున్నయెడ నిర్విచారముగానుండి యుందును. కాలమటులే తెంచినది.

హా. కాలముకేమిలే.

బం. అక్కా నిజమాడిననిష్ఠూరమును సౌమ్యముగా నీసూనులకు మించినవారినే తోబుట్టువులు గనియున్నారు చాళుక్యచోళ నాగ పల్లవకాకతీయాదిరాజులను వేమనాదిమహాయోగులను భీమనమాచనసోమనాది కవిరాజులను లక్ష్మణసూరనాది ద్వ్యర్థిప్రబంధకర్తలను గనియున్నదానవుగాదా నేటికిమాత్రము విఖ్యాతిసూనుల బడయుచుండుటలేదా యింతవిచారమెందుకు.

మహ. ఆకవుల నటుండనిమ్ము.

చం॥ సరసకవిత్వనైపుణిని ♦ చక్కగగాంచిశతావధానముల్ ।
గరిమనొనర్చిపండితని ♦ కాయమునన్ దలరారికీర్తిచే ।
ధరపతులిచ్చుకట్నములు ♦ దారతగైకొనివన్నెగాంచెనా ।
తిరుపతివెంకటేశ్వరసుం♦ ధీవరులెచ్చటబుట్టిరోగనన్ ॥

బం. ఇట్టి ప్రశస్తపురుషులగనియేనా.

మ. కవులన జగద్వితమే మనముజెప్పిన కోపమువచ్చును ఈమె మనోవ్యధకు మందులేదు.

హా. మందులేకేమి యిప్పు డింగ్లాండునకు ద్రవ్యముచేరుచున్నట్లు యిక్కడిద్రవ్యము తనవొడిలోబడిన మనోవ్యధవదులును దానికదియే చికిత్స.

ఆం. అక్కా నీమాటలకొకవైపున నవ్వు నొకవైపున విచారమును బుట్టుచున్నవి.

---

ద్వ్యర్థికావ్యములు: లంకావిజయము-పిండ్రప్రోలు లక్ష్మణకవి.
పింగళిసూరన-రాఘవపాండవీయము.



మహ. చికిత్సలనిన జ్ఞాపకమువచ్చినది ఆయుర్వేదమార్తాండభిషగ్మణి పండితాది బిరిదాంకిత విరాజితుడగు గోపాలాచార్యుడీమెకుమారుడేగద.

బం. అహా.

మ-గీ॥ ఆంధ్రిసోదరినీవిట్టి ♦ యాత్మజులను । వడసిబెంచుచుభూమిని ♦ వాశిగాంచు ।
చుండియిట్టులమనమున ♦ శోకమంద । భావ్యమాజాలుమేలగు ♦ బాటగనుము॥

అం. ఇంకేమిమార్గము నాసంతతుల క్షుద్బాధనుగని దుఃఖముపడుటే నావ్రాత.

బం. చెల్లీ నీవిటుల తెలియనిదానివలె విచారమొందవలదు మంచికాలము రాగలదు అనేక కష్టనిష్ఠురములనుజూచిన మనమే ధైర్యముచెడిన బిడ్డలనోదార్చువారెవరు మనము కడుపులో ద్రిగమింగికొని బిడ్డలు సుకరముగా జీవించుమార్గములజూచి బోధించవలయును.

ఆం. ఉ॥ పాదుగనాదుపుత్రులొక ♦ బాటగనుంగొనిబట్టకుండుటే ।
గాదువృథాప్రసంగముల ♦ కాలముబుచ్చుచునైకమత్యమున్ ।
మోదముతోడబూనకను ♦ మూర్ఖముచేజెడుచుండెనప్పునా ।
యాదరమేమిచేయగల ♦ దాత్మవిచారమునివ్వకుండునే ॥

మహా. అట్లనవలదు తగుప్రయత్నంబున సంతతిని బాగొనరించ జూడవలసినదే.

హా. ఎన్నిదినములనుండియో వ్యాపించుచున్న భేదభావమహాశక్తి యెచ్చటికిజేరవలె

బం. మన ఆంధ్రిసహోదరిది వట్టియారాటమేగాని యేదేశప్రజలలోనైనను లోపములు లేకపోవు మోక్షమార్గములని పెద్దనిచ్చెనలనెక్కించి ధనమార్జించిన గురువు లితరమతములందున్నటుల చరిత్రలలో జూచుచుండుటలేదా పోపు బైబిలును తనస్వాధీనమందే యుంచికొని ప్రజలు దాని తాకగూడదనిజెప్పి తద్విరుద్ధధర్మము లుపదేశించుచుండ కొందరు బుద్ధిశాలులది గ్రహించి గురుని మోసమును బైబిలు యదార్థమును వ్యాపింపజేయ సమకట్టి యనేకకష్టముల బడి కార్యసాఫల్యముగాంచినట్లు దెలియుచుండుటలేదా. మూఢవిశ్వాసములు దురాచారములు మతాంతరశాఖాపోరాటము లన్ని మతంబులందుండియున్నవి విద్యావ్యాపన మెక్కువయైనకొలది యవి తొలగి నాగరికత ప్రబలుచుండును యొకప్పుడు మతవివాదములలో రక్తప్రవాహము కన్నులజూచిన వారిప్పుడు శాంతమునొంది ప్రజలందరిలో మిన్నయైయున్నది గోచరమేగదా.

హా. అబ్బో నిచ్చెనపైనెక్కితే మోక్షసోపానము లెక్కినట్లా.

మ. అటులనా బ్రాహ్మణులు వేదములు వల్లించునట్టి యధికారము తమయందే యునిచికొని యితరులవి పఠించకూడదని దాచియుంచలేదా యిప్పుడది దెలసి తక్కిన కొన్నివర్ణములు తమ యధికారము గ్రహించి వేదమును

చదువుచుండుటలేదా ప్రజలలో విద్యావ్యాపనమైనకొలది స్వధర్మముల నెర వేర్చునట్టి సమర్థులగుచుందురు.

ఆం. దేశదేశముల ప్రజలు నాగరికత గాంచుచుండినను నాసంతతుల కా వ్రాత లేదు.

బం. సోదరీ నీకేమమ్మా.

ఆం. భాగ్యభోగ్య విద్యాసంపన్నుల గనియుండుటచే ఏమియు దెలియకున్నావు నాబిడ్డల జాతిభేదవైషమ్య దురాచారవర్తన లెందైనాగలవా.

బం. ఎవరిగోడు వారిది. నాపుత్రులలోపములు నాకుదెలియును పూర్వపు గంగజాతరలు సహగమనములు జ్ఞప్తికివచ్చి గుండెలవియుచుండును యిప్పుడిప్పుడు గదా కొన్ని సంస్కరింపబడినవి.

ఆం. అందరట్టివారుగాదా,

గీ॥ మీరలెన్నివచించిన ♦ సారమేమి । గానుపించదుసూనుల ♦ గాశిదీర్చు ।
మార్గమొక్కటిలేదందు ♦ మదినిగల్గు । శోకసంతాపమార్పగా ♦ జూడరెవరు ॥

హ. బిందెడునీరు నెత్తినబోసితే శోకతాపమదే ఆరగలదు.

బం. అమ్మా నీదుఃఖ మాపునంతటివారమా సర్వమయుడును సర్వజ్ఞుడును సర్వశక్తి యుతుడగు యీశ్వరుడు నీసంతతికష్టముల విచారించి దొలగించవలెగాని మాచేత నేమౌను.

మ–గీ॥ జ్ఞాపకంబునొనర్చిన ♦ శోపమందు । గానిసోదరియాంధ్రాంబ ♦ గాంచినట్టి ।
బుద్ధికుశలతనొప్పిన ♦ పుత్రులెవరు । వడసియున్నారుజెప్పగా ♦ వశమెధాత్రి॥

తీగేదీసిన పాదగదలుచుండును యెవరికష్టములు వారికుండియుండుటేగాక భారతావనికిప్పుడు తీరనికొటకము సంభవించినదిమాత్రము నిజము నాసంతతులేమి మీసంతతులేమి తక్కిన సోదరీమణుల సంతతులేమి యనేకులు కూటికి మలమల మాడుచునేయున్నారు.

హ. నల్లులుమాడినట్లే.

మ. పూర్వకాలమువలె ప్రజలందరును సమానముగా జీవించుటకు వృత్తినిర్ణయములు లేవు గొప్ప భూస్వాములకు గొప్ప వర్తకులకు కాలము మంచిదిగానున్నది ప్రభుత్వమువారికి పన్నులు వేయుట బట్టునుగాని మనదుస్థితిబట్టదు.

హ. పండినపంటెల్ల రూపాయీల కుప్పలే. వర్తకులకు రూపాయీలకు పావలాలు లాభమే. బీదవార లాకలిమంటకు మాడిజచ్చుటే.

బం. అక్కా మనసోదరికి శోకమువచ్చి రెండుచీవాట్లు బెట్టినను బడవచ్చును యీమెకు విద్యలన్నిటిలో నారిదేరిన కుమారులుండియున్నారమ్మ.

హ. ఉండి యేమిప్రయోజనము.



మ. లేకేమమ్మ.

మ॥ క్షితిలోనూతలకోటివంశమునవా ♦ శింగాంచిపెంపొందుచున్ ।
సతతంబున్ తనవిద్యబాలకులకున్ ♦ సర్వంబుబోధించుచున్ ।
శతశిల్పంబులదీరిమేటిబిరుదుల్ ♦ సాధించెనవ్వాడు నీ ।
సుతుడేగాదనృసింహనాయుడరయన్ ♦ శోధించుమాంధ్రాంబరో ॥

ఆం. పాపమాబిడ్డడు తనవిద్యనంతయు సోదరులకు ధారబోయుటకై విజయవాడ పట్టణంబున శిల్పకళాశాల నొకదాని నెలకొల్పి దానికి ధనికులెవ్వరు తోడ్పడ కుండుటచే తన ద్రవ్యమునంతయు గోల్పోయి విఫలమనోరథుడౌటయేగాక జీవనోపాధికి సహా కష్టపడుచుండెను.

మ. సోదరీబిడ్డలకున్నరోగమే యిది పరిశ్రమవిద్యాకుశలులెవ్వరైన నేదైన నొక దాని స్థాపించబూనిన మనబిడ్డల తోడుపడకుండుటయు ఒకరుబెట్టిన యంత్ర ములనె వేరొకరుబెట్టి వర్తకమును జెరచుటయు నూతనయంత్రాదివర్తకం బుల దేశమువ స్థాపించకయు ద్రవ్యవంతులు తమ సౌఖ్యమునకే తృప్తిజెంది సోదరుల కష్టములజూడకుండుటే యీక్షామమునకు కారణము.

హ. నరాలనిూదపుండు, నడిమత్రైశ్వర్యము బ్రతుకునిచ్చునదిగాదు.

బం. చం॥ ధనవరులెంతమాత్రమును ♦ దల్చరుసోదరకష్టపుంజముల్ ।
గనుతమసౌఖ్యమేమిగుల ♦ కాయముబెంతురుశాశ్వతంబులే ।
తనువులుబండ్లుయోడలగు ♦ ధారుణియోడలుబండ్లగున్ సుయో ।
ధనరవినందనుల్ జనుచు ♦ ద్రవ్యముగొంచుకపోయిరేవెసన్ ॥

ఆం. నిజము కీర్తియే శేషించియుండును కర్ణునివంటి వదాన్యుల గనియుంటినా.

మ. నీవు మాట్లాడకమ్మా యిప్పుడు సోదరాభివృద్ధికై పాటుబడుచున్న కాశీనాథుని నాగేశ్వరరాయుని మించినవారెవ్వరున్నారు వారిపేరాబాలగోపాలమునకు విదితమే.

బం. పత్రికాధిపతులు మన మహారాష్ట్రాంబకు దెలసినటుల మరెవ్వరికి దెలియబడవు కేసరి పత్రికాధిపతియగు లోకమాన్య బాలగంగాధర తిలకునిగని యుండుట చేతనేగదా.

హ. అబ్బో ఎగురుతూ దేశశేవజేసియే ఆరువత్సరములు కారాగారవాసముజేసి గీతారహస్యమును వ్రాసినది.

మ. ఎగరటమన్న జ్ఞాపకమువచ్చినది యిప్పుడైరోపీయులలో మంచివిమానముల గని పెట్టి వినియోగించుచున్నారటె.

బం. వైమానికనిర్మాణమునందుకూడా హైందవులెవ్వరో యున్నారని వినియున్నాను (జ్ఞాపకము నభినయించును)

హా. ఉండిన నేమి ఎగరనిచ్చిరా.

బం. ఆహా, ఏమి మనయాంధ్రాంబపిచ్చి.

సీ॥ రాజిల్లుమహిసూరు ♦ రాజ్యాధిపతియాజ్ఞ, బూనియూరపుకేగి ♦ బుద్ధిమీర ।
నింజనీరింగులో ♦ నంజయమునుగొని, చటులవై మానిక ♦ ఘటనబూని ।
పతకంబులనుగొని ♦ ప్రావీణ్యతవహించి, వైశ్యకులంబున ♦ వన్నెకెక్కి ।
దగశేముషీదురం ♦ ధరుడౌచుజనముల, మన్ననబుద్ధిసం ♦ పన్నుడైన ।

గీ॥ వరసిరాంవంశమందున ♦ వరలునట్టి । శోభితయశుండువెంకట ♦ సుబ్బయార్య ।
డాంధ్రసోదరిసత్సుతు ♦ డరయగాదె । యిట్టిప్రావీణ్యులేరికి ♦ బుట్టియుండె ॥

ఆం. అక్కా బ్రతుకనిబిడ్డ బారెడన్నట్లు నాబోటి భాగ్యహీనురాలికట్టి సుతుడేల దక్కును ఆసూనుడు తన విద్యాకౌశలము దేశమున బ్రదర్శించుట కొటం కముగలిగి యిక నీమర్త్యలోకమున కాలము వృథాపుచ్చవలసివచ్చెగదాయని తలంచియే కాబోలు స్వర్గవాసులైన సోదరులకు తనవైమానికనిర్మాణచాక చక్యమును జూప నేగియుండెను ఆబిడ్డడు సోదరులను వృద్ధికి దేగలడని కొండంతయాశబెట్టుకొని యంటి నదియు వృథాయయ్యె (దుఃఖపడును)

హా. ఆతడున్న సహాయముజేయువారెవ్వరు.

మ. నిజమక్కా భారతీయులకే దినములు జాలియుండ లేదు యెన్నికష్టము లెదు ర్కొని శాంతమువహించి జేయదగినంత సహాయము జేసియుండినను ఆశా భంగము నొందియుండిరి మంచికిబోయిన చెడు వెంబడించుచున్నది. ఖండాం తరములకేగిన విద్యార్థులుకూడా జిక్కువడుచున్నారు.

హా. ఆంగ్లేయస్త్రీలకు చిక్కుబడుచునేయున్నారు.

బం. ఔను.

చం॥ శ్రమలకునోర్చిదేశమున ♦ చక్కగనాంగ్లమునేర్చివేడ్కభూ ।
రిమహితయగ్రికల్చరుప ♦ రీక్షనుజేయగకోర్కెవెట్టియా ।
యమెరికదేశమేగిజయ ♦ మందినవైశ్యుడుదర్శిచెంచయా ।
ర్యమణికుమారుడేగదధ ♦ రాస్థలిజూడగనాంధ్రసోదరీ ॥

హా. అబ్బాయి తిమ్మిరిఅణగినదిలే యేడుసంవత్సరములజైలే చదువులేదు సంధ్యలేదు స్వదేశీః

ఆం. ఔను.

కం॥ కారాగృహకష్టంబుల । కోరిచిమానసముజెడక ♦ నుత్సాహంబున్ ।
ధీరమువీడకతనదగు । నేరుపుతోననుభవించె ♦ నిర్మలమొప్పన్ ॥



బం. ఏమీ పాంచాలఘూర్జర వైశ్యబిడ్డలగు లాజపతిరాయి కరన్‌చందు గంధి దేశ భక్తులవలె నీయాంధ్ర వైశ్యయువకుడు నిర్బంధమనుభవించివచ్చెనా ఐననేమి కాకల దీరినకాలని బంగారుము వన్నెహెచ్చినటుల కష్టములనుభవించినకొలది దేశభక్తులు వన్నెకెక్కుచుందురు తా నొకటితలచ దైవమొకటి దలచినట్లు లాజపతిరాయిని అమెరికాలోనుంచినను భారతదేశమునకు మేలేకల్గినది.

హా. యింకా కొన్నాళ్లుయుంచిన పనిఅయ్యేదే. యింట్లోవాడిని అమాంతముగా పట్టుకవెళ్లి మాండలేకోటలో బడవేసినప్పు డేమిచేసినాడు. దొరలుదలచిన దెబ్బలకుకొదువా.

మ. ఔను.

(ప్రవేశము మహమ్మదీయకుమారుడు.)

మ-కు. తల్లులారా వందనములు.

మాతలు. దీర్ఘాయుర్భవతి మాతసేవా శిద్ధిరస్తు.

బం. ఈ యువకుడెవరమ్మ.

ఆం. స్వచ్ఛముగా తెనుగుభాష మాట్లాడగల నామహమ్మదీయ కుమారుడు.

హా. భాయిజీ సలాములేకం.

మ-కు. బిస్మిల్లా హిర్‌రహమా నిర్రహీమ్ అయ్యా నీవు కేవలము హాస్యవర్తనుడవుగా నున్నావు. నవ్వులాటలు మధ్య మధ్య సమయోచిత టంకపాడులు వేయుచు మాతల్లులతో మాట్లాడవలసియున్నది.

హా. సరే మాట్లాడను మాకీ బిస్మిల్లా నీవు చెప్పియున్నావే దానికి అర్థముబోలో: నేను నీజోలికిరాను.

మ-కు. గీ॥ మదినినమ్మినవారిని ♦ మనచునట్టి । వానిమిక్కిలిదయగల ♦ వానినీశ్వ ।
రునిసమాఖ్యతో ప్రారంభ ♦ మునుసలుపుచు । నున్నవాడనుబిస్మిల్ల ♦ నొప్పనిదియె ॥

హా. సెబాస్ చాలాబాగాయున్నది.

మ-హా. కుమారా యుద్ధమధ్యంబున ఆంగ్లేయులు భారతీయుల కంపిన సందేశములు నిష్ఫలితములైనవి నీకు తెలసినవిషయమే ఖిలాపతు సమస్యగతి యెటులున్నది.

మ-కు. భారతీయుల నెటులు మసిబూసి మారేడుగాయలును జేసినారో మమ్ముల నటులే గావించిరి.

హా. శనగలుదింటూ ఆముదాల చేతిలో బెట్టవలసినదే. భాయిజీ, మాది అమ్మ అడిగి యుండలేదు. అదియేదంటె.

కం॥ కోపము సేయక నాదగు । లోపములగణించక నెద ♦ లోమిత్రమవై ।
లాపతుకర్థము దెలియను । భాపలుకుల జెప్పవేని ♦ దానముగుల్కన్ ॥

మ-కు. ఖైలాపా అనగా మామతాచార్యుడు.

హ. ఓహో మాకు ఆదిశంకరుడట్టివాడా.

మ-కు. ఔను ఇస్లాము మతస్థులందరు ఖైలాపా నతిగౌరవముగా జూచుచుందురు.

మహ. ప్రస్తుతము ఖైలాపా ఎవరు.

మ-కు. తుర్కీసుల్తానే.

మహ. రాజ్యమతాధికారము లొక్కరికేయుండెనా అబ్బా యిది చాలాకష్టమే. అయినా మతాభివృద్ధికి సాధనము.

మ-పు. ఓమియద్ అని పిలువబడిన ఖిలాపతు కాలములో ఖిలాపతును రాజ్యముగా మార్చరాదని మహమ్మదు మనుమడగు హసేనువాదించెను తదుపరి నీవిషయ మునసే యజీదుయొక్క సైన్యముతో డెబ్బైయిద్దరు ఘోరయుద్ధ మొనరించి ఖిలాపతు రాజ్యరూపము వహించి యుండరాదను సాభిప్రాయ మింతవరకు నుండుట ట్లొనరించిరి. పిమ్మట టర్కీసుల్తానగు సలీము యీజిప్టును స్వాధీన మొనర్చుకొని ఖిలాపాపదవియు నధిష్ఠించెను.

హ. పాపమిప్పుడు తుర్కీసుల్తానుకు విషమదశసంభవించినది కాబోలు.

మహ. గీ॥ జర్మనులపక్షముండిర♦ష్యాతో యుద్ధ। మునొనరించుట చేతను♦గినుకబూని।
మిత్రమండలివారలు ♦ మెసపుటోమి। యా మొదలగుస్థలంబుల ♦ నాక్రమించె॥

ఆం. మెసపుటోమియా మొదలగు ప్రదేశములందే గాబోలు జెజ్రాత్ ఆల్ అరబ్బు అను పిలువబడు మక్కామదీనా మొదలగు మహమ్మదీయ పవిత్రక్షేత్రము లుండియున్నవి.

బం. ఔను మక్కామదీనా మొదలగు పవిత్రయాత్రల ముస్లీముల యధికారము నుండి తొలగించుట న్యాయమా.

హ. ద్రవ్యార్జన దేశార్జనలందు న్యాయమవసరమా.

అరి. గీ॥ తమదుఖైలాపబూనిన ♦ దారివిడచి। జేరుచునుమిత్రమండలి ♦ సేనలోన।
సంగరంబునొనర్చియు ♦ జయముగూర్చ। నొప్పిరేముసల్మానులు ♦ గొప్పవింత॥

మ-కు. హైందవభూమినుండి బయలుదేరిన ముస్లీముసైన్యములు తుర్కీకి వ్యతిరేకముగా బోరాడబోవుచున్నామనియు యుద్ధానంతరము కలీపానుండి సుల్తానును దొలగించి మతమున కవమానమొనరింప బడునేమోయని సంశయించి తమ సందేశమును బ్రిటిషువారికి దెలియజేసియుండిరి.

ఆం. అప్పు డాంగ్లేయులేమి ప్రత్యుత్తరమొసంగిరి.

మ-కు. గీ॥ తగదుసంబంధమనికిమ ♦ తంబునకును। గానమీదుమతమునకు♦హానిచేయ।
బడదుభీతినిబొందగా ♦ వలదటంచు। దిట్టముగమిత్రమండలి ♦ ధృతినిదెల్పె॥



గీ॥ కలహతీవ్రముహెచ్చిన ♦ కాలదిభరత। భూమికెన్నియొవార్తాన♦ములనొనర్చె।
భారతీయులసాహస♦ప్రజ్ఞలగని। భళిరెయనిమేటిసైన్యాధి ♦ పతులుమెచ్చె॥

హ. పొడిమాటలకేమిలే. సమయోచిత ప్రసంగములు.

బం. ఇండియా మంత్రియగు లాయడు జార్జి సందేశమేమి.

మ-కు. తుర్కీరాజధానియైన కాన్స్టాంటునోపిలును తీసికొనుటకుగాని ఏషియా మైనరులోను త్రేసులోను తుర్కీమతస్థులచే నిండియుండి ప్రసిద్ధివడసిన ప్రదేశముల నాక్రమించుటకు మేమభిప్రాయ మొందలేదని తియ్యనిమాటలతో కార్యము నెరవేర్చుకొనిరి.

బం. సంధివిషయములో శ్రద్ధవహించిన అమెరికా ప్రెసిడెంటు విల్సనుగారి అభిప్రాయమేమి.

హ. కృష్ణుడు కురుపాండవసంధి కెంతకష్టపడెనో విల్సను అంత కెక్కువ కష్టపడెను.

మ-కు. గీ॥ నిండురాజ్యముతుర్కికే♦యుండుగాని। యితరజాతులప్రజలజీ♦వితములకును।
ధనములకుహానిలేకుండ♦దనరిస్వేచ్ఛ। పాలనమునివ్వవిల్సను ♦ బల్కెఘనత॥

హ. ఇది యొకమాదిరి బాగానేయున్నది.

మ-కు. చం॥ ఇటులవచించినట్టినయ ♦ హేతువలిచ్చెడిమాటలన్నిచ।
క్కటులుగమారిపోయెతగ ♦ గాంచఖిలాపతుకల్లితుర్కికిఁ।
పటుతరహానిచేయబడె ♦ పాలనతంత్రవిధానమంతని।
ప్పటికినెరుంగసత్ప్రజకు ♦ బాటనొసంగెనుతల్లిలిన్నగఁ॥

బం. తుర్కీకి గావింపబడిన నియమములెవ్వి.

మ-కు. సీ॥ మిగులసేనలనుంచ ♦ దగదనిపెద్దయో, డలనెల్లగైకొనె ♦ బలిమిదగ్గ।
ప్రస్తుతమందునా ♦ పైకాలమునవిమా, నములుండనొప్పదే ♦ సమయమునను।
త్రేసులోశ్రేష్ఠప్ర ♦ దేశములనుయేషి, యామైనరులగ్రీసు ♦ కందజేసె।
మెసపుటోమియకొంత♦నొసగెసిరియను, క్రీస్తుసంఘుపాలనముకు♦సరవియనుచు।
గీ॥ సలలితంబుగమిత్రమం ♦ డలివిమాన। చయముస్వేచ్ఛగతుర్కిపై ♦సంచరించ।
వచ్చుమక్కామదీనాల ♦ వైభవమున। కెల్లనష్టముగలిగించె ♦ నేమియగునొ॥

బం. తుర్కీరాజ్యమనుపేరు మాత్రమేగాని మరేమి గానుపించదే బాగుగనేయున్నది గురుపదవి కేమియు సందిగ్ధము కలిగించి యుండలేదుగదా.

మ-కు. లేకేమి. ఖలీపాలు కోరీవంశస్థులై యుండవలెనట. వెనుక పెలస్తీప్రభువే తుర్కీసుల్తానును మతాచార్యునిగా నంగీకరించి యున్నపుడు కాజాలడని ఎవరు వాదించగలరు మరియొక్కటి కొద్దిదినములక్రిందట ఖిలాపా సమస్య మహమ్మదీయాభిప్రాయముపై నాధారపడియుండునని ముస్లీములు కోరినచో

ప్రభుత్వమువారు వ్యతిరేకము జెప్పజాలరని ప్రకటించియుండి యిపుడేమొన
రించిరో చూడుడు.

హా. తాత్కాలిత వరప్రదానము లెవరెరుంగరు. వర్తకసరణి.

గీ॥ మనమెరింగినచెవులకు ♦ మద్దికాయ । లాయసినభంగిజనులకు ♦ ల్లాసముగను ।
బల్కియక్కరదీరిన ♦ పైనసున్న । జాట్టుభావమునిపుడైన ♦ జూడుడింక ॥

మహా. గీ॥ కరముపాశ్చాత్యనాగరి♦కతదలంచ । పల్పుచుండెనుభౌతిక♦శక్తిపూజ ।
నల్లవారినిమిగులహీ♦నముగజూచు । చుండుటేగాదుసౌఖ్యము♦చూరగొనియె ॥

పాప మీయుద్ధమునకు ముందు బల్గేరియా సర్వియా మొదలగు దేశములు
తుర్కీపై విజృంభించి కొంతనష్టమును కలిగించెను కాబోలు.

బం. అక్కా అది అన్యాయమని యెవ్వరును తుర్కీకి సాయము జేసియుండలేదు
విజయులైనవారికి విభాగములు కుదరకుండుటచే తుర్కీరాజ్యవైభవము యథా
విధిని బ్రకాశించగలైను. ఐతే బ్రస్తుతము తుర్కీ స్వాతంత్ర్యాధికారము
గోలుపోయినట్లేగద.

హా. ఆహా. చెప్పకుండ

మ–కు. తల్లులారా నేబవేసించు సమయమున మాట్లాడుచున్నది చంచయాఖ్యని
గూర్చియేగదా

బం. ఔను.

మహా. చం॥ యూరపుదేశమేగిదగ ♦ నోపికమీరగధీవిశాలులై ।
భూరిపరీక్షలన్ జదివి ♦ పూర్ణముగాజయమందిజేరగన్ ।
యూరుజులొప్పిరేశ్రుతులు ♦ నొప్పవటంచునుశంకజెందక ।
య్యారె! కులంబులేదనిభ ♦ యంబునవాదములాడకుండిరే ॥

మ–కు. ఈదేశంబున యింజినీరింగు బారిష్టా అగ్రికల్చరు మొదలగు పరీక్షలు జదు
వుటకు ఖండాంతరముల కేగవచ్చునని మావైశ్యసహోదరులు తమ సభలందు
తీర్మానముజేసి యందరేకగ్రీవముగా నొప్పియుండినను పట్నపురిలో మాత్రము
సీమకక్ష నాటుకక్షలని బెట్టుకొని వాదనలకు దిగి గడబిడలు జేసినారు.

హా. ఎగిరినయెద్దె గంతమోయునది. గడబిడలు జేసినవారే యిప్పుడు మిన్నకున్నది.
అయినా మనవారి కెంతధైర్యము వచ్చినది.

బం. సీమకక్ష నాటుకక్ష లననేమి.

మ–కు. గీ॥ సీమకేగియుజదువగా ♦ శ్రేయమంచు । జెప్పువారిదిమాతరో ♦ సీమకక్ష ।
సీమకేగినవర్ణము ♦ చెడునుగాన । కూటగాదనువారిది ♦ నాటుకక్ష ॥

బం. సోదరీ నీవైశ్యబిడ్డ లిప్పుడిప్పుడు సంఘసంస్కరణలందు పాటుబడుచున్న
ట్లున్నదే.



హా. మా ఆబ్బాయీలు పాడపద్దులు వ్రాస్తేచాలులే అనేవారలా.

మ–కు. కొంతవరకు బనిచేయుచునే యున్నారు మొన్న కోయంబుత్తూరులో జరిగిన
మహాసభయందు రజస్వలానంతర వివాహములుకూడా అంగీకరించినారట.

బం. బలే మంచిమార్గము విధవావివాహములనుగూర్చి యేమైనా ఆలోచించిరా.

హా. ఇప్పుడు వారాలోచించునది బ్రాహ్మణవిధవలకువలె తలలగొరిగించు విషయమే.

అం. అట్టిపనుల కడ్డులేదు.

మ–కు. యొక్కతెరి దురాచారభూతములు వదలునా అవి యెటులబూనినవో అటు
లనే వదలగలవు.

హా. భూతములకు గావించెడి విధానము యెనరైనా దురాచారములకు గావించువా
రుంటె పరుగెత్తి పారిపోకుండునా.

మ–కు. వైశ్యసోదరులందన్నియు బాగుగనేయున్నవి గాని.

గీ॥ వరులకట్నంబులధికమై ♦ వన్నెబాపి । బీదజనములమిక్కిలి♦ బీల్చుచుండె ।
భూషణంబులకెక్కువ ♦ బోయవలశి । వచ్చెధనములవధువుల ♦ కచ్చెరువుగ ॥

హా. ఒక వర్ణము బాలికలను గొనుచుండ వేరొకకులము బాలులను కొనవలసి
యుండదా.

అం. అక్కలారా యీదురాచార మధికమాచునేయున్నది దానివిషయమై తీర్మానము
లున్నవిగాని యనుచారమునకు వచ్చుటలేదు యిటుల వారకాంతానిరసనము
మొదలైన తీర్మానము లనేకములున్నవి. మహాసభలందు వీరావేశులై చర్చిం
చిన విషయము లిండ్లకుజేరునపుడు మార్గమధ్యమందే విసర్జించుచున్నారు.

హా. భోగముమేళములు లేకుంటే యూరేగింపుల కొచ్చువారెవరు. బాణాసంచు
కాల్చని పెండ్లిపెండ్లియేనా.

ం. బాణమనిన జ్ఞాపకమువచ్చినది.

చం॥ మనుశరనైపుణీగరిమ ♦ భూరితరంబగుశబ్దవేదియున్ ।
గనమెటుయబ్బుగంబుమది ♦ గాంచెదమెంతయుగానియిప్పుడా ।
ట్లనుపమచాపవిద్యలజ ♦ యంబునుబొందితిరంబుకల్యగా ।
ర్జునుడనిబేరుగాంచినన ♦ శక్తిధరించినవీరుడుండెనా ॥

ం. లేకేమి. బం. ఏదేశకుమారుడు. మ. మన ఆంధ్రసూనుడే.

ం. ఆయనపేరేమి. మ–కు. గుండవరపు అప్పరాయాఖ్యుడు.

హా. అస్త్రవిద్య యేమిటికి బనివడును పిడిగుద్దుల భీమన్నకువలె మల్లవిద్య నేర్చినను
యింకా కొంతమేలు. కత్తులకటారుల బాణముల గీణముల బట్టనిచ్చువారె
వరు యికను మనకు గతి చేతిగుద్దులుముష్టిపోటులే:

బం. ప్రావీణ్యమల్లు లెవ్వరైనా యిప్పుడుండి యున్నారేమో. మ-కు. ఆహా.

చం॥ ప్రభువగుజాజ్ఝభూమిపతి ♦ పాలికినేగిఘయంబులేకనా ।
సభనుజయంబుగాంచియతి ♦ సాహసమల్లతనంబునందునన్ ।
యభినవభీముడంచుజను ♦ లాడగగౌరవమంది పేరుపం ।
రభమునగాంచిలోకమున ♦ రమ్యతరంబలకోడిరామమూ ।
ర్తిభరితబాహుసద్బలము ♦ దివ్యవిలాసముకెవ్వరీడగున్ ॥

బం. ఓహో యిట్టిజగజ్జట్టి కుమారులగనియేనా విచారమందుట.

హా. పనిలేనివాడు పిల్లితల గొరిగినాడట ఆంధ్రికు విచారమందుటే యొకపెద్దపని.

మ. అతడు యూరపునంతయు తిరిగి ప్రఖ్యాతిగనియున్నాడు. ఆంధ్రవీరకంఠీరవు డను బిరుదునుగాంచినవాడు సామాన్యుడా యిట్టిసుతులుండియే మనచెల్లి మనోవ్యథబడుట.

హా. ఆమె మతమునకిక మార్పులేదు.

బం. మననవ్వులాట అబ్బాయివలనకూడా కొన్ని జ్ఞాపకమువచ్చుచున్నవి మనమత ధర్మము లెరుంగక మౌఢ్యములో నున్నవారిని మాయమాటలచేత కొందరు మోసముజేసి మతభ్రష్టుల గావించుచున్నారుగదా.

హా. అన్నా పూర్వము బౌద్ధమతము పనియెటులున్నదో యిప్పుడు క్రీస్తుమతముపని అట్లాయున్నది.

మ-కు. ఇంకెవరు ఫాదరీలేగా.

బం. ఔను. మదీయకుమారుడైన రామమోహనుడు క్రైస్తవమత గురువులతోడ బోరాడి జయమొందియున్నాడు:

ఆం. రామమోహనునికి క్రైస్తవగురువులకు జరిగిన విశేషములెవ్వి.

హా. జీతములబుచ్చికొని మతవృద్ధిజేయునట్టి విశేషములే.

మ-కు. గీ॥ పైలరనుదొరవాదనల్ ♦ జాలసలపి। రామమోహనుపత్రికా ♦ రాజములకు ।
వ్రాయలేకజవాబులు ♦ చేయినిలపి । మిన్నకుండెనుమానమే ♦ మేలటంచు ॥

మ: పిమ్మట యేమిజరిగినది.

మ-కు. బాప్టిష్టు మతబోధకుడగు రివరెండ్ విల్లియంఏడమ్ రామమోహనునితో స్నేహముజేసి యతని తమజ్ఞానస్నానము జేయించదలచి కృషిజేసి జీసస్ దేవుని కుమారుడుగాదనియు ప్రజలపాపముకై యతడు మరణమునెందెనని జెప్పుట తప్పనియు జేసిన రామమోహనుని సహేతుకవాదనలకు ఏడం సత్యము గ్రహించి తన ఫాదరీయుద్యోగమునువిడిచి యూనిటేరియన్ మతమును స్వీకరించెను.



మ. ఇట్టివాను లప్పుడప్పుడు బుట్టుచుండుటచేతనే మనమత మింతవరకు స్థిరముగా నుండగల్గినది.

హా. వెనుక మహమ్మదీయుల ధాటికిని యిప్పుడు క్రైస్తవుల మాయలకును మనమతము నిలచినమాట నిజమే. సార్థకమేమి.

ఆం. నాయనా ఆంగ్లేయులలో నింకెవ్వరైనా హిందూమతమును స్వీకరించియుండిరా

బం. ఉన్నారు.

మ. చం॥ గనుచుమతాళిశాస్త్రముల ♦ గాలుతిరంబుగనిల్పలేకహా ।
యినిగనకన్ జరించుచుని ♦ రీశ్వరవాదినియౌచు భారతా ।
వనికరుదెంచిగీతలను ♦ భక్తితొ బాఠనజేసితన్మతం ।
బునుదగయన్నిబెసెంటుపరి ♦ పూర్ణమనస్సునస్వీకరింపదే ॥

హా. ఓహో యన్నిబెసెంటుసంగతి యందరికి దెలసినదే హైందవస్వాతంత్ర్యమామెకు బనికిరాదు.

మ-కు. వాస్తవము ఆమె గంభీరోపన్యాసము లప్పుడప్పుడు వినియున్నాను.

ఆం. ఎవ్వరి కుమారిక.

మ. వేదాంతగణితశాస్త్రజ్ఞుడైన విల్లియమ్ ఫిజ్ పుడుగారి కుమారిక ఈమె మహా యుద్ధమును పేరిట శ్రీమహాభారతకథనమును అనుసరణపాత్రుడగు రాజు అను పేరిట శ్రీరామచరిత్రమును మృదుమధురశైలిని వ్రాసి బూర్వము భరతఖండ నాయకుల మహిమోన్నతమును సకలదేశముల వారబ్బురము జెందునట్లు చేయు టయేగాక శ్రీమద్భగవద్గీత నాంగ్లేయభాషలో వ్రాసి యూరపుదేశమున కంతకును తన్మహిమను వెదజల్లెను.

హా. లాభములేదు యితరఖండములలో హైందవమతమును వ్యాపింపజేసినదా.

ఆం. అటులనా.

మ. మ॥ ఇలనొప్పన్ దగవారణాశిపురిలో ♦ హిందూకళాశాలరూ ।
కలరాసుల్బహుగూర్చిసక్రమముగా ♦ గాంక్షించిసద్బాలకుల్ ।
లలితంబౌమతినిచ్చుసంస్కృతముజా ♦ లన్నేర్చివాచాలస ।
త్కలిమిన్ గాంచగజేసెభూరికరుణన్ ♦ ధన్యాత్మయే స్త్రీయెకో ॥

హా. ఇరువైపుల బనిసేయు యన్నిబెసెంటమ్మా.

బం. యన్నిబెసెంటేగాదు నివేదితాసోదరి యెంత దేశసేవజేసియున్నది.

ఆం. ఆమె ఎవ్వరు. హా. ఒకతల్లికి బిడ్డయే.

బం. స్వామి వివేకానందుని శిష్యురాలు.

ఆం. సోదరి నివేదితయనునది తెనుగుపేరుగాదా పూర్వపు నామమేద్ది.

బం. మార్గరేట్ నోబుల్. ఆం. ఎవ్వరి కుమారికారత్నము.

బం. ఇంగ్లాండు నివాసుడైన రెవరెండు ఆర్ నోబులుగారి కుమారిక ఆమె జన్మభూమి యందు విద్యాదాన పరిశ్రమవతియని పేరుగాంచిన వనితారత్నము.

సీ॥ గురువుతో సద్భక్తి ♦ దిరిగి వేదాంతము, జ్ఞానమ్ము దెల్పిన ♦ మానినిదగ ।
కలకత్తవాసంబు ♦ గావించి యుపతుల, కెల్లసన్మార్గము ♦ నెరుక బరచె ।
ప్లేగురోగులకును ♦ ప్రేమతో నుపచార, మొనరించినటువంటి ♦ వనితధాత్రి ।
వింతవిగ్రహపూజ ♦ కంతరార్థంబును, బోధన జేసిన ♦ పుణ్యురాలు ।

గీ॥ ఆర్యజీవితపద్ధతు ♦ లనుసరించి । మెలగ నేర్పినధన్యాత్మ ♦ నిలిపిభక్తి ।
మానసికపూజ జేసిన ♦ మహిమరాలు । మార్గరేట్ నోబులెన్నగా ♦ దుర్గసమమె ॥

మ-కు. యామెగురువగు వివేకానందు డెవరిశిష్యుడు.

ఆం. గీ॥ దివ్యమైనట్టితనయుప ♦ దేశవాక్య । చయముచే శిష్యబృందహృ ♦ చ్ఛలనమాపె ।
నేమహాయోగనిరతుడా ♦ రామకృష్ణ । పరమహంసకు శిష్యుడు ♦ సరసుడెంచ॥

హా. ఓహో ఆరామకృష్ణుడు వట్టిపిచ్చివాడె, ఆయనకు ఈయన శిష్యుడు.

ఆం. మిసెస్ ఫాంక్ రిష్టు అని జెప్పుకొనుచుండ వినియుంటి నామెవర్తనమెట్టిది.

హా. మగవారిని లక్ష్యము జేయక ఆడవారిని జేర్చుకొని పార్టీగట్టినదే. అటువంటి వారుండవలసినదే. పురుషుల నణచవలసినదే.

మ-కు. పురుషులకుగల స్వాతంత్ర్యసభ్యత్వములు స్త్రీలకుండవలెనని వాదించినట్టి ధీరవంతురాలు.

బం. ఔనౌను పార్లమెంటు సభ్యత్వమునకై బోరాడియుండెను.

మ-కు. వాస్తవము మిసెస్ ఫాంక్ రిష్టేగాదు నామెబోధనచే మరికొందరు స్త్రీలు పోష్టుయుత్తరములందు ప్రేలునట్టి మందులబెట్టియు వీధులలో నడచు పురుషులపై రాళ్లురువ్వియు యనేక దుండగముల గావించియున్నారు.

హా. స్వగర్భప్రజ లెన్నితప్పుల జేసినను సైరింపవలసినదే పెంపుడుప్రజలు కొద్దితప్పు జేసినను మాడ్చవలసినదే.

ఆం. పర్యవసాన మేమి తేలినది.

మ-కు. ఐరోపా మహాసంగ్రామము దీర్ఘముగా జరిగియుండుటచే స్త్రీలయుద్యమము చాలావరకు కొనసాగినది.

హా. స్వాతంత్ర్యమునకై అచ్చటి స్త్రీలుజూపిన సాహసము ఇచ్చట పురుషులకైనా లేదు. స్థలమహిమో జలమహిమో.

ఆం. చం॥ మనదగుపుత్రికల్మిగుల ♦ మాన్యవతుల్మరిభర్తయాజ్ఞలన్ ।
గొనిహితబుద్ధిజేయుచును ♦ కోపముదాల్చకదైవమట్టులన్ ।
గనుచును గేహకృత్యముల ♦ గౌరవమొప్పగ నిర్వహింత్రువా ।
దనలకుబోకబిడ్డలను ♦ దాదులు లేక నెపెంతురెంతయున్ ॥



హా. స్వయముగా పాలిచ్చి విక్టోరియా మహారాజ్ఞి బిడ్డలను బెంచియుండలేదా.

మ-కు. ఎచ్చటనో కొందరు గయ్యాళులుండినను హిందూసుందరులు బాగుగా నింటిపనులు నిర్వహింపుచుందురు మాయువతులు గోషానిర్బంధనలోనుండినను పతియాజ్ఞల జవదాటక మెలంగుచుందురు.

ఆం. గోషాపద్ధతి ఈశ్వరసృష్టివైచిత్ర్యమైనా జూచుటకు ప్రాప్తములేదుగదా ఇది గ్రహించియే గంపలగూడెము కుమారరాజు మిక్కిలి పరిశోధనజేసి పూర్వాచారము నిరసించి అంతఃపురవాసము మంచిదికాదని నిరూపించి వర్తనలోకి దెచ్చుచున్నాడు.

హా. స్త్రీల కంతఃపురవాసము చిలకల పంజరములో బెట్టినట్లె.

మ-కు. కోటగిరి వెంకటకృష్ణారావుగారా.

ఆం. ఔను.

మ-కు. వారభినవ పాండవీయము మొదలగు గ్రంథముల వ్రాసి ఆంధ్రభాష నలంకరించిన విద్యాప్రావీణ్యుడే.

బం. ఇట్టి దురాచారసంస్కరణముల గనియుండియే యిటుల పరితపించుట.

ఆం. సంస్కరణ లన్నిదేశముల వ్యాపించి అనుచారమునకు వచ్చినప్పుడుగదా నె సంతసింపవలశినది.

హా. నేసంతసింపను కాలమువెంట ఆచారములు మారవలసివచ్చును యిప్పుడు సంస్కరింపబడినదీ వేరొకప్పుడు దురాచారముగావచ్చును.

మ-కు. మాలోకూడా బదురుద్దీన్ తయ్యాబ్జి బారట్లా తనకుమారికలకు గోషానిర్బంధము తొలగించి విద్యనభ్యసించుటకు ఇంగ్లాండుకు బంపియున్నాడు.

మహా. మంచిది.

హా. నీకు మంచిదైన పూర్వాచారపరాయణులకు మంచిదా.

మ-కు. శా॥ మర్మంబేమియు లేకమానసముల ♦ న్మర్యాదగా భర్తలన్ ।
బేర్మింజూచుచు సౌఖ్యబెట్టుచునుయే ♦ బీరంబులన్వల్కకా ।
భర్మస్త్రీలువివేకమార్గచరులై ♦ వర్తింతురాంధ్రాంబయా ।
ధర్మంబెంచునయాంగ్లమానినులువె ♦ ద్దల్మెచ్చసద్వర్తనల్ ॥

ఆం. మహమ్మదీయ సుందరులుకూడా భర్తలకనుకూలవతులై పరిచర్యలజేయుచు భర్తలసౌఖ్యమే తమసౌఖ్యముగా భావింతురట్టులే హైందవయువతులు వర్తించుచుందురుగాని ఆంగ్లేయవనితలవలె స్వాతంత్ర్యమునకై పోరుట

మాత్రము లేదుగాని రామాయణములో పిడకలాట యన్నట్లు ఏదో క్రైస్తవ మతప్రస్తాపనలో నీచరిత్రలడ్డమువచ్చినవి క్రైస్తవులు మతాభివృద్ధికై యే మార్గముల బూనియుండిరి.

మ-కు. వారుజేసిన పను లమోఘములు.

హా. మనవలె యెక్కడలేని వర్ణవ్యవస్థలు బెట్టుకొని మతవృద్ధినిజేయక నోరుమూసికొని యుండవలెనేమి.

మహా. క్రైస్తవమతములోజేరి మాత్రము హిందువులు కులభేదముమానిరా పంచమజాతిలోజేరిన మాలమాదిగలను జూచిన తేటపడగలదు.

మ-కు. చం॥ పదలక పాఠశాలలను ♦ బైబిలు బోధనొనర్చ బాలకుల్ ।
జదివిచలించిక్రీస్తుమత ♦ సంఘమునందున జేరునంచు దా ।
హృదయమునన్దలంచియును ♦ హీనత డాక్టరుడప్పుడెల్లగన్ ।
బెదరక రామమోహనుడు ♦ బిడ్డలకిట్లనె వేదశాస్త్రముల్ ।
వెదకిన హేమకాదులను ♦ విల్సనుహిందువులై రెబైబిలున్ ।
తుదకుఖురానుజూచియును ♦ దూరముజేసితినేమతంబుగా ।
దిది చెడుమార్గమెన్నటికి ♦ నెల్లమతంబులగల్గుగ్రంధముల్ ।
సదమలులౌచుచూడనగు ♦ సారముబోధపడంగనిట్లునె ।
మ్మదిగనుబోధజేయస్వగ్ర ♦ మంబుగ బాసిరిసందియంబులన్ ॥

ఆం. అప్పుడా డాక్టరే మొనరించెను.

మ-కు. క్రమక్రమముగా పాఠశాలల నెలకొల్పి వాటియందు బైబిలు పాఠములు వృద్ధిజేసియుండిరి.

హా. ఎంతవృద్ధిజేసినను యెవ్వరు జేరవలయునో వారేజేరిరి వారప్పుడు మనమత ధర్మంబుల నెంతగ్రహించి వర్తించిరో ఇప్పుడు క్రైస్తవమత ధర్మమంతయే గ్రహించి వర్తించుచున్నారు.

మహ. మహమ్మదీయకుమారా ఆంగిలేయులెంత ప్రయత్నముజేసినను మీమతస్థులంతగా చలించినట్లు గనుపించదు షాజహాను ఔరంగజేబు మొదలగు పాదుషాలు బెట్టిన యిక్కట్టులకే చలించని హిందువు లిప్పు డింగ్లీషుఫాదరుల మాయోపాయములకు మాత్రము లోబడుదురా యెచ్చటో యెవ్వరో యెదో మాయకులోబడి మతభ్రష్టులైనను యది జెప్పుకొనవలసినదిగాదు కొన్ని యాశలజూపి మతమెట్టిదో యెరుంగని మూఢులను జేర్పగలిగిరేగాని మత ధర్మంబుల నెరింగినవారి జేర్పగలిగిరా.

హా. మౌఢ్యములోనున్న మనసోదరులను మాయజేయుచుండ మనవారు నోరుదెరచి



కొని యూరకుండిరిగదా. వారు మనసంఘమునుండి దొలంగిన మనకెంతపట్టు తక్కువో గ్రహించగల్గిరా. చివరకు యశుద్ధముదిను శునకములను బెంచి ప్రేమించి యంటుకొనవచ్చునుగాని మానవులను దాకి ప్రేమించకూడదట యిట్టి ఉద్యమముల దెలపినవారు నవనాగరికులని మనపూర్వాచారపరాయణులు నిందించుచుందురు. పంచమసోదరులలో మాత్రము మహాభక్తులు లేరా మనగ్రంధములలో నెంతమంది గనుపించుటలేదు.

బం. నాయనా ఈసదుద్యమందరు గ్రహించిన బాగుపడియేయుందురు.

మ. కొంత మనబిడ్డల లోపముకూడాగలదు.

మ-కు. తల్లీ సత్యము.

ఉ॥ పంచమసోదరాళిబలు ♦ బాముల బెట్టుచు వారికేయడన్ ।
వంచనగూర్చి నీచులుగ ♦ వాడుచువిద్యల నేర్పకెంతయో ।
చించిమతప్రధర్మముల ♦ శిక్షణజేయకమిన్నకుంటచే ।
గాంచిరిఫాదరుల్ జయము ♦ గానివిచారముజేయతప్పగున్ ॥

హా. తప్పులలోగొప్పతప్పు మనవారిప్పటికైనను తెలివిదెచ్చికొనిరా. వారితో మనకు గానలసినదేమని మనవారిబెట్టు "బలవంతమైనసర్పము । చలిచీమలజేతజిక్కి చావదెసుమతీ" ఈవాక్యార్థము గ్రహించినజాలు.

ఆం. కుమారా పుత్రులు వారిని సోదరులని యెంచక శుభకార్యములందు గ్రామముల నూరేగింపులు మొదలైన వేడుకలు జేసికొననివ్వక మానవవ్యక్తికి సాధనభూతమైన విద్యాభోధన జేయకయు నీచులుగాజూచి పలుబాధలు బెట్టుటచే యాబాధల దాడికోర్వలేక పంచములు పరమతంబుల బ్రవేశించిరి పాపమిటు జూడబడియు కొన్నికుటుంబములవా రిప్పటికి మతభ్రష్టులు గాకయుండిరి. యిప్పటికైనా తెలివొంది వారికి విద్యాదానముజేసిన మతధర్మముల గ్రహించి యితరమతంబుల జొరకుందురు.

హా. దుర్దశబట్టియుండ అటులెందుకు జేయుదురు. యింకా మతము సన్నగిలవలసి యున్నది మనము సన్నగిలవలసియున్నాము.

మ-కు. ఇప్పుడచ్చటచ్చట పంచమబాలుర చదువుటకు పాఠశాలల బెట్టించి వారి వృద్ధికై సోదరులు తగుపాటు బడుచునేయున్నారు.

బం. కొంచమైనను మతము నెరింగినవారు అన్యమతముల జేరుదురా.

మ-కు. చం॥ చవిగొనివిష్ణుదేవుగుణ ♦ సారసుధన్ మతధర్మముల్దగన్ ।
రవికులరత్నమైనరఘు ♦ రామజపంబొనరించుచున్ సదా ।
దివిజులుమెచ్చనామముల ♦ దీరిచిభక్తిమెలంగుమాలవై ।
ష్ణవులనుజేర్చగల్గిరెవ ♦ శంబొనరించుక్రీస్తుమండలిన్ ॥

హ. పూర్వాచారపరాయణు లిప్పటికిని పంచములకు సన్మంత్రోపదేశ మొనర్ప కూడ దని జెప్పుచున్నారు శ్రీరామానుజులవారట్లుదలంచక పంచములకుసహా తిరు మంత్రోపదేశ మొనర్చి వైష్ణవులగావించి యుండుటచేతనే వారిప్పటికిని మత భ్రష్టులుగాక నిలచియున్నారు. మతకర్తలు ధనముకై మతాభివృద్ధిజేసి యుండలేదు. సామాన్య జనులనుగూడఁ మాధ్యముపదలించి ముక్తినొందుటకు పాటుబడియున్నారు.

మ-కు. చం॥ సరసులుబౌద్ధశాసకులు ♦ శంకరుడార్యమతప్రబోధకుల్ ।
గురులుమహమ్మదాదులును ♦ గోరిరెజీతములేనృపోత్తముల్ ।
గురుమతబోధకుల్ధనము ♦ గోరునెహేయపుసౌఖ్యమేలఫా ।
దరులపూర్వమెవ్వరిటు ♦ ద్రవ్యముకైమతబోధజేసిరో ॥

బం. వాస్తవము వారు ధనాశాబద్ధులై పామరులకు కొన్ని యాశలజూపి మతము నకు వశులను జేయుచున్నారు.

మ-పు. మాయోపాయధనాశకు లోబడి మతభ్రష్టులైనవారు వేరొకరటుగావించిన తన్మాయకు లోబడరా ప్రయోజనమేమి నిలుకడెక్కడిది.

హ. మనమాశలజూపించుటకు ధనములులేవు భూములులేవు మనవారాదినుండి మత సహనమం దారితేరినవారు.

మ-కు. ఔను.

చం॥ అరయగలోకమందునమ ♦ హాత్ములకన్నిమతంబులొక్కటే ।
ధరణిలోరామతీర్థుడటు ♦ దల్చకయున్నక్రమంబుగానుస ।
త్వరమృదువాగ్ఝరీవితతి ♦ బారగిజేసిసమస్తదేశముల్ ।
తిరిగిమతాభివృద్ధినతి ♦ తీవ్రతజేయడెమెప్పుగాంచడే ॥

మహా. ఔను సర్వమతములు తనవిగానే భావించిన సర్వసముడు యమ్మహానుభావుడు యూరపులో దిరిగినంతవరకొక క్రైస్తవుడుగాను మహమ్మదీయ పట్టణంబుల దిరిగినంతవరకొక మహమ్మదీయుడుగా నుండుటేగాక ఆయా మతధర్మంబు లాయావారికి బోధించియున్నాడు.

బం. లాభమేమి రామతీర్థు డవలంబించిన సర్వసమత్వము మంచిదేగాని కాలము వెంటనడువవలయును.

హ. మనసోదరుల నన్యమతమువా రీడ్చికొనిపోవుచుండ మనము సహనమూనుట ధర్మమా మనము తగుప్రయత్నముల నితరమతములవారికి మన మతబోధజేసి లాగికొనవలశినదే. స్వామి వివేకానందునిదే దెబ్బ.

ఆం. రామతీర్థు డెచ్చటివాడు.



మ-కు. పాంచాలాంబసూనుడు గుజర్వాలామండలమున మురళీవాలాయను గ్రామం బునజన్మించినవాడు పెక్కుభాషాపరిచయుడు అమెరికా జపాన్ కొలంబియా మొదలగు ఖండములకేగి విజ్ఞానమును వెదజల్లిన ధన్యుడు ఈజిప్టు మసీదులో పరిషయాభాషలో గొప్పయుపన్యాసములిచ్చి మహమ్మదీయులచే మెప్పు వడసినవాడు.

హ. ఓహో యిప్పుడు మహాత్మా కరన్‌చంద్ గంధివలె రామతీర్థుడును హైందవ మహమ్మదీయుల నొకటిగా జూచియుండెనా.

బం. గీ॥ రామతీర్థునివంటివి ♦ రాగిసర్వ । మతసహనమూర్తివిజ్ఞాన ♦ సతతవర్తి ।
సచ్చిదానందపురుషుడు ♦ సర్వసముడు । వాదభేదవిరహితుండు ♦ వసుధలేడు॥

హ. అటువంటి మహాత్ములుండిన హైందవమహమ్మదీయుల భేదము లంతరించకుండి యుండునా.

ఆం. అంతటివానినైనా గనుటకు నోచుకొనక పోతిని దేశబంధు లాజపతిరాయి పాంచాలాంబ కుమారుడేగద.

మ.కు. ఔను.

సీ॥ ఆర్యసమాజంబు ♦ నభివృద్ధిజెందగా, జేసెనుదారంబు ♦ భాసిలంగ ।
నవనిదయానంద ♦ యాంగ్లవేదిక్కళా, శాలనుస్థాపించె ♦ మేలుబొంద ।
దయమీరతనవగు ♦ ద్రవ్యంబుపెచ్చించె, కాటకంబునుబాపు ♦ కార్యమునకు ।
నమెరికాయందున ♦ హైందవహోంరూలు, నేర్పాటుగావించి ♦ నేర్పుమీర ।
సంగతులదెల్పనచ్చటే ♦ యంగుయిండి । యాసుపత్రికనడపగా ♦ జేసెనస్మ ।
మిగులసేవనుమాతృభూ ♦ మికినొనర్చె । లాజపతిరాయిసామాన్య ♦ దేజగిమున ॥

ఈదేశబంధువే నేరముజేయనదె దొరతనమువారిచేవెనుకొకపర్యాయము ప్రవా సమున కంపబడియుండె నిప్పుడైరోసా మహాసంగ్రామము ప్రారంభమైనప్పటినుండి యు హైందవభూమికి రావలదని నిషేధించి మొన్నమొన్ననేవిముక్తి గలిగియుండెను.

హ. లాజపతిరాయిని అమాంతముగా దీసికొనిపోయి మాండలేకోటలో బడవేసి యుంచి పాపముదలంచి కాబోలు పిమ్మట విడపించియుండిరి యిటులనే ఆలీ సోదరులను కొన్నాళ్లు బడవేసియుంచిరి దేశభక్తులకిదియే విశ్రాంతి.

ఆం. గీ॥ సోదరీమణులారనన్ ♦ జూడగోరి । వచ్చితిరిమీరుసౌఖ్యంబు ♦ వాసియిటకు ।
గుడచిసాదముపిశ్రాంతి ♦ గొనియొకింత । వచ్చిముచ్చటలాడంగ ♦ వచ్చుమీద ॥

మనకష్టములిప్పుడు దీరునవిగావు దూరాగమనముచే డస్సియున్నారు పోవు దమురండు యింతలో సంఘసంస్కరణాభిలాష పుత్రుడేతెంచవచ్చును యాతని వలన కష్టనిష్ఠురములు పూర్ణముగా దెలియగలవు.

బం. మంచిది.

హా. ఏపాటుదప్పినా సాపాటుదప్పదు కొంచము వేళమించిన మనమాకలికి సహించజాలము వేళకు గంజియైన దొరకక లబలబ మొత్తుకొనువారిగతి పరమాత్మునకెరుక. (నిష్క్రమింతురు.)

ఇయ్యది వైశ్యకులపారావారసుధాకరశతృవర్గభీకర గ్రంధివంశ కౌండిన్యసగోత్ర పవిత్ర తాతయార్యదుహిత్ర బసవయ సుబ్బమాంబాప్రియపుత్ర సజ్జనమిత్ర బంధుజనాప్త వెంకటసుబ్బరాయగుప్త విరచితాంధ్రమాత నాటకంబున ద్వితీయాఙ్కము.

---

## ఆంధ్రమాత - తృతీయాఙ్కము.

(ప్రవేశము - ఆంధ్రపుత్రుడు.)

ఆం-పు. ఉ॥ ఇడ్డెనదోసెలప్పడము ♦ లింపగుకాఫికి నెమ్మినేడుకోట్ ।
గుడ్డలుసిల్కుమల్లులకు ♦ కోమలవేశ్యలకర్పణంబుగన్ ।
వడ్డికిదెచ్చియైనదగ ♦ వందలువేలునుఖర్చుజేతురా ।
బిడ్డలబట్టిచెంపలను ♦ వేయకతల్లులుజూడభావ్యమా ॥

(ప్రవేశము - హాస్యకుమారుడు.)

హా. బలే బాగాయున్నది కాఫిహోటలలో గొంతువరకు మెక్కివచ్చేది యింటిలో పాదముమీద అలిగేది.

(ప్రవేశము - ఆంధ్ర బంగాళ మహారాష్ట్రమాతలు మహమ్మదీయ కుమారుడు)

ఆం-పు. మాతలారా నమస్కారములు.

మాత. దీర్ఘాయుర్భవతి మాతృసేవాసిద్ధిరస్తు.

ఆం-పు. (మహమ్మదీయకుమారునిజూచి) సోదరా ఆదాబ్.

మ-కు. భాయిజీ ఆదాబ్.

మహ. మహమ్మదీయులెవ్వరైనా హైందవమతమును స్వీకరించియుండిరా.

మ-కు. ఎచ్చట గనుపించదు.

ఆం-పు. ఉ॥ మామతమందుజేర్చుకొను ♦ మార్గమొకింతయులేదుజూడగన్ ।
కోమటిరాచబాపనల ♦ కోటులజేర్చుకొనంగరొప్పరా ।
యామతమానవోత్తముల ♦ నార్యజనంబులకట్టుబాటుచే ।
ప్రేమతోజేర్చరేనిమల ♦ పెద్దలుమెచ్చరుమానసంబునన్ ॥



హా. అస లొకమతమువారిని మరొకరేల జెరుపవలె ఈశ్వరునారాధించుట కేమతమైననేమి.

ఆం-పు. ఐనను కబీరాదులులేరా ఇదిగాక సమస్త పుణ్యక్షేత్రంబుల దర్శించి హరిభక్తుడై తత్కథాకాలక్షేపము జేయుచు జీవయాత్రజేసిన మీరాదాసు నందరెరింగినదేకదా.

హా. ఆతనిదే తెలివి చదువు సంధ్యలేదు హరికధలు భక్తిరసముగా జెప్పేవాడు.

ఆం. నాగర్భమున వాసముచేయుచున్న వారందరూ నాబిడ్డలే ఏమతమైననేమి సర్వమతస్థులు సోదరభావముచే మెలంగుచు విద్యాధురీణులై యొకతల్లిబిడ్డలెట్టులో ఈశ్వరసృష్టి మతంబులట్టివేయని గ్రహించి పాలునీళ్లవలె కలసి నన్నుద్ధరించినజాలును,

హా. ధరలు హెచ్చియుండుటచే ప్రజలు తిండికి మాడుచున్నారని యడుగగా ఆంధ్రదేశభక్తుడనిపించుకొనిన యొకరు యితరదేశములకంటె నింకా మనదేశమందే ధరలు సరసముగానున్నవి యిదిగాక కూలికూడా హెచ్చినది తగ్గించ నవసరములేదని ప్రత్యుత్తరమిచ్చియుండిరి దేశమున కుపకారముచేయుచున్నటుల నటించుచు యున్నతపదవులు లభించగనే ప్రజాసేవమరచుటేగాక కరువుకాలము కన్నులకుగానుపించదు.

ఆం. నాయనా పల్లెలందు పురుషులకు దినమునకు నాలుగుఅణాలు కూలియున్నది కొన్నిగృహములం దొక్కొక్కని కష్టమునకు ముగ్వురు నలుగురాధారపడియుండియుందురు పావులాకు శేరుబియ్యము దొరకుచుండిన వారికెటుల సరిపోవును. సామాన్యముగా వృద్ధులు బాలులులేని మందిరంబులుండవు కూలిసంపాదించువాడొక్కడున్న వారినెట్లు పోషించవలెనిది యెవ్వరికిబట్టదు గొప్పపదవులందుండి వేలకు వేలార్జించు వారిండ్లలో నున్నవారందరు ధనమార్జించుచున్నారా?యొందరెందరో యొక్కరి సంపాదనపై ఆధారపడియుండుట దెలసియుండియు న్యాయముచూడక కూపస్థమండూకములవలె నెచ్చటనో పట్టణముల బడియుండి సుఖించువారికి పల్లెలలోనుండు బీదలదుస్థితి యెటుల దెలియగలదు. బిడ్డలం దెచ్చటజూచినను ఆకలియేడ్పులేగాని వేరొండుగానరాదు పుత్రులారా యీకష్టము నేనెట్లు సహింతును అక్కలారా బీదబిడ్డలకు తిండికష్టము యెప్పుడు తొలంగునో అప్పుడు నాకంటికి నిద్రపట్టును.

హా. దినమునకు నాలుగైదు అణాలు గడించునట్టి కూలివారికి రూపాయికి నాలుగు శేర్లు బియ్యము ధరయుండిన కరువుగాదనిజెప్ప సాహసించు పుణ్యాత్ములు వేలకువేలు గైకొని దొరతనమువారి ధనమేల నష్టమొనర్చవలె దినమునకొక

రూపాయిగైకొని పనిచేయకూడదా. పాపము గొప్పవేతనము లుండియు బొట్టనిండక అన్యాయముగా ప్రజలనుపీడించి లంచములబట్టువారు కూడా యున్నారు. తమ కడుపునిండిన జాలును. యిట్టివారే న్యాయస్థానములందు సభ్యులు ప్రజలకెట్లు సౌఖ్యముగల్గును.

ఆం. బీదబిడ్డలు మాడవలసిన కాలమువచ్చినది.

ఆం-పు. మహమ్మదీయనాయకులుకూడా కొందరు మతవైషమ్యమునూని హైందవ మహమ్మదీయులు కలసిమెలసియుండిన దేశమునకు క్షేమమనిజెప్పుచున్నారు. కాటకబాధయు దొలంగవచ్చును.

హా. ఉన్నతపదవులందు కొందరు క్షామదేవతలు జేరియుండ దేశమున క్షామమెటుల దొలంగును.

గీ॥ పంటలధికంబుగాబండు ♦ ప్రజలకట్లు । పెద్దవ్యాపార మొనరించు ♦ బేరులకును ।
ధరలుగలిగుండు క్షేమంచి ♦ దారియయ్యె । ద్రవ్యరాసులగూర్చంగ ♦ దలచనాత్మ ॥

హా. ఆర్జించిననేమి కాకులనుగొట్టి గద్దలకుబెట్టినట్లే దొరతనమువారు నిద్రపోవుచుండలేదులే వర్తకపన్నులుండియేయున్నవి.

మహా. గీ॥ మెక్కపొట్టలనిండగా ♦ మెతుకులేక । కట్టగుడ్డలు లేకను ♦ కాయములకు ।
మొఱ్ఱొదేముడయనుచును ♦ మొత్తుకొనెడి । బీదవారలగతియేమి ♦ బిడ్డలార ॥

మ-కు. పాపము వారు పాలకులకు జెప్పికొనుటకైనా చేతగాదు చదువరులు ధనికులు యేసభ్యత్వమునకో యేగౌరవపదవులకో పాటుపడుచుందురుగాని కాలమిటులున్నదె బీదలెటుల బ్రతుకవలెనని పారజూచి జెప్పువారులరుదు.

హా. జెప్పినను ధరలు సరసముగానే యున్నవనిజెప్ప క్షామదేవతలు లేరా.

ఆం-పు. దేనినుద్ధరించబూనినను ముందు మతభేదములణంచవలె.

మ-కు. భాయిజీ యదార్థము.

ఉ॥ భారతమాతపుత్రులుకృ ♦ పారసమూర్తులుసత్యమార్గసం ।
చారులు దేశభక్తులు వి ♦ శాలహృదాబ్జులు దీనపోషణా ।
చారులు ధర్మసత్వధవి ♦ చారణపుంగవులాలిసోదరుల్ ।
వారివిశాలభావము ల ♦ వారితధీరము జెప్పశక్యమా ॥

ఆం-పు. మౌలానా సౌకతాలి మహమ్మదాలి సోదరులా, వారుమతభేదములేక దేశోద్ధరణకై పాటుబడుచున్న మహాశయులే.

హా. పాపము వీరిద్దరిని కారాగృహములో బాగానే పడవేసిబెట్టి విడచియున్నారు. దేశభక్తులు ముందు కొంతవరకు కారాగారసౌఖ్య మనుభవించవలసినదే. విధికృతము వారికి తప్పదు.



మహా. వీరి జనకుడెవరో.

ఆం.పు. రాంపూరి సంస్థానమున గొప్పయుద్యోగములందుండి కీర్తిగడించిన అబ్దుల్ అలీఖాన్ గారు.

హా. గొప్పవంశమే పరువుప్రతిష్ఠలు గలవారె.

మహా. తల్లిపేరేమి.

ఆం-పు. అబాదిబాను అబ్దుల్ ఆలీబీగమ్.

ఉ॥ సుతులప్రవాసమంపినను ♦ శోకమునెందికృశించకన్నదా ।
వెతలకుజంకకన్నదిని ♦ భీతినడంచుచుధైర్యమూని సం ।
తతమును దేశసేవహిత ♦ తత్పరతన్ జరియించెనట్టిభా ।
రతయువతీమణిన్భువిని ♦ రంతరమెంచినపుణ్యమబ్బదె ॥

ఆం. ఆలీసోదరుల గన్నతల్లిదే భాగ్యము.

మహా. వారేమియొనరించిరో.

ఆం-పు. మహమ్మదాలి భారతీయ అసంతృప్తిని దెల్పుటకై మిక్కిలి పాటుబడియుండుటే గాక పత్రికల కనేకవ్యాసముల వ్రాసి వానినఖిలభారత మహమ్మదీయ సభలందు జదివియుండిరి వారి “ప్రాచీననవీనహిందూదేశము” అను వ్యాసమును గాంచిన వారి సాహిత్యప్రావీణ్యము, నిష్పక్షపాతబుద్ధి దెలియగలదు.

ఆం. అట్టివారినైనా మహమ్మదీయసంతానమునందు గాంచకుంటినిగదా.

చం॥ చతురతసంఘసంస్కరణ ♦ సంగతులెన్నియొగద్దెపైనజే ।
ప్పితదనుసారవర్తనము ♦ ప్రీతినిసల్పకవాక్యశూరులై ।
యతులితపేరుకై పెనగు ♦ లాడెడివారొకకొందరెన్నగా ।
సుతరముదెల్పకేపనుల ♦ జూపుచునుందురు కొందరెంతయున్ ॥

ఆం-పు. సంఘసంస్కరణదీక్ష నెగ్గించుట సాధ్యమైనపనిగాదు మాటలెన్నియైనా జెప్పవచ్చునుగాని ఒకకార్యమొనర్చి జూపుట దుర్లభము దేశదురాచారములన్నిటి నొక్కసారి సంస్కరింపబూనుట కష్టము.

హా. ఆహా ఒక్కసారి దుమ్ముదులుపవలసినదే.

ఆం-పు. సీ॥ ముసుగులు వేయించి ♦ మూలలడాగించి, ఘూర్జరీలనుఘూక ♦ కులము జేసె ।

హా. గాంధిగారి దేశస్త్రీలా.

పీనపయోధరా ♦ లైనమూయగనీక, ద్రావిడీలనుబళు ♦ వ్రజము జేసె ।

హా. అరవవారా.

వ్యభిచారమాచార ♦ మనుచుశాసించియా, మళయాళదేశంబు ♦ మంటగలపె ।

హా. ఆడమలయాళమువారా. వీరి దురాచారముల నిప్పుడు శంకరనాయరు సంస్కరించుచున్నాడు యిక భయములేదు.

వైధవ్యమనుమహా ♦ వారిధిలోముంచి, యాంధ్రికన్యలకోర్కె ♦ లార్పివేసె ।

హా. ఆంధ్రవితంతువులా. వీరి కేశఖండనమునుగూర్చి ఆలోచనలు జరుగుచునే యున్నవి. పనిగావచ్చును.

గీ॥ కటకటా కాంత లెన్నెన్ని ♦ కష్టములకు । దలయొసంగిరిదద్గతి ♦ దలపరెవరు ।

హా. దలపకేమి వీరేశలింగంపంతులు మొదలగువారు బనిజేసియేయున్నారు.

చాటువేయకుడయ్యాసం ♦ స్కారులారా । మానధనులారదేశాభి ♦ మానులార ॥

ఆం. ఈపద్యము నెవ్వరు రచించిరో బాగాయున్నది.

హా. మా ఆంధ్రజననికి తనబిడ్డలే తనకు దెలియకున్నారె.

బం. దుఃఖములో మరపు జెందియుండవచ్చును.

ఆం-పు. సీ॥ చంద్రగుప్తవిషాద ♦ సౌందర్యబ్రహ్లాద, మణిమాలనాటక ♦ మండలముల ।

స్వర్గమాతగులిసాక్ ♦ సద్రత్నహారాది, బంధురవేదాంత ♦ గ్రంథములను ।

సరవిపద్మావతి ♦ శాంతతారామతి, యువతులకథలొప్ప ♦ నవలసమితి ।

రచియించియెవ్వాడు ♦ రమ్యాంధ్రభాషకు, వన్నెబెట్టుచుకీర్తి ♦ వరలజేసె ।

గీ॥ చాంబియాబీబిమొహాయదీక్ ♦ సాహెబువర । దంపతులకుతనూజుడై ♦ పెంపుజెందె ।

తెనుగుకవిపుంగవుడుజ్ఞాన ♦ ధనుడతండు । ఉమరలీషాకవియనీదు ♦ కొమరుడుగద ॥

హా. మంచివాడే.

ఆం. పాపమాబిడ్డడు మతసహనముబూని తానొక భారతీయుడనని భావించి మహమ్మదు హైందవులకు సఖ్యముగరపుచు మెలంగుచునేయున్నాడు.

బం. అటులనా.

ఆం-పు. సందియమేమి.

హా. వారిపితరులు మంచివేదాంతులు.

ఆం-పు. గీ॥ మంత్రవేత్తలుమిక్కిలి ♦ మహిమపరులు ।

వేదవేదాంతశాస్త్రజ్ఞ ♦ విపులమతులు ।

శిష్యబోధనదక్షులు ♦ శీలపరులు ।

ఉమరలీషాపితృల ♦ నుర్వినెంచ ॥

హా. పులికడుపున మేకపిల్లలు బుట్టునా.

ఆం-పు. ఉమరలీషాసోదరు డాంధ్రభాష నలంకరించుచు హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు నిరంతరము పాటుబడుచున్నాడు మంచివక్త ఇతని సంఘసంస్కరణోద్యమములన్నియు విచిత్రబిల్హణీయము జూచిన తెలియగలవు.



మ-కు. ఉ. మన్ననబూనిగ్రుమ్మరుచు ♦ మంచిచెడుల్గమనించుచున్మదిన్ ।

బిన్నలబెద్దలన్మిగుల ♦ బీదలప్రేమనుజూచుచుజ్ఞానులెం ।

దున్నమతంబులొక్కటిగ ♦ నొప్పుగగాంచునభేదవృత్తిగా ।

నన్నలుదమ్ములౌనుజను ♦ లందరునీశ్వరుసృష్టియైనచో ॥

ఆం-పు. ఔను సమాధియైన గుంటూరు కాలామస్తాను సమత్వమును జూచియుండలేదా. యామహాత్ముడొక హైందవశిష్యునికి తనను సమాధినొనర్చుమని యాజ్ఞనొసంగియుండెను. పూర్వమీయుద్యమమే ఔరంగజేబు మొదలగు పాదుషాలు బూనియున్నయెడ భారతభూమి కిన్నియిక్కట్టులు గలుగకుండెడివి.

హా. అబ్బా ఔరంగజేబనిన నాకు భయమెత్తుచున్నది.

సీ॥ కొల్లగాపురముల ♦ గొట్టించిద్రవ్యంబు, లన్నిహరించినే ♦ యవనివిభుడు ।

పడగొట్టిదేవళ ♦ పఙ్క్తిమసీదుల, గావెలయించెనే ♦ ఘనుడునీక్ష్ణు ।

శిలలవిగ్రహముల ♦ జెరచిమాంసముదూచు, పడికట్లజేసెనే ♦ పుడమిరేడు ।

విప్రవైశ్యాదుల ♦ వెదకిజందెంబుల, దెంపగాజేసెనే ♦ ధీరనృపతి ।

గీ॥ వేదశాస్త్రంబులనుగొని ♦ వేడ్కనగ్ని । కర్పణముజేసెనెవ్వడు ♦ యోర్వలేక ।

నట్టియౌరంగజేబుదు ♦ ష్టాత్మకృత్య । ములుదలంపుకువచ్చిన ♦ కలుగడిమది ॥

ఆం-పు. ఔరంగజేబు మతవిషయమై హైందవులను యిబ్బందిబెట్టినను రాజ్యపాలనమందు గొప్పపదవు లిచ్చియుండెను.

హా. అదినిజమే.

మ-కు. హైందవు లిప్పటికిని పాదుషాలను నిందించుచుందురు మహమ్మదీయప్రభువులలో మాత్రము మంచివారలులేరా మీవారిలో దుష్టరాజులు లేకుండిరా శంభాజివర్తనమెట్టిది.

హా. శంభాజి తండ్రివంటి సమర్థుడైనయెడ భారతభూమి కీదురదృష్ట మేలబట్టును.

ఆం-పు. జెప్పుచుండగనే తొందరేల నాకు హైందవులెడ మోమాటములేదు.

చం॥ అతులితన్యాయమార్గముల ♦ నారసిరాజ్యముజేయుచున్నదా ।

చతురతధర్మపద్ధతుల ♦ చక్కగజూచుచుమంత్రవేత్తయై ।

హితవుమహమ్మదీయులను ♦ హిందువులన్గనసోదరాళిగా ।

సతతమునెవ్వడట్టిగుణ ♦ సాగరుడక్బరుకెవ్వరీడగున్ ॥

హా. హైందవమహమ్మదీయులకు సంబంధబాంధవములు సహా గూర్చియుండెను.

ఆం-పు. వాస్తవము.

బం. మహమ్మదీయ చక్రవర్తులలో నొకయక్బరుదక్క యింకెవ్వరు మంచివారులేరా

ఆం-పు. లేకేమి.

సీ॥ లలితవిద్యావిశా ♦ లమహబూబుద్దౌల, యోగ్యతాగుణముల ♦ నొప్పునెవరు ।
హితమతిప్రజలను ♦ సతతముజూచిన, బాబరుకందిన ♦ ప్రౌఢులెవరు ।
పరివారబాంధవ ♦ పరిపోషకుండైన, హుమయూనుసాటియౌ ♦ యోధులెవరు ।
పక్షపాతములేక ♦ ప్రజనేలినమహమ్మ, దుగవానుకెవ్వరు ♦ మిగులగలరు ।
గీ॥ సౌధపుంజంబులనుదివ్య ♦ సదనములను । చక్కగానిల్పెసాదుషా ♦ షహజహాను ।
మించునెవ్వడుమనముల ♦ నెంచిగనము । హమ్మదీయులుగారెయౌ ♦ యనుజవర్య ॥

మ-సు. సత్యము.

ఉ॥ ఇందుదివాకరుల్సమము ♦ లెట్టులొయట్టులెవారిగొల్చువా ।
రందరుభారతీయులెయ ♦ థార్థమువైరముబూనకెంతయున్ ।
హైందవపుత్రవర్గముమ ♦ హమ్మదువర్ణముసోదరాళిగా ।
పొందునుగల్గివర్తిలిన ♦ పూజ్యముదేశదరిద్రముండునే ॥
ఉ॥ ఖేదములేదుదేవునకు ♦ బెంపునహించుమతంబులొక్కటే ।
వాదములాడలాభముల ♦ వంబొనగూడునెమించదెబ్బలే ।
గాదువిరోధముల్గలుగు ♦ గాంచరుసౌఖ్యముసోదరాళిమ ।
ర్యాదమెలంగమంచిదిజ ♦ యంబునుబొందుదురెల్లచోటులన్ ॥

ఆం-పు. యథార్థము.

మ॥ ఒకగర్భంబునబుట్టిపట్టిసుతులె ♦ ట్లోర్వన్స్వతంత్రోదగన్ ।
నొకదేశంబునగల్గునట్టిప్రజల ♦ ట్లొప్పన్గదాసోదరా ।
సకలంబున్తనయాత్మభంగిగనుచున్ ♦ సర్వేశుబూజింపగా ।
నకవైరంబులబెట్టుకొంచుదిరుగ ♦ న్నానాటికిన్గష్టమౌ ॥

మ-సు. ఒకతల్లిగర్భమున బుట్టినవారెట్లో ఒకదేవుని సృష్టిలోని వారట్లేగదా భేద భావములేల.

హా. మాకీ మీకీ పరమపిత ఒక్కడేనా యిది బాటామంచిది.

ఆం-పు. చం॥ జనహితుడున్బుధేంద్రుడగు ♦ సయ్యదహమ్మదువల్కినట్లుభ ।
రతనియతిహైందవుల్ముసల ♦ మానులుభారతలక్ష్మికన్నులై ।
దనరుచుభాష్పపూరితయు ♦ తంబుగనొక్కటియుండనొండులో ।
చనముటుగాకపూర్ణముగ ♦ సంతసమెంతయుబొందుచుండునే ॥

మ-సు. యదార్థము హైందవ మహమ్మదీయులిర్వురు భారతమాతకు నేత్రములవంటి వారే. అందొకనయనము కష్టమునకు నీరుగార్చుచుండ వేరొకటి సంతృప్తిగా నుండునా.

బం. తెనుగుకృతులందిన మహమ్మదీయులెవరైనా యుండిరా.



ఆం-పు. లేకేమి.

ఉ॥ మానుగయిబ్రహింకుతుబు ♦ మానధనాఢ్యుడమీనుఖానుడున్ ।
పూనికనాంధ్రభాషపరి ♦ పోషణజేసినకీర్తికాములే ।
వానినుతింపగాదరమె ♦ వాశినిగాంచవెవారికబ్బముల్ ।
దేనినిపేరుగాంచరిల ♦ దివ్యతరంబుగనంతకాలమున్ ॥

హా. గుడి గోపురము మొదలగునవి ఖిలములైనను కృతులు ఖిలములుగావు.

మహా. యిబ్రహింకుతుబు యమీనుఖానులు కృతిపతులా. సంతోషము.

ఆం-పు. ఔను.

బం. ఆంధ్రాంబ నీయదృష్టమేమమ్మా మహమ్మదీయప్రభువులుకూడా నీభాష నాద రించియుండిరి.

మహా. ఆగ్రంధముల రచించిన కవులెవ్వరు గ్రంధములెవ్వి.

ఆం-పు. యిబ్రహింకుతుబ్ శాహి కంకితమిచ్చి తపతీసంవరణోపాఖ్యానమును అద్దంకి గంగాధరకవి రచియించియుండెను. యమీన్ ఖానున కంకితమిచ్చి యయాతి చరిత్రమును పొన్నగంటి తెలగనార్యుడు జెప్పియుండెను.

హా. మంచిగ్రంధములె.

ఆం. మీరేమి ముచ్చటించుకొనుచున్నను నాకు సంతాపమారుటలేదు.

చం॥ తినుటకుబొట్టనిండగను ♦ తిండియుగట్టనుగుడ్డలేయెడన్ ।
తనయులులేకమొత్తుకొన ♦ దల్చరుసోదరకష్టపుంజముల్ ।
ధనికులురాళ్లరప్పలకు ♦ ద్రవ్యముబోతురుకోటకంబులన్ ।
దనుపరుదీనకోటులకు ♦ ధర్మమెతోడనియెంచరెప్పుడున్ ॥

హా. దేవాలయములు గట్టించవలసినదె అందు ధనములుంచవలసినదె అవి దొంగలు దోచుకొనవలసినదే యీనెత్రి యిప్పుడు బుట్టినది కాదు.

బం. దేశచరిత్రలు జూచినవారికిగాని దేవాలయముల ధనమెంతవరకు మనదేశమును బాగుజేసినది తెలియగలదు. గజనీమహమ్మదు యనేకసారు లీదేశముపై దండెత్తివచ్చి దేవళంబులలోగల ధనమును దోచుకవెళ్లి సైన్యములగూర్చి మన దేశమును జయించినది తెలియగలదు. పుత్రులారా విశేషధనములగూర్చి దేవాగారంబులలో నిష్ప్రయోజనముగానుంచి గోలుపోక కాలమునకు దగిన ధర్మమునకా దేవునిపేరుతో నుపయోగించిన దేశమునకు క్షేమకరముగదా.

మ-సు. మా మసీదులలో నొకకాసైనయుండదు నిజముగా బరికించినయెడ దేవా గారంబులగల వస్తువాహనవితతులే మహమ్మదీయ రాజ్యస్థాపనకు తోడ్పడి యుండెననుటకు సందియములేదు నగరకోట దేవాలయమును దోచికొనిపోయి

యేగదా గజినీమహమ్మదు గొప్పసైన్యమునుగూర్చి హిందూదేశముపై దాడి వెడలి సోమనాథాలయమును కొల్లగొట్టినది.

హా. తమనుగట్టు త్రాళ్లు తాముదెచ్చికొన్నటులె మొన్న మంగళగిరి గాలిగోపురముపై యెంతబంగారము బెట్టిరో దెలసినదేగదా ధర్మమైనను దేశకాలపాత్రముల నెరగి జేయవలె దేవాలయము లక్కరలేదని నేను జెప్పుటకాదు. అచ్చట ధనకనకాదులనుంచక నాధనము కాలమానమునుబట్టి వినియోగించిన దేశమునకు మేలు.

ఆం-పు. మంచిమార్గమే యెవరిపిచ్చి వారికానందము.

మ-కు. దేవాలయము కట్టించినందులకు ఫలమేమి.

ఆం-పు. చం॥ వినుముసహోదరాదెలియ ♦ వీనులనిండగ గ్రామదేవతా ।
ర్చనగదదేవళంబనగ ♦ జాలదెయూరికినొక్కటున్నస ।
జ్జనములు వేడ్కపూజలను ♦ సల్పుటకేగదనిల్పువారికిన్ ।
బోనరుకుటుంబమొక్కటిని ♦ పోషణజేసినపుణ్యమెంతయున్ ।
గనుదురికేమిసత్ఫలము ♦ కాలమువెంటనుధర్మమెంచనో ॥

హా. అర్చకులకు మాన్యమిచ్చిన పుణ్యమా? వారు చాకిరిజేయుటలేదా. పూటకూళ్ల పెద్దమ్మ కెంతపుణ్యమో అంతియే.

మ-కు. దేవాలయంబులలో పెత్తనము పాపులదిగదా.

హా. మంత్రపుష్పముకూడా తాముదప్ప యితరులు చదువకూడదని సాగినచోట చదువనిచ్చుటలేదు.

మ-కు. మంత్రపుష్పమున ఈశ్వరుని ప్రార్థనయేగదా.

ఆం-పు. ఔను.

మ.కు. భగవంతుని నందరు భజియించవలసినదేగా. మామసీదులలో ఖుదాను ప్రార్థించుట కందరుసమానులే.

ఆం-పు. మీరందరు సమానముగా నమాజుచేయుట నాకు దెలసియున్నది. మాకర్మమట్టులలేదు మొదటినుండియు బ్రాహ్మణుల యాధిక్యము చలాయించుకొనుచున్నారు. ఇదియేగాదు.

చం॥ ఇతరులు పాడుబడ్డగుడు ♦ లెట్టులొబాగొనరించబూనినన్ ।
వెతలును బెట్టివేచుచును ♦ విప్రులుజంపుచునుద్యమంబులన్ ।
చతురతపెత్తనంబులను ♦ సల్పుచుద్రవ్యముఖర్చుబెట్టరే ।
గతిశిథిలంబుజెందకవి ♦ గాంచునువృద్ధిని విన్నుసోదరా ॥

మ-కు. ఎచ్చటజూచినను చాలావరకు కరణములే ధర్మకర్తలుగా నుండుటకు కారణమేమి.



ఆం-పు. దొరతనమువారు వెనుక ధర్మకర్తలపట్టి నెత్తుకొనినపుడు తమచేతిలోపని గనుక తమపేరుల నిరుకించుకొని యుండిరిగాని వానిని భాగుజేయవలసివచ్చినప్పుడు కష్టముగానున్నది యితరులుజేసినను తమ ధర్మకర్తృత్వము మాత్రము చెడకూడదు.

హా. వెనుక మాయలోపడినను యిప్పుడెవ్వరును తమపేరులేనిది ఖర్చుబెట్టరు.

మ-కు. వారికి ఖర్చుబెట్ట నవసరమేమి ఊరుమీద ఊరుబడినను కరణముమీద కాసుపడదు.

హా. అమ్మబెట్టదు యడిగికొని తిననివ్వదు.

ఆం-పు. మరియొక యన్యాయముగలదు.

చం॥ కరముగశాసనంబులెట ♦ గన్పడకుండిన కల్మషంబుకున్ ।
వెరువకదేవళంబుతమ ♦ బిడ్డలుగట్టిరటంచుబల్కుచున్ ।
ధరనధికారమంతయును ♦ తామెవహించుచుజేరనీకనె ।
వ్వరికుటిలంబుబూనుచు న ♦ వారితలీలజరింతురెంతయున్ ॥

ఆం-పు. తటాకదేవమందిరములు మొదలైన వాటిపాలనము తృప్తికరముగాలేదు గౌర్నమెంటువారు సంపూర్ణాధికారముతో ప్రజాపతినిధుల సంఘముల స్థాపించి ధర్మవిఘాతకులను దొలగించి సరియైనమార్గముల నేర్పాటుగావించిన మేలు.

హా. అటులజేసిన బాగుపడవా. అసహాయోద్యమమునకు వ్యతిరేకముగదా.

మ-కు. ధర్మాదాయములనుగూర్చి దొరతనమువారు మిక్కిలి శ్రద్ధతీసికొనినట్లు గనుపించదు.

సీ॥ యొకరిధర్మమునకిం ♦ కొక్కరుకర్తలై, నిలచుటకరణాల ♦ గొలచిగాదె ।
సేద్యంబునకుధర్మ ♦ చెర్వులుమారుట, దలచగాకరణాల ♦ దయనుగాదె ।
వనములెల్లనుగొట్టి ♦ వ్యవసాయమొనరించ, గలుగుటకరణాల ♦ బలిమిగాదె ।
చాకిరిమాన్యముల్ ♦ చక్కనిభటవృత్తు, లౌటయుకరణాల ♦ బాటగాదె ॥
గీ॥ సత్రములుమందిరంబులై ♦ సతులుసుతులు । తోడనిండుటకరణాల ♦ ద్రోవగాదె ।
న్యాయమన్యాయమగనున ♦ న్యాయన్యాయములుగబరగుటకరణాల ♦ వలనగాదె ॥

హా. వారులేనిదే కార్యముగాదు.

ఆం-పు. కరణాలలోమాత్ర మందరట్టివారని జెప్పుటకు వీలుగాదు అట్టివారు కొందరున్నను వారిప్రతాపము లిప్పుడు సాగుట దుర్లభముగానేయున్నది.

హా. ఏమో కంసాలిగుట్టు కరణముగుట్టు యెవరికి దెలియగలదు.

ఆం-పు. ఇప్పు డితరవర్ణములలోఁ గూడా తగవుల చక్రవర్తులనేకులు బయలుదేరి యున్నారు. యిప్పు డన్నివృత్తులు బోయినవి.

హ. వెనుకటివృత్తులు బోయిన కొత్తవృత్తులు లేవా.

మ-కు. సీ॥ కట్టెపుల్లలనమ్మి ♦ కాసులచేకూర్చ, విప్రులకొందరి ♦ వృత్తియయ్యె ।
తేయాకుకాఫీల ♦ తీర్థంబులమ్మట, విప్రులకొందరి ♦ వృత్తియయ్యె ।
దోసెలిడ్డెనలను ♦ జేసియంగడిబెట్ట, విప్రులకొందరి ♦ వృత్తియయ్యె ।
సాక్ష్యసంబంధముల్ ♦ సమకూర్చతగవుల, విప్రులకొందరి ♦ వృత్తియయ్యె ।
గీ॥ పూటకూళ్లనుబెట్టియే ♦ పొద్దులందు । బిడ్డలనుబెంచవిప్రుల ♦ వృత్తియయ్యె ।
సతతమాంగ్లేయభాషనే ♦ చదివిచదివి । విత్తమార్జింపవిప్రుల ♦ వృత్తియయ్యె ॥

హ. పాపము కాలమిటులొచ్చినది. కులవృత్తులు నశించినవి.

మ-కు. అసలు బ్రాహ్మణకుల ధర్మములెవ్వి.

ఆం-పు. యజనయాజనాధ్యయనాధ్యాపక దానదానప్రతిగ్రహషట్కర్మలు.

హ. నష్టములేదు షట్కర్మలు వదలినవారికి పైషట్కర్మలున్నవిగదా.

మ-కు. శాపన లేమిజేసినను జెల్లగలదు.

ఆం-పు. ఏమో కరణముల నటుండనిమ్ము. కోమటులో.

మ-కు- వారుసరే.

ఉ॥ బెట్టుచునప్పులన్నిగుల ♦ బెంచుచువడ్డినివడ్డిజేర్చితా ।
కట్టునుప్రాసికొంచుచిర ♦ కాలముభూములకొంపగోడులన్ ।
నష్టబుణంబుసర్వమున ♦ కందగజూచుచునివ్వమంచువే ।
గట్టిగనిల్లువాకిలిని ♦ గైకొనిభిక్షులజేయుగోమటుల్ ॥

హ. నిజమేగాని వారు ధర్మవిఘాతము నొనరించరు. దాతృత్వమునకు వారేపుట్టునిల్లు

మ-కు. దాతృత్వమనిన జ్ఞాపకమువచ్చినది గడచిన కాటకమున నన్నదానమొనర్చి ప్రఖ్యాతినొందిన బుడ్డావెంగలరెడ్డి బచ్చురామేశాది దాతలబోలినవారిప్పు డున్నట్టుగనుపించదు.

హ. నిత్యము జచ్చువారికేడ్చువా రెవరన్నట్లు దాతృత్వముజూపుట కొకనాటికరువా

మ-కు. ఇది తీరని కాటకముగానేయున్నది.

బం. ఇప్పుడు దాతలేలేరా.

మ-కు. ఉ॥ ఆకలనెల్లదీర్చుచును ♦ యాచకపాళికి సంతతంబువై ।
వైశ్యులటంచుకీర్తినివ ♦ హించివసుంధరగోర్నమెంటుచే ।
వాశిగరావుసాహెబుది ♦ వానుబహద్దరుబిర్దులంది స ।
ద్యాలయముల్ధరన్ గనిబు ♦ ధాళులదీవనలంది రెవ్వరో ॥



చం॥ కనికరమూనిసంతతము ♦ గాంచుచుబీదజనంబులందరిన్ ।
అనయమువైష్ణవాళిదగ ♦ నాదరభావములొప్పజూచుచున్ ।
దినమునసేకరౌప్యముల ♦ దీనులకిచ్చుచుధర్మమూర్తులై ।
ఘనతరకీర్తిగన్ననల ♦ కల్వలసోదరులెవ్వరెంచగన్ ॥

ఆం-పు. ఓహో కణ్ణన్ రామానుజశ్రేష్ఠులా వారుజేయని ధర్మములేమున్నవి.

హ. వారు దానకర్ణులే.

మహ. వారేమేమి ధర్మములొనరించియుండిరో.

మ-కు. సీ॥ బాలికలకుపాఠ ♦ శాలనుబెట్టించె, నేరుపుమీరనె ♦ గ్మూరిలోన ।
పసిబిడ్డలనుసాక ♦ పాలనొసంగెడి, శాలలనిల్పెధీ ♦ శాలులెన్న ।
వేతనంబులనిచ్చి ♦ విద్యార్థిలోకము, చదువగాజేసెను ♦ జ్ఞానమెసగ ।
వ్యాధులబాపను ♦ వైద్యాలయంబుల, స్థాపించెనారోగ్య ♦ సరణిగాంచ ।
గీ॥ గోషచెడకుండనాస్పత్రి ♦ కుదురుపరచ । సాయమొనరించె బీదలు ♦ హాయినొంద ।
నింకనెన్నియొకార్యము ♦ లిలనొనర్చె । నమ్మకలువలసోదరు ♦ లరసిజూడ ॥

హ. జెప్పుచునే కొన్నివిడుచుట చోద్యము. రామానుజశ్రేష్ఠి పరీక్షపదవినంది నిర్వహించియుండలేదా.

మహ. ఇట్టి వదాన్యపుంగవుల గనియేనా ఆంధ్రాంబ విచారమందుట.

ఆం-పు. కలువల సోదరులేగాక నింక గుప్త దానపరులెందరో గలరు.

మ-కు. గుప్త దానపరులన జ్ఞాపకమువచ్చినది.

సీ॥ రాళ్లరప్పలకును ♦ రౌప్యముల్బోయక, చదువులకెవ్వడు ♦ సాయపడునొ
అన్నవస్త్రంబుల ♦ కల్లాడువారిని, దయగనియెవ్వడు ♦ దనుపుచుండు ।
నితరులకెవ్వరి ♦ కెరుకలేకుండగ, దానమెవ్వడుసత ♦ తమునొనర్చు ।
కాలమువెంటను ♦ కలియొగంజియొక్షుధా, తురులకెవ్వడుప్రీతి ♦ నిరతమిడునొ ।
గీ॥ మించినట్టిఘనత్రయ ♦ మెంచకొత్త । ధర్మమేతోడునీడని ♦ దలచునెవ్వ ।
డట్టిపోరళ్లసంశర ♦ త్నాకరశశి । భా. నారాయణుండాంధ్ర ♦ పట్టిగాద ॥

ఆం-పు. ఓహోహో ఔను.

మ-కు. ఆసోదరుడు పేరు ప్రఖ్యాతికై ధర్మమొనర్చునట్టివాడుగా డందుచే యింత వరకు బయల్పడకుండెను.

హ. నేనెరుగుదు.

మహ. అంత గుప్త దానపరుడా.

హ. గుప్తమో గుప్తమో నాకు తెలియదు అడుగగనే గబుక్కున చేయుచుండును.

మ-కు. ఎవ్వ రేసహాయముగోరినను "ధర్మస్యత్వరితాగతిః" యను వాక్యానుసరణి

ములుకూడా భగవదనుగ్రహమువలన సంతరించిన దేశమునకు శాంతిగలుగుటే
గాక మనయిష్టము విచారముదీరును.

ఆం. అయ్యో అంతటియదృష్టమా.

మ-కు. మొహరంలో పీర్లనునిలిపి వేడుకసల్పుట యీప్రాంతములనేగాని తుర్కి-
కాబూలు మొదలగు మహమ్మదీయదేశములందు లేదట మొహరంలో మహాత్ము
లైన హసేన్ హుసేనుల చరిత్రల దలచికొనుచు పండుగ జేసికొనవలశినదిగా
పెద్దలు జెప్పుచున్నారు.

హా. పీర్లను నిలువబెట్టి పూజించుట మౌల్వీలకు యిష్టమే లేదు. ఈదేశమున నిది
యెప్పటినుండి యేర్పడినదోగాని హిందూముస్లీములకు గుద్దులాటలు గూర్చు
చున్నది.

ఆం-పు. సీ|| భాయిజీహైందవ ♦ పండుగదసరాకు, సరితూగివేడ్కలు ♦ సల్పుటకును।
త్తైమూరుఫాదుషా ♦ దగ మొహరంబున, పదిదినంబులుపీర్ల ♦ పండుగనిల ।
నాడంబరంబుగా ♦ నాచరింపగజేసె, నప్పటినుండియు ♦ నిప్పటికిని ।
జేయుచున్నట్లు ♦ జెప్పచరిత్రలు, వింటిబోరాటము ♦ ల్వేలసెదాన ।
గీ|| నఖిలభారతసుతులమ ♦ హమ్మదీయు । లకునుశాంతముబాపుచు ♦ వికలమతుల ।
జేయుచునుమైత్రినుండుట ♦ జెరచుచుండె । తగవులకుసామ్మబోసెడి ♦ దారిజూపె||

హా. సందేహమా.

మ-కు. మనలో మనకు వైషమ్యమేగాని న్యాయబుద్ధితో బరికించనేమియులేదు
పీర్లయెదుటకు హిందువులు రావచ్చును తెనుగు మాట్లాడవచ్చు నా భాషయే
జంత్రమూలమున వినకూడదట అసలు వినుటకు పీర్లకు చెవులున్నవా యటులే
రాతివిగ్రహము లెదుట హిందూస్తాని మాట్లాడవచ్చును వాద్యము బనికిరాదట
యిది హాస్యాస్పదముగాని వేరొకటిగాదు.

హా. వాస్తవముగా నవ్వులాటలే మహమ్మదీయులు మహిమయున్నదని నమ్మి పీర్లను
బట్టికొని నిప్పులద్రొక్కుటయు హిందువులు మేకలనుగోసి తలపుర్రెల రాతి
బొమ్మలెదుట నిలిపి పలుకుమని నరముచు యవి ముక్కలగుండా ప్రాణముల
విడచునప్పుడు ముక్కలెగురవేయ దేవర పలికెనని నమ్ముటయు అజ్ఞానము
గాక మరియేమిటి.

ఆం. ముస్లీములు పీర్లకు ఫొతాలు ధూపములు మొదలైనవి యొసంగుటేగాని జీవ
హింస జేయుటలేదు.

హా. కొందరు హైందవులు దేవరలయెదుట మహిషమేషాదుల బలులిచ్చునట్టి ఘోర
కృత్యములు తురుష్కులందుగానము.



మహా. నిష్కారణముగా నేపాపమెరుంగని మేకపోతులను బలియొసంగుటలో
కూడా మాతల ముందుతెగవలె మాది తెగవలెనని గుద్దులాడుచుందురు జీవ
హింసలు జేయుటలోకూడా మర్యాదలు గావలసివచ్చెను.

హా. ముందు తమగతు లెట్లున్నవోలే.

ఆం-పు. ఉ|| ఖేదమునొంద కెంతయును ♦ కిల్బిషమంచుభయంబులేకమ ।
ర్యాదకుభంగమౌననిర ♦ యంబునబాపనకోమటుల్మహా ।
మోదముతోడ దేవరల ♦ మ్రొక్కులటంచును మేకపోతులన్ ।
ఛేదనకిత్తురార్యజన ♦ శీలమహింసయటంచునెంచకన్ ||

మ-కు.(నవ్వి) గీ|| తాళమేళంబులను జేసి ♦ తందనాల । గొట్టుచును మేకపోతుల ♦ గోసితలల
మట్టిబొమ్మలకెదుటను ♦ బట్టినిల్పి బల్కుమనికూయుచుందురు ♦ పాపమనక ।
నింతకన్నను దుర్మార్గ ♦ మేమికలదు ||

తెలియని మూఢులొనరించుటసరే మాంసాశనులుగాని కరణాలు మా పేట
ముందు తెగవలెనని గోయించవలెనా.

హా. ఏమో వేటల కొననక్కరలేదుగదా యదలించి బెదరించి గొల్లవారివద్ద నూరక
తెప్పించుకొనుటేగద. "ప్రారబ్ధంభోగతోనశ్యేత్" ప్రారబ్ధమనుభవించక
తీరదు.

ఆం-పు. ఉ|| వేసములెన్నొ వేయుచును ♦ వేడ్కలుసల్పుటెగానిసాహెబుల్ ।
దోసముగూర్చునట్టిపెడ ♦ త్రోవలద్రొక్కరు మేకపోతులన్ ।
గోసిముదంబుతోతలల ♦ క్రూరతపీర్లకుముందుబెట్టియు ।
ల్లాసముతోడబల్కగని ♦ లంబలుకేకలు వేయరెంతయున్ ||

మహా. వాస్తవము పీర్లయెదుట జీవహింసజేయక వేడుకసల్పుట మహమ్మదీయులది
మంచిమార్గమే.

ఆం. అమ్మలారా నాసంతతుల కష్టములు చెప్పబూనిన తీరునవిగావు సూర్యుడస్త
మించబోవుచున్నాడు పెందలకడ తోచినవరకు గుడచి రేయిగడపి రేపటి
దినము ముచ్చటించుకొనవచ్చును. ముందు పాంచాలసోదరీ కష్టములతెలసి
కొనవలసియున్నది.

మహా. మంచిది. (నిష్క్రమింతురు.)

సంధ్యారాగము.

గీ|| ఆర్యశుభసూచకంబుగా ♦ నాకసమున । చూతపల్లవతోరణ ♦ భాతిమించి ।
విలసితారుణమేఘపం ♦ క్తులు జెలంగ । సంధ్యసమయంబుజూపట్టె ♦ చక్కగాను ||

సూర్యాస్తమయము.

గీ॥ కరముపాశ్చాత్యజనులసౌ♦ఖ్యములగతుల । భారతీయులదారిద్ర్య♦బాధలగని ।
దెలుపవరుణునికంతయు♦తీవ్రగతిని । జనియెకొంతులవిరమించి♦జలజహితుడు ॥

గీ॥ భారతావనిదాస్యంబు ♦ బాపబూని । దేశభక్తులుజర్చించు ♦ తెరవుగాంచి ।
తమమువారించనాకాశ ♦ తరుణిబెట్టి । నట్టిదివ్వెలనంగతా ♦ రాళులమరె ॥

చంద్రోదయము.

గీ॥ దేశకష్టంబులనుబాప ♦ తిరిగివచ్చి । నట్టిగాంధిమహాత్ముని ♦ కట్టెగగన ।
పడతిబట్టినయారతి ♦ పళ్లెరమన । చలువలిచ్చుచుదోచెను ♦ చందమామ ॥

గీ॥ కరముకోవెలసుస్వర ♦ గానములుచె । లంగశుకపిక మృదులవి ♦ హంగతతుల ।
కిలకిలారావములువాత ♦ గీతములకు । తెలివిగనె జనుల్దిక్కులు♦తెల్లనయ్యె ॥

సూర్యోదయము.

గీ॥ విమలభారతదేశంబు ♦ వెలయగుణము ♦ వర్ణములశౌర్యవహ్నిలో ♦ వైచిగాచి ।
బరగజేసినవలయద ♦ ర్పణమనంగ । తూర్పుదెససూర్యుడుదయించి♦త్రోవబట్టె ॥

ఇయ్యది వైశ్యకులపారావారసుధాకర శత్రువర్గభీకర గ్రంధిపంశ కౌండిన్యసగోత్ర
పవిత్ర తాతయార్యదుహిత్ర బసవయ సుబ్బమాంబాప్రియపుత్ర సజ్జనమిత్ర
బంధుజనాప్త వెంకటసుబ్బరాయగుప్త విరచితాంధ్రమాత
నాటకంబున తృతీయాఙ్కము.

---

# ఆంధ్రమాత - చతుర్థాఙ్కము.

(ప్రవేశము - పాంచాల కుమారుడు.)

పాం॥ చం॥ ఘనతరదేశమొక్కటికి ♦ గల్గినకష్టముభారతీయులే ।
గనుగొనిమిన్నకుండుటకు ♦ కారణమేమనవచ్చు భూమిలో
మనవలెమంచిచెడ్డలతో ♦ మానవులందరుమేటివృత్తిచే ।
జనవలెదేశసేవలను ♦ సల్పుచునుత్తమలోకపాళికిన్ ॥

(ప్రవేశము - ఆంధ్ర బంగాళ మహారాష్ట్రమాతలు మహమ్మదీయాంధ్ర హాస్యకుమారులు.)

పాం. మాతలారా నమస్కృతులు.

అందరు. సుఖావాప్తిరస్తు దీర్ఘాయుర్భవతి.



పాం. మహమ్మదీయాంధ్ర సోదరులారా వందనములు.

సోదరులు. దీర్ఘాయుర్భవతి. దేశారాధన సిద్ధిరస్తు.

పాం. ఉ॥ బలముఁజూపుచు శత్రువర్గములదం ♦ భంబుల్మదిన్మెచ్చకన్ ।
గెలుపుఁగాంచుచుయోధులైక్రమముగా ♦ కీర్తిఁభువిన్నించనా ।
త్మలసంతోషముబొందిహైందవులస ♦ త్కారంబుకైబూనిమా ।
ర్గలులారౌలటుశాసనంబులనుదీ ♦ క్షన్మంత్రులిచ్చెన్గదా .

హా. మేలుజేసినవారికి మేలుచేయమని శాస్త్రములు జెప్పియున్నవా యేమి? భయమునకు దగినంత గోడపెట్టుకొనవలె.

మహా. ఆహా భారతీయులు గౌర్నమెంటువారికి జేసినయుపకారమునకిది ప్రత్యుపకారమా యొకవైపునుండి ప్రజలకు నిర్బంధముల నేర్పరచుచు వేరొకప్రక్కనుండి సదుపాయముల నొనరించునట్టి యాశలజూపుట భారతవర్షమున పాలకులకు చాలాకాలమునుండి వెంటనంటివచ్చుచున్న యాచారమైయున్నది.

పాం. నిరంకుశాధికారులగు విదేశీయులచేతులలో భారతీయులు మిగులకష్టపడుచుండుట విదితమేగద అందు పాంచాలులధికముగా బడుచుండిరి.

ఆం. నాయనా నాసంతతుల కష్టములకే విచారముపడుచుంటి నంతకంటె మీయమ్మ విచారమెక్కువగా నున్నట్లున్నదే.

పాం. గీ॥ పాలనావిధులనుతప్పు♦బట్టిరేని । వారిగృహములశోధించి♦బంపుదురపు ।
డే ప్రవాసమునకునర♦లేకరాజ । ద్రోహమననర్థమిదియేను♦యూహగనుడు ॥

హా. ఆహా వారిపక్షమునుండువారికి గొప్పగౌరవపదవులు ప్రజాపక్షములో నున్నవారికి కారాగృహవాస కాలక్షేపములే.

ఆం-పు. లాజపతిరాయి అజంతసింగు మొదలగువారు ప్రవాసమనుభవించి వచ్చుటకేమి నేరములొనరించిరి.

పాం. సీ॥ పాలకులుగనుండి ♦ ప్రజ్ఞచూపెడివారు, తమనిరోధంబుచే♦తనెయనర్థ ।
కములుగల్గినవని ♦ గమనింపకనునిజ, మైనకారణముల ♦ నరసిరాజ ।
ప్రతినిధికట్లుల ♦ భారతమంత్రికి, నొప్పుగాదెలుపక ♦ గప్పిపుచ్చి ।
తమలోపములనుని ♦ తరులపైబెట్టుచు, నాందోళకులతల ♦ కట్టెజుట్టి ।
గీ॥ టయనుచారముదానిచే ♦ భయముగల్గు । బాధలెన్నియొబొందగా ♦ బడుసుదాన
నిట్టిగతులేలగల్గెనో ♦ యీశ్వరాజ్ఞ । యెటులగానున్నదోయేరి ♦ కెరుకతల్లి ॥

మ-కు. కార్యనిర్వాహకవర్గమువారిగో.

పాం. వారుసరే మంచిచెడ్డలు గ్రహించక పిచ్చియాబోతులవలె మార్గమున గనుపడిన వారినెల్లబడద్రొక్కుచు వ్యతిరేకముగానుండిన వారినిసాధించి శిక్షలపాలు జేయుచుందురు.

హా. భారతీయులకు ఐకమత్యమేర్పడువరకు బాధించి బుద్ధిజెప్పవలసినదే ఇదియొక మంచిమార్గమే.

బం. నాబిడ్డలు పాలనావిధానములలో జోక్యముగలిగించుకొని యెన్నెన్నియో కష్టములబడియుండిరి.

ఆం-పు. మావారందుకనే శాంతమువహించి యున్నారు.

హా. ఆడపాడచేతగాక మద్దెలమీదబడి కొట్టుకొనినట్లున్నది. శక్తిలేకయే యూరకొనినామనిజెప్పిన మన పరువుప్రతిష్ఠలకు భంగమా.

ఆం. అయ్యా నాయనా దానములలో నిదానము శ్రేష్ఠము.

హా. ఈశుష్క వేదాంతములవల్లనే మనదేశ మీవిధమైనది.

ఆం-పు. గీ॥ జ్ఞానముధరించియుండిన ♦ మానవులను సిరికివారని పెద్దగా ♦ బిలువవోడగె।
ధీరమునపాలకులతోడ ♦ బోరువారి । వట్టివ్యర్థు లటంచును ♦ వాడబడిరి ।

హా. ఔను కుండమూయ మూతున్నదిగాని నోరుమూయనున్న దాయని నోటికిష్టము వచ్చినట్లు జెప్పుచుందురు.

ఆం-పు. పాంచాలసోదరా. మీరాజప్రతినిధి యెవరు.

పాం. సర్ మేకేల్ ఒడయరు.

మ-కు. వారియుద్యోగనిర్వహణపద్ధతు లెట్లుండెను.

హా. ఎటులుండవలెనో యటులున్నవి ఒకరికంటె నొకరెక్కువగా ఉన్నతోద్యోగీయలందరు పంజాబునందే పోగైనారు.

పాం. ఉ॥ అక్కజమందదేశముల ♦ కన్నిటికంటె సిఫాయివర్గముల్ ।
నెక్కువబంపగాదలపు ♦ నెంచుటతోడ నెప్రోత్సహించకల్ ।
పెక్కుకుతంత్రకష్టముల ♦ బెట్టిభయంబుగ జేర్పబూనెపెం ।
పెక్కగ క్రిందివారలటు ♦ లెంచుచు జేసిరి మెప్పుబొందగన్ ॥

హా. "యథారాజా తథాప్రజాః" రాజప్రతినిధియెట్టులో వారినౌకరులట్లె జెప్పవలసినదేమి.

ఆం. పాంచాలసోదరీ సంతతులెన్ని కష్టములనుభవింపవలసివచ్చె.

పాం. యుద్ధమారంభమైనదాదిగ మారాజప్రతినిధి సామదానభేద దండోపాయంబుల నితరులకంటె సైనికుల నెక్కువగాబంపుచుండగనే మరియు నధికముగా జేర్పించవలసినదిగా ప్రధానమంత్రి సందేశమంప దానితో మెకైలుగారి ప్రయత్నములు విజృంభించగడంగెను.

హా. అగ్నిలో ఆజ్యముబోసినట్లు యదివరకే తాను నిర్వహించుచున్న పనికి ప్రధానమంత్రి యొక్క వార్తతోడ్పడియుండ విజృంభించకయేమి.



పాం. మ॥ మగవారెందరు గ్రామమందుగలరా ♦ మార్గంబునుంగాంచి వీ।
లుగజేర్పించగ నిర్ణయించిదగనా ♦ లోచించియాగడ్వకం।
తగనర్పించకనున్న సైనికుల బా ♦ ధల్బెట్టిదర్పంబునన్ ।
పగచేశిక్షలసాంఘజేయదొడగెన్ ♦ బల్మారు వేధించుచున్ ॥

మ-కు. అధికారులా.

పాం. ఔను. నిరపరాధులను సహా క్రిమినల్ లా పాలు గావించి విచారించి శిక్షించుచుండిరి.

హా. నిరపరాధముగాకుంటె నపరాధము మోపెట్టినను మనమేమి చేయగలము దొరదలంచిన దెబ్బలకుకొదువా గంగాధరతిలక్ మహాశయునిబట్టి కారాగృహమునందు బడవేసియుండలేదా.

మహా. (దుఃఖించుచు) ఆబిడ్డడు పడినకష్టములు జ్ఞప్తికివచ్చినయెడ హృదయము నీరౌచుండును.

మ-కు. తల్లీ ఆయనకేమి విశ్రాంతిదొరకినది కారాగృహమందు గీతారహస్యమును వ్రాసి లోకోపకారమొనరించిరి నిద్రాహారములం దామహాత్ముని యంతరాత్మ దేశాభివృద్ధికై పాడుబడుచుండును ఒకక్షణమైనను విశ్రాంతితీసికొనుచున్నట్లు గనుపించదు.

పాం. ఉ॥ సేనలోజేరపంచిదటు ♦ సేయకనుండిన తెల్విమీరగన్ ।
పూనిధనాశచేనితర ♦ పుష్టుల నైనను జేర్పగావలెన్ ।
హీనిలో నెద్దియో యొకటి ♦ వేగనొనర్చకనున్న శిక్షలే ।
గానితలంచతప్పగను ♦ గౌరవమంతయుశృంగభంగమే ॥

ఉ॥ కుచ్చితులైనతస్కరులు ♦ కొంటెజనంబులుగానిగొప్పనున్ ।
దెచ్చియొసంగ సైనికుల ♦ దృష్టిని జెందుచు పెద్దనౌకరుల్ ।
మెచ్చియొనర్చిగౌరవము ♦ మిక్కిలివారలనుబ్బ జేయుచున్ ।
నిచ్చకుపాత్రులై మెలగి ♦ రేమని జెప్పుదుతల్లిసత్యమా ॥

ఆం-పు. అధికార్లను రిక్రూటర్లనుబట్టియిచ్చి కొందరెన్నెన్నియో కార్యములగట్టెక్కించుకొనిరి.

హా. ఎవ్వరు బట్టియివ్వనక్కరలేదు మహాక్షామదేవతయే బట్టియిచ్చినది.

పాం. అదియొక కష్టముగాదు దాని నటుండనిమ్ము.

కం॥ కలహాబ్ధిణంబీయకసే। నలోజేర్పకనున్నవారి ♦ నయమునగనకన్ ।
బలముగయిన్ కంటాక్సనె । గలిపించుచుధనములాగి ♦ గీటడగించెన్ ॥

హా. వర్తకపన్ను లధికముగా వేసినందుకు విచారపడవలదు. ధరలు పెరుగుటచే నంత కంతకు లాభములు వచ్చియుండవచ్చును.

ఆం-పు. పన్నులను దెలుపబనిలేదు యుద్ధమునకు బూర్వమే పన్నులధికముగా వసూలు జేసిన వేతనస్థులను మెచ్చి గొప్పపదవులొసంగి యుత్సాహము గలిగించుచు నేయున్నారు.

పాం. సేనలో జేరనున్న వారి నిరుత్సాహబరచినట్లు పట్టుకొనదలచిన ప్రజలనడ్డు బెట్టరని యొక గ్రామమువారిని పోలీసుభటులు బాధించియుండిరి.

మ-కు. చం॥ వెరచినవారి నేమిగుల ♦ వేధలబెట్టుచునుందు రెంతయున్ ।
వెరువనివారి నేమనక ♦ వెన్కకుజారుచునుందురమ్మ బో ।
యరులటుదక్షుణాఫ్రికన ♦ నాదరణంబుగ భారతీయులన్ ।
నిరతము వేచుచుండగని ♦ నీతినిదెల్పి రెయాంగ్లపుంగవుల్ ।

ఆం-పు. మొట్టేవారికి వెరతురా మొక్కినవారికి వెరతురా

హా. మొట్టేవారికే వెరతురు. దేవరలయినా దయ్యములైనా భయపడేవారినే యేడిపించుచుండునుగాని భయపడనివారిని కదలించలేవు.

పాం. పార్లమెంటువారు కొన్ని సంస్కరణములు జేయుచున్నామని దెలపిన బిమ్మట గౌర్నరుగారికి ప్రజలను నోరెత్తకుండా జేయుటకు వీలుకలుగకపోయెను దానిమీద జనులకాగ్రహము గలుగునట్లుపన్యసించ నారంభించిరి ప్రజలకంతట కోపము వృద్ధిగాజొచ్చెను.

ఆం-పు. పిమ్మట యేమయినది.

పాం. రౌలటుబిల్లును సంకల్పించిరి దానికంతట గలిగినట్లె పాంచాలమునందును ఆందోళనముకలిగెను.

ఉ॥ నిగ్రహన్యూత్తిహైందవులు ♦ నిందితరౌలటుబిల్లుపైనస ।
త్యాగ్రహసద్వ్రతంబుమన ♦ సారనొనర్చగబూనినట్లె మా ।
యగ్రజులందరేకముగ ♦ నయ్యది సల్పిరి వేడ్కమీరసా ।
నుగ్రహముక్ దలంచకఘ ♦ నుండయిపొంగె మెకైలుగారొగిన్ ॥

ఆం. రౌలటు చట్టమునుగూర్చి మనవారే మొనరించిరి.

పాం. అందరొకపెట్టున రౌలటుబిల్లు కళంకదాయకమని విన్నవించుకొనినను గౌర్నమెంటువారు ప్రజాభిప్రాయముల నొకమూలబెట్టి దానినంగీకరించిరి.

హా. పిల్లికిచెల్లాటమైతె ఎలుకకు ప్రాణసంకటమనినట్లు ఆబిల్లు వారికి సంతోషజనకమే.

మ-కు. ఇచ్చట యధికార కృత్రిమవర్తనలు ఇంగ్లండునకు దెలపినయెడ ఇట్టి యన్యాయములు జరుగనేరవు అధికారులు తమ నిరంకుశాధికారమునకు భంగము లేకుండా జేసికొనుచుందురు ప్రజలకెట్టి యిబ్బందులు గల్గినను సరే.



హా. ఇంగ్లండునకు దెలసినంతనే మనకు పండూడిచేతులోబడునా పంజాబుసంఘువిచారణమందు యదార్థమంతయు బయల్పడి డయరుసేనాని నేరస్థుడని తేలలేదా ఇంతమాత్రము భయముజూపకుండిన భారతీయు లణగియుండరని నేరస్థుని సమర్థించుటయేగాక నతనిచర్యను కొనియాడి యుండలేదా ఎవరిసుఖములు వారివి న్యాయాన్యాయములు పిమ్మట మనసోదర ధనికులు మనకష్టముల నేమైనా దీర్చుచున్నారా.

మహా. ఏమిడయరు నిర్దోషిగా భావించిరా. యింగ్లాండులో న్యాయమువలికిన వారులేరా.

ఆం-పు. ఉన్నారు డయరు హత్యలు రాక్షసకృత్యములని అస్క్విత్తుగారును ఓడ్వయరు డయరుగార్లు శిక్షాపాత్రులని బెక్ స్పూరుక్లయి నెసుగారు మొదలగువారు దెలపిరి.

హా. ప్రయోజనమేమి. ఎక్కువమంది డయరుగారిని సమర్థించిరి.

ఆం. స్వపరిపాలన విషయమై యెప్పుడైనా అనుకూలముగా జెప్పుచున్నారా

మ-కు. భరతఖండమునకు సంపూర్ణ స్వపరిపాలనము క్రమముగనొసంగి సమభాగిని జేయుటయైయున్నదని మనమాంటేగు మంత్రిగారును వెజివుడు మొదలగువారు దెలపియున్నారు.

హా. పరమార్థమును దెలసినవారు న్యాయమును జూచుచుందురు గాని తమసౌఖ్యమే స్వర్గమను వారికెక్కడిది.

ఆం-పు. అధికారుల విషయమై యేమియు మాట్లాడగూడదట.

హా. అబ్బో మనకొంపలేమి మునుంగునో

మ-కు. వాస్తవమే దేశీయమహాసభ అవసర దేశీయ మహాసభాధ్యక్షులగు పండిత మాతీలాలు నెహూర్ దేశబంధు లజపతిరాయి గార్లవల్ల బయల్పడిన సంగతులే గనుక మాట్లాడుటకు సావకాశము గలదు.

ఆం-పు. చం॥ నిరతమువ్యాసపుంజములు ♦ నేర్పునవ్రాయగనుద్యమించుచ ।
త్కరములగట్టిపై చెనధి ♦ కారులపత్రలలంచపంచముల్ ।
దొరలకుజెప్పు టెంతయును ♦ దుష్టతనంబనినోరుమూసెనే ।
తెరవులపత్రికాచయము ♦ దెల్పకనుండగ జేసెచట్టముల్ ॥

హా. అరవకుండా నోళ్లకు చిక్కములు బాగా నేకట్టినారు. కట్టవలసినదే ఒట్టి అరపులతో నేమిప్రయోజనము. వ్రాతలతో బనియేమి.

మ-కు. ఇవి అన్నిదేశములకుగల కష్టములే.

పాం. ఉ॥ బాధితసైన్యపద్ధతుల ♦ వల్లను మేటికుటుంబజీవనో ।
పాధిగడించువారుజని ♦ బల్మరుగుందుచు కొటుకంబుచే ।

వ్యాధులబొందిమేలయిన ♦ వైద్యులు లేకనుయుస్సురంచునే ।
సాధనలేకబొత్తిగను ♦ సారముజచ్చిక్కృసించరేప్రజల్ ॥

ఆం. ఏమెనరించవలె మాచెల్లి సంతతులిట్లు కష్టములనుభవించవలసివచ్చె నావలె సోదరి యెంత దుఃఖమునందుచున్నదో.

హా. ఆమెయు నామెబిడ్డలును నీయంత పిరికివారలుగాదులే.

మహా. మన మొకప్పుడు సుఖములనుభవించుచుంటిమా మనసుఖములు వెనుకనే బోయినవి.

హా. ఎప్పుడు సుఖములేనా ఒకప్పుడు దుఃఖములనుభవించవలసినదే నరులకు నాలుగు యంశలు.

పాం. గీ॥ అతులరాజకీయస్వ ♦ హరములను । సౌఖ్యముండినవారన్న ♦ శోభమీరు ।
చదువరులటన్న గన్నరిర ♦ సనముగాను । లెస్టిసెంటు గొర్నరుదయ ♦ లేకమదిని ॥

గీ॥ దివ్యదృష్టినిబరికించి ♦ దృష్టిమీర । గాంధిమహనీయుడెంతయు ♦ గాంచిజనుల ।
కపుడు సత్యాగ్రహవ్రత ♦ మాచరింప । గనుపదేశమొనర్చెను ♦ ఘనతమించ ॥

ఈమహావ్రతోపదేశంబున భారతరాజ్యమున యత్యద్భుతశక్తి జనించినది సత్యము అహింస నిర్భయము ఇవియే యీ మహావాక్యార్థమునందలి ప్రధానాంశములు

హా. అహింసపోయి హింసలలోకే దిగినదిగదా.

ఆం-పు. ఉ॥ ఎంతటిశాసనంబయిన ♦ నెంతటిమేలగుతీర్పులైనదీ ।
మంతులునిర్ణయించు సుగ ♦ మంబగునర్మములెంచనున్నభా ।
వింతురయోగ్యమంబుగను ♦ వృద్ధినిగాంచుటదుర్లభంబుసు ।
స్వాంతముతోడసత్యమును ♦ బల్కియంబునుపీడగావలెన్ ॥

హా. అయోగ్యమో యోగ్యమో యెవరిసౌఖ్యమువారిది. మనభాగ్యవంతులు ప్రజల సుఖములను జూచుచున్నారా.

చం॥ భయమునుమానమేనిమరి ♦ బానిసతుల్యులమాటసత్యమెం ।
తయుకఠినంపుశాసనవి ♦ ధాయకమల్లరిబొందుచుంటిమే ।
జయమునుతీవ్రపద్ధతులు ♦ సల్పుచుగాంచముబల్మిచేతనే ।
రయమునబొందలేముసిరి ♦ రాజిలుమేటిస్వతంత్ర్యమెంచగన్ ॥

మ-కు. గాంధిగారి యుపదేశవాక్యము లివియేగా.

ఆం-పు. ఔను.

మ-కు. అల్లరులకు సత్యాగ్రహవ్రతమే కారణమని జెప్పుచున్నారే.

పాం. సత్యాగ్రహవ్రతే మల్లరులకెప్పుడు కారణముగాదుగాని యధికారుల కాగ్రహము గలిగించుటకు కారణమైనది వారు ప్రజాభిప్రాయముల నిరసించి



రందుచే ప్రజానాయకులిద్దరు ద్వీపాంతరమున కంపబడి గాంధిమహాత్ముని బట్టుకొనినపిమ్మట ప్రజలాగ్రహావేశులైనది నిజము.

హా. వెనుక వందేమాతరంవలె నిప్పుడీసత్యాగ్రహవ్రత మధికారులకావేశము గలిగించుచున్నది కాబోలు.

ఆం-పు. అమృతసరమునందు జరిగిన గడబిడలకు కారణమేమి.

పాం. అచ్చట శ్రీరామనవమి యుత్సవములు సత్యాగ్రహవ్రతను జనులందరు శాంతముతో నిర్వహించిరింతలో తమనాయకులగు సత్యపాలు కిచ్లూగార్లకు ప్రవాసశిక్షవిధించుట దెలిసియే కాబోలు పాదరక్షలు తలపాగలను తీసివైచి విచారము దెలుపుచు నాయకులను వదలవలసినదని డిప్యూటికమిషనగారిని ప్రార్థించుటకై వారిగృహమున కరిగియుండిరి.

ఉ॥ వారలపైతుపాకులన ♦ వారితలీలనుపేల్చగాబడెన్ ।
గారెనురక్తమాయెడను ♦ గాయములందునకొంతపుందికా ।
ధారలుతీవ్రపుత్రిమవి ♦ ధానములన్గనక్రోధముబ్బుచున్ ।
మానపుజెందెభావములు ♦ మానిరిశాంతముసాహసంబునన్ ॥

ఆం. అప్పుడే మొనరించిరి.

హా. చురుకంటినవారూరకుందురా.

పాం. పగదీర్చుకొనుటకు కొన్నియకార్యముల జేయుచు వెంటనే తెలివొంది వినాశకార్యముల మానుకొనిరి యధికారులిది సత్యాగ్రహవ్రతలక్షణమని గ్రహింపలేదుగాని మహోపద్రయనియు అంగడులు మున్నగునవి మూసివేయుట తమకగౌరవమనియు తలచిరట.

హా. తలంచియే యుండవచ్చును నిజముగా సత్యాగ్రహవ్రతలక్షణ మిదిగాదుగదా. దెబ్బదినినమీద శాంతముండుట దుర్లభమే.

పాం. తల్లీ.

ఉ॥ హిందువులున్మహమ్మదుల ♦ హీనతభేదముమానియాత్మలన్ ।
పొందునుగల్గిసత్కలట ♦ పూర్ణతరంబగుపుత్రిమంబుగా ।
సందియమందుచున్మిగుల ♦ శత్రుతనంబునుగూర్చనొకరుల్ ।
సందులజూడసాగిరిది ♦ చక్కనిమార్గమెన్యాయమానొకో ॥

హా. ఏవోయున్నవికొన్ని లేనివికొన్ని గల్పించి యధికారప్రాపకము నార్జించవలసినదే.

ఆం. దుఃఖచిహ్నముగా తలపాగలు పాదరక్షలు లేక వచ్చినవారిని దౌర్జన్యమునకై వచ్చిరారను నెపంబున నిర్హేతుకముగా ఘాతుకకృత్యమునకు బూనిరిగా అహా యేమి.

హా. అప్పుడప్పుడు భూభారము తగ్గుచుండవలసినదే.

ఆం-పు. ఒకవేళ దౌర్జన్యమునకే వచ్చినారని కొనినను ప్రజలకు హేతువాదముజూపి శాంతమనస్కుల జేయవలయుగాని సర్వవిషయనిర్ణయములకు తామేకర్తల మని దలంచి ప్రవర్తించుట యెట్టిధర్మము.

పాం. జాలియన్‌వాలాబాగ్‌లోకూడా జనరల్‌డయరుగారు జనుల పేల్పించి తమ పనిని మిగుల శ్లాఘించుకొనిరి ప్రజలపై కాల్చకపోయినచో తననుజూచి పరిహసించి యుండెదరనియు నందుకు తెలుపకయే తుపాకుల పేల్పించితిమనియు యిది దయాపూర్వక కార్యమనియు జెప్పియుండె నీకార్యములు సర్ మైకైలు గారి సమ్మతివడసినవట.

హా. నీరు నీరువంక పారును గాని మెట్టకు బారునా.

మ-కు. ఎప్పటికైనా సత్యము బయల్పడకుండనా.

పాం. చం॥ జనముల పేల్చినందులకు ♦ సంతసమందక వీధిబోవువా ।
రినియుదరంబులన్ఫణుల ♦ రీతిని బ్రాకగజేసె కౌశ్యపిన్ ।
గనజనులెల్ల నాడయరు ♦ కన్నులకున్భుజగంబులయ్యెనే ।
మనిమరియెంచగాదగును ♦ మానవశక్తిని మాలరోవెసన్ ॥

హా. పాములైనను కొంతమేలే దెబ్బదినిన త్రాచుబాము కసిబట్టి బీకిజంపును గాని యూరకుండునా.

ఆం. అటులెందుకు గావించవలసివచ్చె.

పాం. ఆవీధిలో కొన్ని దినముల క్రిందట షెర్వుడు కన్యక నెవరో యెదిరించియుండుట చేత నీశిక్ష విధించబడినదట.

హా. తప్పుజేసినవాడనుభవింపవలసినదేగాని యేకర్మమెరుంగనివారుకూడా యనుభవింపవలసినదేనా.

పాం. అన్నలారా మరియు ప్రజలను వీధులలో కొరడాలతో గొట్టించుటయు బలవంతముగా సలాముల జేయించుకొనుట మున్నగు కార్యములకు డయరేకారకుడు

హా. అంతవరకు మేలే వీపులమీద నెక్కి కొరడాలతో గొట్టుచు గుఱ్ఱములుగా నుపయోగించుకొని స్వారిచేయలేదు.

మ-కు. డయరంత మహాపుణ్యాత్ములింకెవరైనాయుండిరా.

పాం. లెప్టినెంటు కర్నల్ ఫ్రాంకుజాన్సన్ మొదలగువారనేకులుగలరు.

ఆం-పు. కర్నలు ఫ్రాంకుజాన్సను ఏమొనరించెను.

పాం. సైనికశాసన మనుచారములోనున్నపుడు లాహూరు సమీపగ్రామంబున ఒక వివాహము జరుగుచుండ నచ్చట గుంపుగూడినందులకు పెండ్లికుమారుని పెండ్లికి వచ్చినవారిని పురోహితులను కొరడాలతో గొట్టించిరి.



హా. అధికారులు ప్రజలపై చెల్లాటలాడినట్లాడినారు.

మహ. వివాహములందైనా బదుగురు బంధువర్గములు జేరకూడదా ఆహాయేమి.

గీ॥ సలలితంబుగ మేలును ♦ సలుపనగును । చెడ్డతనమునకీడును ♦ జేయవచ్చు ।
కొందరధికారు లెంతయు ♦ క్రోధమూని । దొరలుదలచంగ దెబ్బలు ♦ కొరతగలవె ॥

ఆం. అటులనకమ్మా రాజకీయులకేమి కోపమువచ్చునో. ఇంకేదుష్కార్యములొనర్చిరో

పాం. సనాతన ధర్మకళాశాల విద్యార్థుల నైదునందలమందిని బట్టికొని ప్రతిదినము పదహారుమైళ్లు నడువవలసినదని యాజ్ఞాపించియుండిరి.

హా. బాలకుల దీవనలు బ్రహ్మదీవనలే యాబిడ్డల యుసురైనా తగులలేదా పాపము పెరిగిపెరిగిగాని కొల్లేరుకుంగినటుల కుంగదు.

మ-కు. అటులెందుకు గావించిరి.

పాం. సైనికశాసన ప్రకటన కాగిత మెవరో చింపినందులకట.

బం. ఇదియొక నేరమా.

హా. నేరము లెంచదలచినప్పుడన్నియు నేరములే.

పాం. చం॥ ఇరువురు భారతీయులకు ♦ నెక్కువగాగుమిగూడియెప్పుడున్ ।
తెరవులబోవరాదనుచు ♦ దెల్పిరియాజ్ఞనుమీరకుండగన్ ।
జరుపుచునుండెనిట్టివగు ♦ సంగతులెన్నియొ చిత్రమొప్పగా ।
నరయసమానగౌరవము ♦ నందినయర్థమిదేగదాధరన్ ॥

గుజరన్‌వాలాలో ఓబ్రీసుగారు కుమారులు దొరకలేదని నతనితండ్రియగు గోహాగసింగును బట్టికొని ప్రభుత్వమువారాతనిసొత్తును స్వాధీనమొనర్చికొనిరి మరియు నొకపాలములో నిరువది ముప్పదిమంది మాట్లాడుచుండగా లెప్టినెంటు డాడ్కిన్సు విమానమునందుండి బాంబులను ప్రయోగించియుండెను.

బం. అందులకతడేమి జెప్పియుండెను.

పాం. వారు దురుద్దేశముతో జేరిరో లేదో నాకు తెలియదుగాని ప్రజలగుంపులు దొలగించుమని నాకు యుత్తరువీయబడియుండుటచే యగ్నిగోళముల ప్రయోగించితినని జెప్పియుండెను.

హా. బేష్ ఇది అన్నిటికంటె చాలాబాగాయున్నది.

పాం. ఇంతకంటె కసూరిలో కప్తానుడవుటను విచిత్రశిక్షల గనిపెట్టెను.

బం. అవియెట్టివి.

హా. ఇదివరకు వినినవియెట్టివో అవియట్టివే యిట్టివి చెవులవినకూడదు.

పాం గీ॥ తలలతోడనుభూమిని ♦ దాకునటుల। ప్రజలకాజ్ఞయొసంగెను ♦ భారమనక।
దుశ్చరితులగుస్త్రీలకె ♦ దుటపురుషుల । గుడ్డలనుదీసి కొరడాల ♦ గొట్టజేసె ॥

హా. పొంగినదంతయు పొయిపాలే.

సా. లెప్టినెంటుకర్నలు మెక్రీగారు విద్యార్థులనుగొట్టించి తన్మూలమున బుద్ధిగరుపనెంచి యటులగావించిరి.

మహా. ''యథారాజతథాప్రజాః, రాజప్రతినిధి సర్ మెక్లైలుగారి కెట్టియభిప్రాయములుగలవో యధికారులు వానిననుసరించి మెలంగి వారికి సంతోషమును గలిగించియుండిరి తప్పేమి.

హా. వారిది తప్పునిన చెంపదెబ్బలు చేతిపోట్లే.

సాం. చ॥ సరిగవిచారణంబులను ♦ సల్పకబూర్వమెయెట్టివారికిన్ ।
స్థిరముగచావుదండనలు ♦ దెల్పకనున్నపుడేక్రమంబుగన్ ।
యురినిలదీయుకంభముల ♦ నొప్పగపాలకులాజ్ఞచేతనే ।
త్వరితమునిల్వబెట్టబడె ♦ శైవవశంబనిబల్కెహేతువున్ ॥

పాంచాలాధికారులు ప్రజలను భీతిలజేయబూనుటయేగాక హైందవమహమ్మదీయుల మైత్రినికూడా విపరీతముగా చూడసాగిరి ''హిందూముస్లీముకీజయ్'' యను నినాదము లాపత్కాలమున వెడలెను యానినాదముల ప్రభువులు మహాపరాధముగనెంచిరి మహావిప్లవమనిరి రాజ్యనిర్మూలన ప్రయత్నమనిరి ప్రభుత్వము దొలగించుటకేర్పడిన సమ్మేళనమనిరి.

హా. వీరిమార్గమును హిందుముసల్మానులిప్పటికైనా కొందరు గ్రహించియుండలేదు. పిచ్చికుదిరితే బెండ్లికుదరదు పెండ్లికుదిరిన పిచ్చికుదరదు.

మ-కు. ఏమీ యీవిపరీతభావములు ప్రభువులనోటవెడలిన యీమహావాక్యముల నంతరార్థముగ్రహించి యిచ్చట హైందవులు మెలంగవలయును.

సాం. హిందువులు మసీదులలోనికి వెళ్లుటయు మహమ్మదీయులు దేవాలయంబుల కరుగుటయు అంటులేక పానీయంబుల గొనుటయు హైందవమహమ్మదీయులను సమ్మేళనమునుగాకుండా నుంచువారికిది దుస్సహముగానుండెను మహానర్థకముగా గన్పడెను.

గీ॥ మించినిజముగజరిన♦ త్లెంచబడిన । విషయములకొన్నిమాత్రమె♦విశదపరచి ।
తినినసంఖ్యాకఘోరము♦లనునిచటబ । లంకనసాధ్యముమీదట♦ప్రకటితమగు ॥

హా. గొప్పనౌకరులేకమై జేసినపనుల కెవ్వరేమిచేయగలరు.

మ. అసలు పంజాబులో నీకలవరము కలుగుటకు కారణమేమి.

పాం. సైనికశాసనమువల్లనే.

బం. ఇంకనేమయినా విశేషముబున్నవా.

హా. అడగినకొలది విసుకపాతరవలె బయలుదేరుచుండును ఇట్టియధికారుల నెందుకు బంపిరో వారిట్టి ఘోరములనేలగావించిరో యీశ్వరునికెరుక.



పాం. పాంచాలము చాలా అసమర్థమైయున్నది ''ప్రతిష్ఠ'' రాజద్రోహము, అనుతత్వము నాధారముచేసికొని పంజాబును పాలించుచున్నారు.

మ-కు. ప్రతిష్ఠయననేమి.

పాం. ఇష్టమొచ్చినటుల జేయుటయే.

ఆం-పు. రాజద్రోహమననేమి.

పాం. పాలనావ్యవహారముల నాక్షేపించిన వారిగృహంబుల శోధించి వారిని ప్రవాసమునకు బంపుటయే.

మ-కు. ఇటు లీవాక్యార్థముల నేగ్రంథము దెలుపుచున్నది.

పాం. రాంసేమెక్డోనల్ గారు వ్రాసిన భారతప్రబోధమను పుస్తకములో వివరింపబడియున్నది.

కం॥ పాంచాలపాలనంబున । సంచలనముగలుగకెట్లు ♦ శాంతివహించున్ ।
గాంచివిధాయకధర్మము । లెంచకనౌకరులుపొంగి ♦ రెంతయుజూడన్ ॥

ఆం-పు. నిరంకుశాధికారము వహించినవారి నేరములెవరికి జెప్పుకొననగు సార్వభౌముని మంత్రులసభ యీదేశమునుండియున్నయెడ ప్రజలెప్పటికప్పుడు తమకష్టముల జెప్పుకొనవీలుండును.

హా. ఇండియాపార్లమెంటు (ప్రజాపరిపాలనా సంఘము) ఇండియాలోనుంచిన న్యాయాన్యాయములు పరిశీలించుటకు వీలౌ. అటులివ్వరు యిచ్చినను ప్రజాపక్షమువారి నియోగించరు.

మ-కు. రాజప్రతినిధులు లేరా.

ఆం-పు. గీ॥ అతులధీరముతోడని ♦ రంకుశాధి । కారమూనినవారలు ♦ దారివిడచి ।
ప్రజలలాభముకోరకెట్లు ♦ పాటుబడుదు । రమ్మరో వారికతిశయ ♦ మవసరమ్మె॥

పాం. సామాన్యముగా నధికారమదాంధులును ధనమదాంధులును తమసౌఖ్యమునే స్వర్గముగా జూచుకొనుచుండురుగాని ప్రజలబాగోగులను జూడనొప్పరు తమరే గొప్పవారుగానుండవలె [illegible] తమననుసరించుకొని యుండవలె.

హా. నాకొకటి అదియే బీదవారలులేనిచో భాగ్యవంతులకు సౌఖ్యముకలుగుటెట్లు.

ఆం-పు. ధనికులలో మాత్రము పరమోదారులు కొందరులేరా.

మ-కు. లేకేమి అందరు తమపొట్టనిండితే చాలుననేవారేనా.

ఉ॥ దీనులబ్రోవకన్నిగుల ♦ నెట్టుచునుండినవారలోభులే ।
మానముగాచకుండనస ♦ మానమొనర్చినవారు నీచులే ।
దానములందుమించిదిని ♦ ధ్యానమటంచనువారు ధన్యులే ।
జ్ఞానమెమోక్షమిచ్చుటకు ♦ సాధనమాననువారు పూజ్యులే ॥

మ-కు. పదుగురు బాగాయుండిన తమ బాగుగాని అన్న మోరామచంద్రాయని ప్రజలు మాడుచుండ కొందరు హాయిగాగుడిచిన వంటబట్టునా ప్రజలందరన్న తృప్తి గాంచినపుడే తమసౌఖ్యము. "ఆశాశాపరందుఃఖం నిరాశా పరమంసుఖం" భారతరణరంగమున పదునెనిమిది యక్షోహిణులు హతమైనబిమ్మట పాండవులేమి సౌఖ్యమనుభవించిరి కొటకపీడనచే ప్రజలంతా జచ్చిన పైనయున్న వారి కంతియే సుఖము.

ఆం. పాండవులనిన జ్ఞాపకమువచ్చినది. పూర్వము ద్రుపదమహారాజు పరిపాలించిన దేగా పాంచాలము.

ఆం-పు. ఔను అప్పటి రాజులు వారివర్తనలిప్పుడేల.

హా. జ్ఞాపకము దెచ్చికొని యేడ్చుటకు.

పాం. చం॥ కృపనవఖండముల్ తనదు ♦ కీర్తివెలుంగగనేలినట్టియా ।
నృపుదుసుయోధనుండరిగె ♦ నీతివిశారదుడైన ధర్మజుం ।
డపరిమితప్రభావుడగు ♦ యగ్బరుభూమిపతీంద్రులేగె ఛ ।
త్రపతిశివాజియుణ్ జనె స ♦ తంబగునేభువిరాజ్యసంపదల్ ॥

ఆం-పు. యదార్థము.

చం॥ జనకులసాధ్యశౌర్యమున ♦ సౌఖ్యములందగగూర్చదేశముల్ ।
తనయు లదృష్టహీనులయి ♦ దర్పముజాలకగోలుపోవరే ।
గనమెశివాజినందనుని ♦ గాథయుదంతమునీశ్వరేచ్ఛకే ।
మనదగుసంపదల్ స్థిరము ♦ లౌనెవసుంధరకెందరోపతుల్ ॥

బం. శాశ్వితముగానుండువా రెవరులేరు.

ఆం. ఏమో సాయనా జచ్చేవారు జచ్చుచున్నారు పుట్టేవారు పుట్టుచున్నారు దాని కేడ్చుటలేదు కూటికి మాడుచున్న వారినిజూచి నేనోర్వజాలను.

మ-కు. "జాతస్యమరణంధ్రువం" పుట్టినవారందరు జచ్చేవారేగాని యేదోపరోపకారమొనరించి కీర్తినిదెచ్చుకొని నాలుగురోజులు నటించినను జాలు.

ఆం-పు. వెనుక కరాచినగరమందు కూడిన దేశీయమహాసభకు నాయకుడైన ధన్యుడు మహోపరోపకారియని వినియున్నాను నతడెవ్వరో.

హా. దేశసేవనొనర్చిన విద్యాదురంధరుడే.

ఆం. మిగుల దేశభక్తుడని వినియుంటిని.

మ-కు. ఔను.

ఉ॥ హాయిమహమ్మదీయజను ♦ లారసి జేరని వేళలందుదే ।
శీయసభాంతరాళమున ♦ జేరచుధీరముబూని మేలులణ్ ।



బాయకజేసెసయ్యదున ♦ వాబుమెహమ్మదు దేశభక్తులం ।
దోయమసత్యమార్గముల ♦ నొప్పగవర్తిలికీర్తినందడే ॥

ఇట్టివా రనేకులుద్భవించి మతభేదవైషమ్యములడంచి ఐకమత్యబీజములను సోదరజనాంతరంగ క్షేత్రంబులవిత్తి యామొలకల వృద్ధినొనర్చి ఫలవంతముగాజేసిన గాని దేశము బాగుపడనేరదు.

హా. మనవారందరేకమై గోర్నమెంటువారినడిగిన మనహక్కుల నివ్వవచ్చును ఈజిప్టు మొదలగు దేశముల ప్రజలేకమై స్వపరిపాలనమును గోరుటలేదా.

ఆం-పు. యదార్థము.

ఆం. హైందవమహమ్మదీయులు వివాదములుమాని సమ్మేళనమొందుచున్న కాలమున బ్రాహ్మణబ్రాహ్మణేతర భావములు భేదముగాంచ మొదలిడి బాటుపడుచున్నవి.

బం. ఇప్పుడిదియొక నూతనోద్యమము బయలుదేరినదా.

హా. దేశమునకు లాభకరమగు ఉద్యమములు శీఘ్రముగా వ్యాపించనేరవుగాని ప్రజలనేకీభావము మాపునట్టి యుద్యమములు త్వరలో నెల్లడల వ్యాపించుచుండును. ఆమమంతయు జెరుపునదొక గచ్చకాయేగా.

మ-కు. దీని గల్పించినవా రెవరైయుండవచ్చును.

ఆం-పు. ఐకమత్యమేరికసహ్యముగానుండెనో వారే అయియుండవచ్చును.

మ-కు. గీ॥ అరయహిందూముసల్మాను ♦ లగుచునొకటి ।
గానువర్తించుచుండగా ♦ గలుగుటెట్లు ।
భేదములుబ్రాహ్మణాబ్రాహ్మ ♦ ణాదులకును ।
బెట్టజూచినపాసగనే ♦ వెట్టగనక ॥

మం. అటులనా.

ఆం. ఇప్పుడు బ్రాహ్మణేతర యుద్యమమువెడలి భేదముగల్పించుటకు మహాశక్తియై కృషిసలుపుచున్నది.

హా. మహాశక్తులకు మహామంత్రగాండ్లులేరా. కాలము మంచిదిగా లేనపుడు ప్రజలు చెడమార్గముల ద్రొక్కుచుందురు.

మ-కు. సోదరులకు జ్ఞానములేదు యింకా కష్టకాలమున్నది ఆచారవ్యవహారాదులందు భేదముగల హిందూముస్లీములే ఏకమౌచుండ ఏకమతప్రవర్తకులే. ఇరుతెగ లౌట దేశమున కనర్థముగాదా.

బం. క్షత్రియవైశ్యాదులే తెగ కనుకూలముగానున్నారు.

హా. ఉయ్యాలవలె వారు మధ్యనేయూగుచున్నారు ఇదియేమంచిది వీరెటుజేరినను కక్ష బలమౌచుండునుగాని అసహాయోద్యమ పక్షమువారన వచ్చును.

మ-కు. ఉ॥ కాలముమంచిదైనదగు ♦ కారణముల్గనిసౌఖ్యమందగా ।
జాలుదుగైకమత్యమును ♦ చక్కగనేర్పడుదేలువిద్యలన్ ।
కాలమురాకనున్నయెడ ♦ గాంచరుకోర్కెలతేజవంతులై ।
యాలమునన్ దొకప్పుడును ♦ రాధిపులాసురకోటికోడరే ॥

హా. దేవతలను దుమ్ము రేగగొట్టి త్రివిష్టపము నాక్రమించుకొనినది బలిచక్రవర్తియేగా.

ఆం-పు. వాస్తవము.

మ॥ మనమేకోర్కెలగోరుచున్నవవిసా ♦ మాన్యంబుగామంత్రులె ।
ల్లనుజర్చించియునట్టియర్థములదే ♦ లన్ జూపకన్నెట్లులా ।
గిననట్లేగనుపించుసూచనలనే ♦ గీల్కొల్పిప్రజ్ఞాత్ములై ।
కనులన్నీరముబాపనెంచెదరుగా ♦ కన్నిష్టగాజూతురే ॥

మ-కు. వెనుక స్వరాజ్యాందోళనలో మా క్లెమింట్‌ గార్లు సంస్కరణము లెట్లు ప్రసాదించిరో యిప్పుడట్లే మాంటేగు చెమ్సుఫర్డులు సంస్కరణప్రదానంబు లొసంగిరి.

ఆం. ఇప్పటి సంస్కరణ లంతియే నా.

ఆం-పు. కొంచము మేలని కొందరనుచున్నారు.

హా. అనుకూలమా? మితవాదుల కనుకూలమేగావచ్చును కాంగ్రెసులీగువారి సూచనలెత్తికొనియే యుండలేదే.

ఆం. మనవారింతగా బోరాడి యింగ్లాండు రాకపోకల కెంతయో ధనవ్యయ మొనర్చి సంపాదించిన హక్కులేమయినా యున్నవా.

హా. పెద్దసున్నా.

ఆం-పు. ప్రస్తుతము కండ్లనీరు దుడచుచు మనవారికి గొప్పపదవులిచ్చుట కంగీకరించినందుకు సంతసింపుచు గౌర్నమెంటుకు వందనముల జేయుచున్నాను.

హా. తక్కినవి ప్రసాదించినపుడు నేనును నమస్కారముల జేసెదను.

ఆం. మాటలచే యెంత ప్రొద్దుపుచ్చినను నావిచారము బోదు బిడ్డల శీలస్వాతంత్ర్యములు కూడా నశించెనుగదా.

మ-కు. ఉ॥ దలచగరైలుమార్గములు ♦ అంతలవార్తలుమంచిధూమనౌ ।
కలువరమాన్యఘోక్చరులు ♦ కారులు వాయువిమానయంత్రముల్ ।
తెలసినకొద్దికాటకము ♦ వృద్ధినిగాంచెనుగానిజీవనం ।
బులకునుభంగమేర్పడెను ♦ బోయెనువృత్తులుమానవాళికిన్ ॥

మనమింతలో స్వపరిపాలనము బడయుట దుర్లభము దానికొఱకు బడువ్యయప్రయాసలు పరిశ్రమల నభివృద్ధిజేయుటకొనరించినయెడ జనులెల్లరు జీవనోపాధులుగల్గి సుఖ మొందగలరు.



హా. మనవారికి తెలివితేటలుంటె ఒకరినాశ్రయించవలసిన బనియేమున్నది.

ఆం-పు. ఉ॥ జేయనెరుంగకెవ్వియును ♦ చేతిపనుల్వెసనన్నిఖండముల్ ।
బాయకనేగిపూర్తిగను ♦ వస్తువినిర్మితవిద్యలం జపా ।
నీయులునేర్చిపచ్చిధర ♦ ణిన్ యశమందుటమొన్ననేగదా ।
సాయములేకనేకృషిని ♦ పల్విదరిద్రమడంచప్రజ్ఞయా ॥

మ-పు. గీ॥ నేతయంత్రంబులనుమంచి♦చేతిపనులు । వర్తకంబునుసేద్యము♦వస్తునిర్మి ।
తనిలయంబులనెలకొల్పి ♦ యనుజాలకును । నేర్పిజీవనసంతృప్తి ♦ నివ్వవలెను ॥

బం. జపానుదేశమున గ్లాసునిర్మితవిద్యనభ్యసించివచ్చిన ఆంధ్రసహోదరి పుత్రుడొకడుండి యుండవలెనే.

ఆం. అట్టితనయుల చిరకాలము జూచుకొనునట్టి భాగ్యము నాకెక్కడిది.

మ-కు. ఎవరబ్బా.

ఆం-పు. ఉ॥ శ్రీలజలంగుచున్నిగుల ♦ చిన్నతనంబునధైర్యసంతుసై ।
కాలప్రమార్పులన్దెలసి ♦ గ్లాసువినిర్మితవిద్యనేర్చనై ।
శ్యాళిజపానుకేగిసును ♦ దైజనుదెంచినయాలపాటిగో ।
పాలుడుగాడతల్లినుతి ♦ పాత్రుడెగానిగతించెనప్పుడే ॥

బం. ఇటువంటి సుతుల గోలుపోయిన సోదరికి మనమెంత ధైర్యము జెప్పిననేమి సార్థకము.

హా. పురిటిలోపోయిన బిడ్డలకొఱకేడ్చిన ప్రయోజనమేమి. ఇటుల పురిటిలోబోయినవారు చాలామందిగలరు.

శా॥ ఎట్లో ద్రవ్యముబోవుచేసి ♦ సతికేమో జెప్పుచునోర్చియి ।
క్కట్లన్ సాహసమొప్పయూరపుకువే ♦ డక్కంబోయినిండారబా ।
రట్లంనేర్చుచుప్యాసుగాంచకనే దే ♦ హంబిచ్చుటన్వీడెగో ।
మల్లాహాయననాగభూషణుడు శ్రీ ♦ మాజేటిసద్వంశుడౌ ॥

హా. ఎడింబరులో చదివిన అబ్బాయా పాపము ఫలమనుభవించలేదు.

ఆం. అమ్మలారా యిటుల మధ్యగోల్పోయిన బిడ్డలనేకులుగలరు. నావ్రాత.

మ-కు. గీ॥ గోమటులధీరులంచును♦కొంతమంది । తలచుచుందురుయేరికి♦తగ్గధైర్య ।
మునునువారలుపరదేశ♦ములకుజనరొ । సైన్యమందునజేరరో♦సాహసమున ॥

ఆం-పు. మంచిపేరుగాని చెడుపేరుగాని యెవరో యొకరు దెచ్చుచుందురు ఈపేరు వైశ్యులకెవరివలన వచ్చినదో దెలియదు యెవరో యొక ఆంధ్రసైనికుడనిలో వెనకకు బారియుండుటచేత నేకదా తెలుగుజిల్లాలవారు బిరికివారు. సైన్యములో

చేర్చకూడదని గౌర్నమెంటువారు నిషేధించినది ఒక యధీరునివల్లనేగదా యాంధ్రుల ప్రతాపమున కపకీర్తిసంభవించినది.

హా. సామాన్యముగా బిరికిపోతులు ప్రతిజాతియందును ప్రతిదేశములందును గలరు.

ఆం. గీ॥ మీరినాబిడ్డలెల్లరు ♦ ధీరవరులు । గారనుచు సైన్యమందున ♦ గలుపుకొనక ।
కొంతవరకవమానము ♦ గూర్చెప్రభువు । లేమిజెప్పుదుకష్టము ♦ లెంచియక్క ॥

ఆం-పు. ఈవిషయమై మహాసభలందుచర్చించి యెవరో యొకపారుబోతుభటునివల్ల ఆంధ్రులందరు బిరికివారినిగాదలంచుట యగౌరవమని ప్రభువులకు దెలిపి యుండిరి.

హా. ప్రభువులకు దెలుపుట అరణ్యరోదనమే.

మ-కు. చం॥ ఎవరినిబనికిరారనుచు ♦ నెంచెనధైర్యులగానువారినే ।
యవసరమయ్యె జీరిమరి ♦ యాదగ సైన్యమునందుజేర్చగన్ ।
యెవరినిబనికిరారనుచు ♦ నెంచిరొయూరపుసైన్యపంక్తులన్ ।
అవసరమయ్యెవారినెపు ♦ హాకలహంబునజేర్చనచ్చుటన్ ॥

హా. గొప్పవారనసరముగల్గినపుడు తియ్యనిమాటలచే యుబ్బించి పనులనుజేయించుకొని పిమ్మట సాగనంపుట యనుచారమే

మహా. భారతీయులు యూరపుసంగ్రామరంగములకు బనికిరారనియు గలదా.

మ-కు. ఈ ఐరోపా మహాసంగ్రామమునకుబూర్వము.

హా. అసూయావ్యాధిని ఈశ్వరుడేచికిత్సజేసి బాపుచుండును.

బం. చికిత్సలనిన జ్ఞాపకమువచ్చినది ఇప్పటివలెనె బూర్వము వైద్యచికిత్సాశాలలు బెట్టియుండిరేమొ.

హా. మరే యిప్పటితెలువు లప్పుడున్నవా యిప్పటివారే అన్నముదినుచున్నారు.

ఆం-పు. ఆహా వైద్యశాలలు నిర్మించుటయు నౌషధంబుల నుచితముగానొసంగుటయు ప్రాచీనకాలమునుండి హైందవుల కాచారమైయున్నదిది పాశ్చాత్యులనుండి హైందవులు నేర్చికొనినదికాదు.

చం॥ అనుపమవేదశాస్త్రపఠ ♦ నాలయమట్టుల వైద్యశాలయున్ ।
ఘనతరశస్త్రవైద్యులను ♦ గన్గొనమూలికజాతినొక్కరిన్ ।
దనరగనిల్పినాకరుల ♦ దాదులరోగులసేవజేయనా ।
ధనికునివైశ్యమాధవును ♦ దారసహాయము నెన్నశక్యమా ॥

బం. వైశ్యమాధవు డాంధ్రసోదరీకుమారుడేనా.

మ. యింకెవ్వరి కట్టికుమారులుందురు.

బం. అతడెప్పటివాడో.



మ-కు. చోళరాజ్యకాలమనగా పదనొకండవ శతాబ్దమున జగన్నాథమంటపమును నొకభవనము నిర్మాణముగావించి అందు వేదపాఠశాలాదులను నెలకొల్పి విద్యార్థుల యుపయోగార్థమై వీరసోమనుపేరిట నొకవైద్యశాల నేర్పరచి దానియందు రోగులు నివసించి చికిత్సబొందుటకు తగినసదుపాయ మేర్పరచెను యొకశాస్త్రీయవైద్యుని యొకచికిత్సకుని మూలికలదెచ్చుటకిద్దరు నౌషధాహారాదులనందిచ్చుటకయిరువురదాదులనుతగినపరిచారకు నియమించియుండెనట

బం. ఇతనిచారిత్ర మెచ్చటదొరకినది.

మ-కు. ఇటీవల దొరకిన మలకాపురపు శాసనమువలన గోచరమైనది.

హా. ఇట్టివారుపేరు ప్రఖ్యాతిలేకుండ యెంతమందిపోయినారు యేమో శాసనాధారములేగాని మనవారికి చరిత్రలు వ్రాయునట్టి పద్ధతిమాత్రములేదు పుక్కిటిపురాణముల్లల్లుటకు సుప్రసిద్ధులు.

ఆం-పు. చం॥ వనితలమేలుకైప్రసవ ♦ వైద్యనికేతనవైద్యశాలలన్ ।
పనివడినిల్పిదేశమును ♦ బాగుగసౌఖ్యమునొందజేసిబే ।
ర్కొనబడెనోజనంబులను ♦ కోపులిరుద్రమదేవిసాటియై ।
దనరినసుందరీమణులె ♦ దండలపోసినగానవచ్చునే ॥

బం. రుద్రమదేవి ఎవరికుమారిక.

ఆం-పు. గణపతిదేవునిపుత్రిక.

బం. ఆయుర్వేదమున ప్రసవతంత్రమేలేదని నుడివిన గిఫర్డుగారు దీనికేమిజెప్పుదురు.

హా. ఇదమిద్ధమని మిన్నకుందురు.

మహా. ఆంగిలేయులలో కొందరిప్పుడన్నిశాస్త్రములు తమరేగనిపెట్టి దేశమున కుపకారము జేసినట్లు తలంచుట వారికి సహజమైయున్నది.

హా. గీ॥ దానములగాంచనౌషధ ♦ దానముత్త । మముగదాశరీరారోగ్య ♦ మనురజీవ ।
నమునొనర్చగవచ్చును ♦ క్రమముతోడ । వటులెగతిలేనిబిడ్డల ♦ నొనుసాక ॥

మ-కు. గతిలేనివారిని బెంచుటయన జ్ఞాపకమువచ్చినది.

చం॥ అతులితమానితంతుశర ♦ ణాలయమున్నెలకొల్పిబాగుగా ।
సతతమనాథబాలికలు ♦ చక్కగకుట్టుపనుల్గ్రమంబుగన్ ।
చతురతనేర్చిజీవనము ♦ సల్పగజేసెదయాంతరంగుడా ।
హితమతిపీఠికాపురిమ ♦ హీశునిమార్గము లెన్నశక్యమా ॥

ఆం. ఓహో నిజమమ్మా.

గీ॥ దృష్టిమీరగనమ్మరో ♦ దిక్కులేని । బిడ్డలనుసాకగాజేసె ♦ ప్రేమనిగర ।
నాంధ్రవైకుంఠికముప్రాయ ♦ నతులధనము । నొసగెభాషాభిమానంబు ♦ వసుధజూప ॥

మ-స. శ్రీరావు వెంకటమహీపతి సూర్యారావు బహద్దరువారు కాదా.

ఆం-పు. ఏలూరు పట్టణంబున నెవ్వరిగో హిందూయూనజన సంఘనిలయమునకు ఘోషా చికిత్సాలయమున కమితద్రవ్య మొసంగెనట.

హా. ‟ దాతారందానశబ్దంచ త్రైలోక్యంసచరాచరం” దాతలపేరు లోకరుజెప్ప వలయునా.

మ-స. యదార్థమే సచ్ బాత్ హై.

మ. జగతీంద్రాదులభోగిభోగములస • త్సంపత్తులన్దాగుచున్ ।
పగవాడై ననుతించధర్మములస • త్ప్రీతిన్ జమీన్దారు ఖ్యా ।
తిగనెక్ దేశమునందు నెల్లెడలమో • లేగంగ రాజార్యునెం ।
చగసామాన్యుడె వైశ్యవర్ణమణియో • చారిత్రమూహించగన్ ॥

ఆం-పు. ఓహో వారాంధ్రదేశమున జూటుమిల్లును స్థాపించి నూతనవాణిజ్యమునకు మార్గము జూపించుటయేగాక స్వకులధర్మములకేమి యితర ధర్మములకేమి యమిత ధనసహాయము జేయుచు దేశాభివృద్ధిని గోరుచుండిన సుగుణసంపన్నుడే.

హా. ఆ త్యాగసంపన్నుని ధీరోదారగుణంబులు నాకుదెలసును.

ఆం. సుతులలో నెచ్చటనో దానపరులున్న జాలునా సోదరులనందరి యన్న తృప్తి జేయుట కనేకదాతలు వెడలవలె నాచింతదీర్పవలె.

బం. ఎందరున్నను మనయాంధ్రికు దృప్తిలేదు.

ఆం-పు. మ॥ అమితోత్సాహముతోడబీదలకుసా • యంబున్దగన్ జేసిధ ।
ర్మమున స్వైరువహించి సత్రములఁ బే • మన్నిల్పి గ్రామాళిని ।
త్యముదానంబులదేలివైశ్యకులర • త్నంబయ్యెనూ? వెవ్వరో ।
యమ పొత్తూరిసువంశనాథుడలయ • య్యన్నార్యుండోగదా ॥

హా. చెన్నపురీనివాసుడైన రావుబహద్దర్ పొత్తూరి అయ్యన్నార్యుడా నెరదాతయే. వారియందు కొంచము బ్రాహ్మణభక్తి యెక్కువగాగనుపించును.

ఆం. చం॥ ధనికులుదానధర్మము లు • దారత నెన్నియొనర్చినేమిసా ।
మనసువిచారమందకను • మానదుకాటకపీడనంబుచే ।
తనయులుగుందుచుండనిల • తల్లికినిద్దురబట్టునెట్టులన్ ।
ననయముతిండిగల్గిసుఖ • మందినసర్వులుసంతసంబగున్ ॥

హా. ‟సర్వజనేభ్యః శుభంభవత్” సంధ్యావందనాంతమున దాశీర్వదించువాక్యము సైనను దలంచరుగదా.

బం. ఉ॥ ఏలవిచారమందగనె • దెట్టులనుండినపూనివైశ్యస ।
ద్బాలకులాంగ్లవిద్యలన • పారజయంబునుగాంచద్రవ్యమున్ ।



చాలగగూర్చిబీదలకు • సాయముజేయుచువృద్ధిగోరెనా ।
నాళముపద్మనాభముగ • నం సుతుడోగదయాంధ్రిసోదరీ ॥

ఆం-పు. అతడు స్వకులాభివృద్ధికి కృషిచేసియుండెనుగాని దేశాభివృద్ధికై పాటుబడియుండెనా.

హా. ఏదో యొకపనిజేసినాడు రాయబహద్దర్ బిరుదును సజీవితుడైయుండజూచికొని సంతసించునట్టి భాగ్యములేకపోయెను.

బం. పరలోకగతుడైన పిమ్మట బిరుదువచ్చెనాయేమి.

హా. అటులనే అనుకున్నారు. గాని పాపము అంగ్లేయాంధ్రభాషలలో మంచివక్త.

ఆం-పు. కుంభకోణమున జరిగిన ఆర్యవైశ్యమహాసభ కగ్రాసనాధిపతియై యుండెను.

మహా. ఈ ఆర్యవైశ్యమహాసభ నేర్పాటుజేసినదెవరో ఇది బయలుదేరినది మొదలు ప్రత్యేకకులసభల గందరగోళ మెక్కువయైనట్లు వినవచ్చుచున్నది.

హా. జాతిభేదమే దేశమును వినాశముజేసినది అదిదెలసికొనిన కులసభలేల బయలు దేరును.

మ-కు. ఆర్యవైశ్యమహాసభను స్థాపించినది వెంకటగిరి సంస్థానమంత్రియగు సుంకు నారాయణస్వామి శ్రేష్ఠియే.

చం॥ ఘనప్రథమార్యవైశ్యసభ • గౌరవమందగనాయకత్వమున్
పనివడిబూనినిర్వహణ • భావములెల్లనుదెల్పిధీరతన్ ।
ధనమునుగూర్చిబాలురును • దంబునవిద్యలనభ్యసించివే ।
తనములబొందివృద్ధిగను • దారనిజూపెనుసంతసంబునన్ ॥

ఆం. వీరెవ్వరు దేశారాధనపరులుగాదు యిట్టివా రనేకులుగలరు.

హా. ఇంటగెలచి రచ్చగెలువవలసినది.

మ-కు. సీ॥ అతులదేశీయమ • హాసభలందుప, న్యాసములిచ్చెమా • న్యతిజలంగ ।
స్థిరతార్యవైశ్యప • త్రికనుక్రమంబుగా, నడుపుచుండినసుశీ • లుడుదలంచ ।
ధీరతరాజప్ర • తినిధులదర్శించి, బలికెమండలసంగ • తులనునేర్పు ।
నెరువక నెంతటి • దొరలనుజూచిన, ప్రజలకష్టంబుల • బట్టిదెల్పు ।
గీ॥ భూరిగంభీరవ్యాసంగ • ములనుజేసి । సభికులెల్లరమెప్పించు • సరవినెవ్వ ।
డట్టిశ్రీశనగపల్లివం • శార్ణవసను । దాప్తుడైనరామస్వామి • గుప్తుడేడొ ॥

ఆం-పు. ఓహో ప్రతిసభలో నవరసభావభరితముగా నుపన్యసించువానినే మరచితిమి మనయదృష్టము మంచిదిప్పుడైనా జ్ఞాపకమువచ్చినది లేకున్న మనల సభలలో నేకేకి వదలిపెట్టియే యుండును.

హా. దూదేకినట్లే ఆత్మస్తవమున కొనియాడించు పురుషుడు దేనియందైనా పేరు జేరినం
దులకు సంతసించువాడు.

ఆం-పు. కార్యదీక్ష యెటులున్నను పేరుగలవాడే.

బం. ఎవ్వరు.

మహా. ఆంధ్రిసోదరీసూనుడే.

ఆం. ఏమిసార్థకము కార్యారంభశూరుడు.

మ-కు. గుప్తనెరుగని రాష్ట్రీయ సభానాయకులుగాని ఉన్నతోద్యోగులుగాని
సాధారణముగా లేరనియే జెప్పవచ్చును.

ఆం-పు. అతడు వెళ్లనిసభలుండవు. ఆతని వ్యాసంగములందు రసప్రవాహములు
వెల్లి విరియుచుండును.

ఆం. ఇట్టివారి జీవితముల వినినంత నావిచారముబోదు యీబిడ్డలు నాకు దెలియ
కుండిరా. ఏవో పుట్టినీదివి పురమీదిదిజెప్పి ప్రొద్దులుబుచ్చుటయా పుత్రుల
దారిద్ర్యము తొలంగుమార్గముల దెలుపుట ప్రస్తుతకార్యము.

బం. సోదరీ నీకెందరు దేశభక్తులున్నను తృప్తిలేదు. చింతిలిన లాభమేమి.

మ-కు. విజయవాడపట్టణంబున కన్యకాపరమేశ్వరీ యున్నతపాఠశాల నెలకొల్పిన
విద్యాప్రదాతయెవరో.

ఆం-పు. గీ॥ వివిధధర్మంబులెల్లను♦వెదకివెదకి।సర్వదావిద్య బెంపొందు♦సరణిగాంచి।
బేరుగనెవొవిస్సంశెట్టి♦వేంకటరత । నార్యుడోయన్నయింకెవ్వ♦రట్లొనర్చు ॥

మ-కు. ఆపుత్రుడు తనధనమంతయు పాఠశాల కర్పించియుండెనా.

ఆం-పు. ఆహా సందియమేల.

బం. అటులైన పచ్చయప్ప ధర్మపద్ధతి ననుసరించినవాడే.

హా. కళాపాఠశాలల నెలకొల్పిరా ఆంగ్లేయమభ్యసించినది మొదలు గౌర్నమెంటు
నౌకరులకు వెతకికొనుటయేగా.

ఆం. ఏమిసార్థకము.

ఉ॥ గర్భమునందుసంతతులు ♦ కష్టములందుచు కాటకంబుచే ।
యర్భకులౌచుగాత్రముల ♦ నమ్ముచుజాలకజీవనంబుకు౯ ।
దర్భగడించలేకభ్రమ ♦ దంబునెరుంగకనుండనక్కటో ।
దుర్భరమౌచునుండెమది ♦ దుఃఖమునాపగమాటలేధర౯ ॥

బం. వాస్తవమే మనమేమిచేయగలము. ధైర్యముదెచ్చికొనవలె.

ఆం. అమ్మలారా ఎంతమందియుండిననేమి గోపాలకృష్ణ గోఖేలంతటి దేశారాగన
తత్పరుడుండిన జాలును.



హా. ఎవ్వరున్నను గౌర్నమెంటువారికి మాటలు చెవులదూరితేగదా మనవారికి దక్షి
ణాఫ్రికా కష్టములు దీరినవా.

మ-కు. గోఖేలనిన జ్ఞాపకమువచ్చినది.

మ॥ నెలకున్వేలుగడించగల్గియునుదాని ♦ న్మానుచున్వేడ్కనాం ।
ధ్రులకైశక్తినిదారబోయుచునుసం ♦ తుష్టి౯సదామిత్రమం ।
డలిమెచ్చన్ఘనగౌరవంబునలకొం ♦ డాపెంకటప్పాఖ్యునే ।
వలన౯జూచినదేశభక్తుడగున ♦ వ్వాచింతనీకేటికి౯ ॥

హా. ఎవ్వరుండినను చేసినకార్యమేమి. శాసనసభ లున్ననేమి.

బం. ఆధీరునేగదా ఆంధ్రిగోఖేలని వాడుచున్నది.

హా. ఎంతమందైతే ఒక్కఘోకేలగును.

ఆం. ఆబిడ్డడు శక్తివంచనలేక చేతనైనవరకు సోదరపురోభివృద్ధికై పాటుబడుచునే
యున్నాడు.

హా. గౌర్నమెంటువారే గొప్పపదవియైనా యొసంగి కూర్చుండబెట్టితే అన్ని దేశ
సేవలు ఒక్కదెబ్బలో వదలుకొనును యెంతమంది మోసపుచ్చియుండలేదు.
గొప్పపదవుల సంపాదించుట కిదియొకసూత్రమే.

మహా. సంఘసంస్కరణాభిలాషియే.

మ-కు. సంఘసంస్కరణలన్న జ్ఞాపకము వచ్చినది.

ఉ॥ మానవజన్మమెత్తిదయ ♦ మానికుమారికలంచుజూడక౯ ।
జ్ఞానవిహీనులౌచునువి ♦ చారమునొందకబ్రాహ్మణోత్తముల్ ।
బూనివితంతులేడ్వగను ♦ బోడులజేయగధర్మమానెయే ।
మానినులైనదీనిసవ ♦ మానముగాదలపోయకుందురే ॥

మహా. వితంతువులకు వెంట్రుకలుండిన యితరులు భ్రమించరా.

హా. లేకున్నవారిని భ్రమించితే.

మ-కు. ఇతరులు కామించుటకు కురులేనా కారణము స్త్రీలయవయములలో నేవి
పురుషుల భ్రమింపజేయనేరవు.

హా. సరే మోహింపజేయునట్టివాటిలో ముఖ్యమైనవి స్తనములగదా వాటినిగప్పి
పెట్టక నుంచడమేల.

బం. బాగాయున్నది తలబోడిచేసికొని విధవ రవికె తొడుగుకొనవలయునా.

హా. జాకిట్టువేసికొంటె యింకా బాగాయుండును.

ఆం-పు. బోడితలజేసికొని రవికదొడగిన అందముగానుండునా.

మ-కు. అందవిహీనమునకేగదా తల బోడిచేయుట దానిలో శృంగారమేల.

ఆం. రమించుటకు కేశములు కారణమనిగాదట పాకాదులలో వెంట్రుకలు పడు
ననియట.

మ-కు. అటులయిన సభర్తృకల పురులు పాకాదులలో బడవా.

హా. ముత్తైదువుల వెంట్రుకలుపడినను తప్పులేదు ఆపైన మ్రింగినను తప్పులేదు విధవా
శిరోజములు గొంతుకజుట్టుకొని ప్రాణహానిజేయును.

మ హా. హైందవాచారములు నవ్వులాటలోనికి వచ్చినవి.

హా. వచ్చినను రావచ్చును. కోపపడవద్దుభాయి

చం॥ పనివడిగ్రామగ్రామముల ♦ బంధుజనంబులజీరిబాలుగా ।
దనరచుమేళ్ళముల్సరవి ♦ ధామములందునమ్రోయుచుండగా ।
తనయులకున్ముదంబునను ♦ ధర్మవిధాయకమంచుపట్టుగా ।
సునీతినిజేయుటల్గనిన ♦ సొంపుగగన్పడుచుండునప్పురో ॥

మ-కు. గీ॥ కాశిమొదలగుయాత్రల ♦ కేశములను । దీసివచ్చినవారికి ♦ తిరిగిపురులు ।
పూర్ణమగుదాకభర్తలు ♦ పొందుపడచి । యుండగల్గుచురతిసౌఖ్య ♦ మొందరొక్క ॥

హా. ఆరహస్యము లెవరికి దెలియగలవు. రెడుసంవత్సరములకు కేశములు పూర్ణదశ
నొందినయంతదనుక యవ్వనవంతులూరకొందురా.

ఆం-పు-గీ॥ తప్పుగానున్నవాటిని ♦ జెప్పిజెప్పి । కాయగాచెనునోరంత ♦ కనికరంబు ।
బుట్టకుండెనుకొందరి ♦ పురుషులకును । బుట్టికొందరునిర్బంధ ♦ ములకువెరతు ।
రేమిచేయుదుసోదరా ♦ యీశ్వరేచ్ఛ ॥

“తలలుబోడులైన తలపులుబోడులా” యను వేమనసూక్తి నెరుగనివారు
లేరు కేశములుండినను లేకున్నను నీతిప్రాధాన్యము. స్త్రీయొక్క సంపూర్ణ యవ్వన
సౌందర్యము కేశములు దీసినంతనె ముసుగునడునా వారివారి వర్తనలోనున్నదిగాని
వేరుకాదు.

మ-కు. ఇప్పుడిప్పుడు కోమటులలోకూడా ప్రబలుచున్నట్లున్నదే.

హా. గాజు పూస దీసినప్పుడే దీయుటలేదుగాని యాత్రలలో ఖండనముజేయించు
కొనుచున్నారు.

మ-కు. విధవాకేశఖండన మసలుశాస్త్రీయమేనా.

ఆం-పు. దీనివిషయమై పండితదాసు శ్రీరామాదులు శాస్త్రశోధనగావించి ఎచ్చట
గానుపించలేదనియు ఒక్కపరాశరస్మృతిలో మాత్రముల “ఛేదయేద్వాయ
మంగుళం” రెండంగుళములు కొనలు ఖండించమనియున్నదేగాని క్షౌరకునిచే
శిరోముండనము జేయించకొనవలశినదిగా నెచ్చట జెప్పియుండలేదనియు పతి
గతించినబిమ్మట స్త్రీ యితరపురుషుల దేరిచూడక బ్రహ్మచర్యము సలుపవలసి
నదిగా నున్నదనియు దెలపియున్నారు.



హా. ఎప్పుడు పురుషుని నెరుగనివారు మంగలి తలరుద్దుచుండ బిడియపడి యెంత
ఖేదమునొందుచుందురో.

మ-కు. హజాము తాకవచ్చునా.

ఆం-పు. తాకగూడదు.

ఆం. ఇప్పుడు సంఘసంస్కరణ గొడవలు నాకుబట్టవు.

ఉ॥ తిప్పలుగల్గెదేశమున ♦ తీరనికాటకమావరించుచున్ ।
చప్పిడికూడుమెక్కుచును ♦ చావకజచ్చినయట్లులుండెమా ।
యప్పులుగంజియొకలియు ♦ నైనలభించకమాడుచుండిరే ।
జెప్పినమానభంగమగు ♦ జెప్పకనుండినప్రాణభంగమా ॥

మ-కు. ఔను. ఇప్పుడు సరసముగా దొరకు పదార్థములేలేవు నిప్పుకు నీరుకుకూడా
కరువుగనుపించుచున్నది పూర్వము నిర్ణయవృత్తులుండుటచే సామాన్యముగా
జనులందరికి భోజనమునకు లోపములేకుండా జరుగుచువచ్చినది యిప్పుడన్నో
అన్నియు ధనికులవశమైనవి.

కం॥ తనయులలోనొకండుగన ♦ దార్ఢ్యములేకకుటుంబపోషణం ।
బునకుతపించుచుండగను ♦ మోదములేకవిచారమందుచున్ ।
జనకుడెటుండునోయటుల ♦ సత్కృపభూపతిపుత్రులట్లుగన్ ।
జనములజూచిపోషణము ♦ సల్పగనౌనుసమానమొందగన్ ॥

ఆం-పు. సత్యము మనప్రభువు మంచివాడే.

మ-కు. మన నవనాగరికులు తమ క్రాఫింగులు హాటుబూటులు వేషములనే జూచు
కొనుచున్నారుగాని దీనులగతి విచారించుటలేదు.

హా. కాఫీహోటలలో గొంతువరకు మెక్కివచ్చేది ఇంటివద్ద వంటకములు తినలేక
నేలపాలుజేసేది. అబ్బో ఎన్నిక్లబ్బులు ఎన్నిహోటలబసలు. మరలొక్కరి
కొకకాసైనా రాల్పరు. యిప్పుడుదెబ్బ కాఫీహోటలదే. నీచమనిదలంచక
లోబడితే మూడేండ్లకే మేడలు.

ఆం-పు-గీ॥ కాఫిహోటలకునువార ♦ కాంతలకును । చేతిగుడ్డలుపందిళ్ల ♦ చిత్రములకు ।
ఖర్చుబెట్టుదురట్టుల ♦ గాల్చమందు । బెట్టనొప్పరుసాదము ♦ బీదలకును ॥

గీ॥ ఆత్మవత్సర్వభూతాని ♦ యనెడువాక్య । మెవ్వరాలించరిప్పుడు ♦ హేళనమగు ।
భార్యబిడ్డలుసౌఖ్యము ♦ బడినజాలు । దిగులులేదికనెవ్వారే ♦ తీరునున్న ॥

గీ॥ సతతమభ్యాగతులపూజ ♦ సలుపుటయును యతిధిసత్కారమునువేడ్క ♦ నాచరించు ।
టెచటగనుపించదిప్పుడు ♦ హెచ్చుగాను । ద్రవ్యముండినపూజ్యుండు ♦ తప్పులున్న ॥

హా. "కాసులుగలవాడె రాజు గదరా సుమతీ" దుడ్డులేనివాడు దుగ్గానికిబనికిరాడు ధనమున్న కులగోత్రములుకలవాడే. ఇంకానయము మనస్త్రీలు స్వాతంత్ర్యులై ధనములజూచి భర్తల గట్టికొనుటలేదు.

మ-కు. కొందరు భాగ్యభోగ్యంబులు శాశ్వతంబులని కన్నుమిన్నుగానక విర్రవీగుచున్నారు. అట్టివారి కొకప్పుడు ధనమదాంధత్వముతగ్గి లోకముదెలసి పశ్చాత్తాపము బొందుచుండుట జూచుచుంటిమి.

"కం॥ సిరియును నాయువుగడున । స్థిరములుజముడదయుడిదివ ♦ దిన్నెలసియుజే ।
యరుధర్మముధర్మస్య । త్వరితాగతియనుపురాణ వచనమువినమే ॥"
యను భారతవచనము బరికించిన జాలును.

ఆం-పు. మనపూర్వుల ధర్మోపదేశము లోకపారిజూచిన వారిసర్వసమత్వము భూతదయ వారియాశీర్వాదములు తెలియగలవు "స్వస్తిప్రజాభ్యాంపరిపాలయన్తాం । న్యాయేనమార్గేణమహీంమహీశా । గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తునిత్యం । లోకాస్సమస్తాసుఖినోభవన్తు" యిందు ప్రభువులు న్యాయమార్గముచేత భూమిని పాలించుగాత సమస్తలోకములకు సౌఖ్యముకలుగుగాత యనువచనముల జూడుడు.

హా. నాకాయుష్యం నాకారోగ్యం నాకైశ్వర్యం నేను సుఖముగానుంటేచాలు నాకందరిసంగతు లెందుకు ఆర్యోపదేశము లిప్పుడెవరికిబట్టును పాశ్చాత్య సాంగత్యమువలన తమరనుభవించుటే మోక్షమని గ్రహించగల్గిరి.

ఆం-పు- గీ॥ శాస్త్రమొకవంకవర్తనా ♦ సరణియొకట ।
శీలమొకవంక నార్యులు ♦ జేయుటొకటి ।
సత్యమొకవంకమాటల ♦ చక్కియొకటి ।
ధర్మమొకవంకనొనరించు ♦ దారియొకట ॥

హా. దగ్గిరలేదుగాని యీపద్యమున కేమిచ్చినా యివ్వవచ్చును అచ్ఛాహై.

మ-కు. అన్నా నీవుజెప్పినది యదార్థమే.

ఆం-పు. ఇదియేనా ప్రతిదినము ద్విజులు భోజనారంభమందు "సత్యంత్వర్తేనపరిషించామి అమృతమస్తు" యని ఔపోసనబట్టి పిమ్మట భుజించుచుందురు.

మ-కు. భావమేమి.

ఆం-పు. సత్యముచే వర్తించుచున్నాను నేభుజించబోవు పదార్థము లమృతముగుగాక యనునర్థము బోధించుచున్నది.

హా. మనవారు పట్టిఅబద్ధములతో బ్రతుకుచారని అన్నమువద్ద ప్రమాణము బెట్టినారుగా. యీప్రమాణములు గిమాణము లిప్పుడేమైనవి. ఈయౌపోసనము నెరుగని వారివర్తనమే కొంతవరకు యదార్థముగానున్నది.



మ-కు-గీ॥ఇటులనన్నము చెంతను ♦ పటుతరముగ । బల్కుచుండెడిమంత్రము ♦ బాటవిడచి ।
సంచరింతురబద్ధపు ♦ సారమేమొ । కలిమహత్మ్యమొమనవారి ♦ కర్మమొధర ॥

ఆం-పు. ఇదియేన మావారు దేవాలయములలో గొంతులుపొంగారునట్లు అరచుచు చదివెడి మంత్రపుష్పార్థము వినియుంటివా.

మ-కు. వినలేదుగాని పెద్దగాజెప్పడము దెలసును.

హా. పెద్దగాన యింకాపెద్దగాన కొబ్బరిముక్కలకొరకు ప్రసాదముకొరకు.

ఆం-పు. "అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః" జగత్తునందు లోపల వెలుపల నారాయణుడున్నాడు. సర్వత్రా యిట్టిఅర్థమే గనుపించుచున్నది

మ-కు. ఆహా.

చం॥ పవనతనూజుడంచు ఫణి ♦ పావకులంచుగణేశుడంచు నా ।
రవియని దేవియంచురఘు ♦ రామషడాననులంచుపట్టుగా ।
శివుడనివిష్ణువంచునుతి ♦ జేయుటకంటెనువిశ్వమూర్తి స ।
ర్వవిభుపరాత్పరుణ్ హృదయ ♦ వాసుదలంచుట మంచిమార్గమా ॥

యదార్థముగాజూచిన సర్వమతముల జ్ఞానమార్గమొక్కటిగనే గనుపించుచున్నది "దేహోదేవాలయఃప్రోక్తః జీవోదేవస్సనాతనః" ఈదేహమే దేవాలయమనియు అందుండు జీవుడే యీశ్వరుడనియు ఉపనిషత్తులు దెల్పునట్టి యుపదేశము శ్రేష్ఠమైనది.

ఆం-పు. గురినిలువక దేవాలయములని మసిజిద్‌లని వెళ్లుటేగాని ఈశ్వరుడంతట నిండియున్నాడు.

హా. గురినిలుస్తుంది దేవళంబులలో నున్నంతసేపు ప్రసాదములకు మర్యాదలకు గుద్దులాటలే. పొరబాటువచ్చిన అర్చకులకు చంపదెబ్బలే.

మ-కు. మాలోకూడా "దేహోదేవాలయఃప్రోక్తః" యను మంత్రార్థమే "మసిజిద్ మె నకబ్బెమె నబుత్ ఖానామేనదేఖా-ఓఃజలోయిస్ మిట్టికే కోషానమే దేఖా" మక్కామసీదులలో నెచ్చటజూడని పరమాత్మ తేజమును యీమట్టిదేహములోజూచినాను. అని యొకభక్తుడు జెప్పియున్నాడు.

హా. మీరిరువురుబల్కిన మహావాక్యార్థభావము లొక్కయర్థమునే స్ఫురించుచు బాగాయున్నవి ఉపనిషదార్థములని జెప్పవచ్చును.

మ. ఇట్టి మంచిమార్గముల గ్రహించక వృథా గొడవలలోనికి దిగుచుందురుగాని ముక్తిమార్గముల నెంతమాత్రము విచారించరు.

హా. వృథాప్రసంగములచేతనైనా కాలముబుచ్చవలె లేకున్న చీట్లాట మొదలగు వాటిచేతనైనా ప్రొద్దుపుచ్చవలె తినిన యన్నమెటులరుగవలె.

మ-కు. సహోదరులు పృథగ్గోడవలులోనికిదిగి దుర్దశలంబడి కొట్టుకొనుచున్నను మీకేమియుబట్టవుగదా.

హా. బాగాగొట్టుకొని చావనిమ్ము. దేశారాధనపరుల మాటలువింటె యీతిప్పలెందుకువచ్చును.

బం. నాయనా తల్లులేమిచేయగలరు.

ఉ॥ శక్తికొలందివిద్యలను ♦ సాధనజేసిముదంబుమీరనా ।
సక్తినిభేదభావముల ♦ సహ్యముగాగనినైకమత్యమున్ ।
వ్యక్తితొబూనిమీజనని ♦ పాదములన్మదియందునిల్పిన ।
భక్తినిగొల్వుడీగలిక ♦ వర్ధిలిసేద్యమొసంగుభాగ్యముల్ ॥

హా. అమ్మా అటులజేసిన బాగుపడదా. దానికే నేమొత్తుకొనేది.

ఆం-పు. మాతా మేము మాదేశమాత మాటలలోనుండి సేవజేయుచుండిన మాకీగతులేలబట్టును ఆమె యాజ్ఞనుమీరి తిరుగుచుండుటచేతనే యవచాట్లు పడవలసివచ్చినది.

హా. తడిసిగాని గుడిశగట్టరు యింకాబడవలసినదే.

మ. నాయనా మీరవచాట్లు బడవలసిన బనియేమి తెలివిహీనులుగారే.

మ-కు. గీ॥ దేశనందనులందరు♦తెలివిగల్గి । యొక్కటయిసంచరించిన♦జక్కబడును।
నేర్పరులమంచుబొంగుచు♦నీతివదలి । పెక్కుద్రోవలద్రొక్కిన♦ బెంపుజెడద ॥

బం. ఇచ్చట భోజనాదులకు దృష్టిదోషముండుటయేగాక యనేకనడవడులున్నవటె.

హా. “అన్నంపరబ్రహ్మస్వరూపం” యనిజెప్పుటేగాని మరియేమిలేదు.

ఆం-పు. అనేకనడవడుకలున్నవి.

గీ॥ ఏకజాతిలోభేదమొ♦క్కింతగల్గి । సంచరించెడిపంచమ♦ జాతికొక్క ।
బావిలోనుండునీరముల్ ♦ బనికిరావు । గాంచుడీవిపరీతము ♦ కరుణమీర ॥

హా. ఓహో మాలమాదిగలకా నిజమే క్రైస్తవులలో చేరినపిమ్మట కూడా పాపము భేదములంతరించలేదు.

ఆం-పు. గీ॥ పంచములుగాకతక్కిన♦ప్రజలకెల్ల।నొక్కకూపోదకంబులే♦జక్కగాను।
బనికివచ్చెడినెంతటి ♦ భాగ్యవశమొ । తజ్జలముఘటంబొందిన♦దలతురంటు ॥

మ-కు. హైందవులలో లెక్కలేని కులభేదములున్నవి యెప్పటినుండి యేర్పడినవో దెలియవు. మాలో శేఖుల్ సైయదులు మొగలులు పఠానులు నాలుగుభేదములున్నట్లే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగువర్ణములున్నటుల శాస్త్రములందు గనుపించుచున్నది.



హా. అబ్బో మీభేదములకు మాభేదములకు చాలా వ్యత్యస్తముగలదు మాలోదృష్టిదోషమొకటి మైలన్నదియొకటి వీటికి మావెధవలు మరికొట్టుకచచ్చుచుందురు. ఈవర్ణవ్యవస్థలు దేశవినాశమునకేర్పడినవే వీనిచే ద్వేషాగ్నులు భగ్గుభగ్గుమని మండుచు ఐకమత్యభావాటవుల భస్మముజేయుచున్నవి.

ఆం-పు. చాతుర్వర్ణములుబోయి యష్టాదశవర్ణములు నిర్ణయింపబడి క్రమేణ యసంఖ్యాకవర్ణములేర్పడి పెక్కుమతంబులు ప్రబలి వాదభేదము లభివృద్ధియై దురాచారవ్యాపన మతిశయిల్లి దేశమును తల్లక్రిందుజేయుచు ప్రజలసోదరభావమును రూపుమాపుచున్నది వర్ణవ్యవస్థయే

హా. సోదరభావమును రూపుమాపినది యిప్పుడీకొంటకమందరిని రూపుమాపుచున్నది.

మాతలు. నాయనా నీవుజెప్పిన వాక్యములచే మాకడుపులు తరిగిపోవుచున్నవి మీతల్లిమాటలకేమోయని దలంచితిమి ఆమె యీగొడవలన్నియు జెప్పియుండలేదు.

ఆంధ్రి. ఏమొ దుఃఖసాగరమున మునిగి దేలుచున్నదానికన్నియు జ్ఞాపకములుండి జచ్చినవా.

హా. ఈవిచారసాగరమునుండి నీసంతతులింక నొడ్డునబడవైచదరులే.

ఆం-పు. సీ॥ ఆర్యసంతతిగాని♦యడవికొలమువారు, బావులంటగవచ్చు♦పట్టులేదు ।
పంచములంటును♦బాటించనిముసల, మానులదాకంగ♦నొనువేడ్క ।
నీచకులంబుల♦నెయ్యిసాహేబులమ్మ, గొనిత్రాగవచ్చును♦కుతుకమలర ।
వీధులచుట్టల♦వెదకిగైకొనిత్రాగు, చోరులునూతుల♦జేరవచ్చు ।
గీ॥ నార్యసంతతిలోజేరు♦నట్టివారు । బావినీటికినోచరు♦బనికిరారు ।
ఇట్టిచిత్రంబులెన్నని♦పట్టుతోడ । బలుకనేర్తునుసిగ్గగు♦భావమందు ॥

ఆం. నిజమువలుకుచుంటివి ఇట్టిమహోద్యమమునే నీసోదరులు గ్రహించియున్న నాకిన్ని కడగండ్లు రావుగదా.

హా. ఇంకనయ మిట్టిసంగతుల జెప్పినందులకిప్పుడు జగద్గురువుల బహిష్కారములు లేవు. వెనుక విధవావివాహములకు వెళ్లినందుకేగద స్వాములవారు వైశ్య సోమయాజిని బహిష్కరించినది పాపమాయన సమర్థుడుగాన స్వాములవారినే యపరాధిగా నొనరించెను.

ఆం-పు. నిజమువల్కియే నేమొనరించగల్గితి జాతినిర్బంధనమువల్ల పలువురమార్గముననే నడువవలసివచ్చెగదా నీపుత్రులందరేకమై దేశీయగీతోచ్చారణ జేసినప్పుడుగదా దురాచారపిశాచములు దేశమునువిడచి పలాయనమగుట.

మ. నాయనా నీప్రస్థాపన ముగిసెనా.

హా. చెప్పనిచ్చిన రెండురాత్రులు రెండుపవలులు చెప్పగలదు.

ఆం-పు. అమ్మా అప్పుడేనా.

సీ॥ మా దేశమునుండి ♦ పరివారకాంతల, పంటకంబులదిన్న ♦ వాసిచెడదు ।
మా దేశమునుండి ♦ మధ్యపాన మొనర్చి, నను జెల్లుచుండును ♦ ఘనతలన్ని ।

హా- దానికేమి అది అమృతము. గౌర్నమెంటు ఋణమెటుల దీరవలె.

మా దేశమునుండి ♦ మాంసము మెక్కిన, జాతిలోపూజ్యుడె ♦ సంతతంబు ।
మా దేశమునుండి ♦ మర్యాద నెంచక, నేరముల్గావింప ♦ నీతిపరుడె ।
గీ॥ దేశసేవకుబూనివి ♦ దేశములకు । జేరియందుండువిద్యల ♦ నేరిచిపరి ।
దిరిగివచ్చిన నేరంబు ♦ దృష్టిగనక । కుట్రలేమేమొ జేతురు ♦ కులముజెరప ॥

హా. సాగదములేదు పుట్టిమునిగినట్లే అయితే అభిప్రాయాన మీమాంసమను గ్రంథము లేదా; నోరుమూయించును.

బం. నాసంతతులు మాత్రము విదేశయాత్ర దేశాభివృద్ధికి హేతువని దలంచి ఖండాంతరములకేగి యున్నతపరీక్షలం జయమొంది వచ్చినవారిని గౌరవించుచున్నారు.

ఆం. నీపుత్రులెక్కడ వారిబుద్ధికుశలతలెక్కడ వారిజెప్పినచోట నాసూనుల వేళ్లైనా యెత్తుటకు తావులేదు.

హా. నక్కబోయిన తరువాత బొక్కమూసినట్లె. దేశారాధన మొనరించుచునే యున్నారు.

ఆం-పు. సీ॥ చీట్లసభ్లైకిగో ♦ మట్లతిప్పలు బెట్టు, గ్రామాధికారుల ♦ ఘనతమించె ।

హా. జీతము బత్తెములేని కొలువు. అయినా నయమున యడిగినకాసిచ్చునా.

ద్రవ్యంబులనుగాంచి ♦ తగవులదీర్చెడి, పద్ధతియతులకు ♦ పట్టుబడియె ।
ధనికులమాటలు ♦ దప్పైననొప్పని, బలుకువిద్వాంసులు ♦ ప్రబలిరెందు ।

హా. బీదలపట్టుబలికితే తడిరాలునా.

వృత్తిపన్నులనభి ♦ వృద్ధిజేసిననౌక, రీలకుజీతము ♦ ల్వేలువేలె ।
గీ॥ తామసాదిగుణంబుల ♦ తగులబెట్టి । పూర్ణభావంబుతోనున్న ♦ పుణ్యతముల ।
గాంచియున్నాదజనులంద్రు ♦ కడపసత్య । పూతలారబంగాళాది ♦ మాతలార ॥
సీ॥ శిష్యులవిత్తంబు ♦ చేకూర్చి వేశ్యల, కర్పించుగురులుస ♦ దార్యులైరి ।
రూకకునాలుగు ♦ రూకలుగా బెంచి, కొంపలార్చెడువారు ♦ గొప్పలైరి ।
తమ తెల్వినంతయు ♦ తగవులవెలిబుచ్చు, ధీరులు దేశోప ♦ కారులైరి ।
సుగుణసంపన్నుల ♦ శోధించితప్పుల, సూచించువారలు ♦ శూరులైరి ।
గీ॥ మంచికార్యంబులనుబట్టి ♦ మంటగల్పు । నట్టివారలుహితవాద ♦ దిట్టలైరి ।
వేషములులేనివారలు ♦ వెర్రులైరి । మహితబంగాళమహరాష్ట్రి ♦ మాతలార ॥



బం. బిడ్డా నీవు వివరించు విషయము లాశ్చర్యమును వ్యాకులమును బుట్టించుచున్నవి ఒకచెంపగొట్టిన పాలును ఒకచెంపగొట్టిన నెత్తురును గారు బాలుడవు నీకింత విజ్ఞానముబోడముట భవితవ్యశుభసూచకము.

హా. అమ్మా వాస్తవమెగాని భవితవ్యమెటులుండునో జూచిజూచి కన్నులులొట్టలుబడి పోవుచున్నవి.

ఆం-పు. బ్రహ్మాదులు జ్ఞానకాండయందు వర్ణమతభేదంబులుగల్పించి యుండలేదు మాయన్నలు ఉపనిషదాది ధర్మములనేగైకొని అనుచారంబునకు దెచ్చియున్న యెడ జాత్యంతరవర్ణభేదంబులు నశించి సోదరుల మనోభావంబులు నొక వ్యక్తియై విరాజిల్లి మాజనని నుద్ధరించియే యుండును. “మూఢయితీచః దేహ వర్ణాశ్రమకర్తృత్వభోక్తృత్వమమత్వాభిమానాహంకారభావనయారూఢో మూఢః” కర్తృత్వభోక్తృత్వకులాభిమానంబులు వహించువాడు మూఢుడని నిరాలంబోపనిషత్తు బోధించుచున్నది.

హా. బ్రతికియున్నంతవరకు అంతా మాదే జచ్చినమీద యేమౌనో, కట్టుకబోయ్యేవి పుణ్యపాపములే. దేహములు క్షణభంగురములు.

ఆం-పు. “నచర్మణోనరక్తస్య నమాంసస్యనచాస్థినః నజాతిర్మాతనోజాతివ్యవహారపరికల్పితాః” చర్మరక్తమాంసాదులన్నియు మానవులందరియం దొక్కటియే యనియు జాతులు కల్పనలని ఉపనిషత్తులు జాటుచున్నవి వేదాంతులు జాతిమతభేదములు జ్ఞానులకు లేవని జెప్పుచు అనుభవములోనికి దేశ మాయమాటలు పలుకు గురుశిష్యుల నేకులుండియున్నారు.

మ-కు. సత్యము పురాణవైరాగ్యులు ప్రసూతివైరాగ్యులు స్మశానవైరాగ్యులే గాని యదార్థవైరాగ్యులు గనుపించుటయరుదు. జ్ఞానులు నివురుగప్పిన నిప్పుమాదిరిగా గనుపించకుందురు. దెలసికొనుట దుర్లభము జ్ఞానులు దేహాభిమానమును వదలి చిద్వస్తువునుదర్శించి ముక్తికాంతా క్రీడావినోదంబుల దేలుచుందురు.

హా. మనముమాత్ర మూరకుంటిమా వారకాంత క్రీడాసల్లాపములు లేవా.

బం. ముక్తికాంతాసంయోగులకు ప్రపంచముతో బనియేమి.

మహా. గీ॥ పుత్రవైరాగ్యములు నాల్గు ♦ బొందుపరచి । బల్కితివి వాటియర్థము ♦ భావమునకు ।
బోధపడకుండ జెప్పుము ♦ పూర్ణముగను । వీనులకువిందుగానతి ♦ వేడ్కమీర ॥

మ-కు. గీ॥ వినిపురాణార్థములనవి ♦ విశ్వసించి । దాల్చివైరాగ్యమచ్చట ♦ ధామములకు ।
జేరియదిజ్ఞప్తిలేకసం ♦ సారజలధి । రహిమునుంగపురాణవై ♦ రాగ్యమంద్రు ॥

హా. గాంధిగారి యుపదేశములు విన్నాను యింటికివచ్చి మరచినాను ఇదియే నావైరాగ్యము. ఇది పురాణవైరాగ్యములోనే జేరవచ్చును.

సీ॥ ప్రసవకష్టమోపగలేక ♦ పణతులంత । రతులసౌఖ్యంబులెల్లవ్య ♦ ర్థంబులనుచు ।
బూనివైరాగ్యమానీద ♦ పురుషులగని। భ్రాంతినొందప్రసూతివై ♦ రాగ్యమంద్రు॥

హా. ఇది నాకనుభవములేదు. భార్యాకు తెలసియుండవచ్చును.

గీ॥ శవముగొనిపోవుచునుబంధు ♦ జనులు నేడు । నింటిలోరేపుమంటిలో ♦ నేమిశాశ్వ ।
తమనిగృహమేగిదగయీష ♦ ణములదేలి । భ్రాంతిజూడస్మశానవై ♦ రాగ్యమంద్రు॥

హా. ఏమి జచ్చినదాక బ్రతికేదే.

గీ॥ శ్రవణమనననిధిధ్యాస ♦ లవధరించి । వాసనాత్రయమంటక ♦ వసుధమిధ్య ।
యనుచుసర్వవివర్జితు ♦ డౌచు వెలుగ । నదియదార్థవైరాగ్య ♦ మంద్రుబుధులు ॥

అం-పు. అమ్మలారా జడలుదాల్చిక బైరాగులమని దిరుగువారందరు వైరాగులుగారు సర్వసంగపరిత్యాగులు వేరు.

మహా. బిడ్డా.

గీ॥ నీదుజ్ఞానముజూడగ ♦ నీదుబుద్ధి । గనినసంతోషమిచ్చెడి ♦ కాంతదేవ ।
హూణతికపిలునిగన్నట్లు ♦ బ్రీతియాంధ్రి । సోదరీమణిగనెనిన్ను ♦ చూడజనులు ॥

బం. యదార్థము.

మహా. ప్రస్తుతము వేదాంతవేత్తలు లేరా.

అం-పు. లేకేమి. యెల్లెడల నిండియున్నారు. పొట్టకూటికై వైరాగ్యవేషంబులు ధరియించి త్రయీషణంబుల జిక్కి వాదభేదబోధనకుశలులై సంచరించు ధనాకర్షణగురువు లనేకులుండియున్నారు వారివర్తనములే పరిశుద్ధవేదాంతమతమునకు కళంకము దెచ్చిపెట్టుచున్నవి.

హా. మాట్లాడితే వేమనపద్యములు క్రియాశూన్యము.

మ-కు. గురువులనిన సామాన్యముగాదు కాషాయవస్త్రములు ధరించినంతనె సర్వసంగపరిత్యాగికానేరడు.

చం॥ భ్రమరముకీటకంబుగస ♦ బ్రాణముబోసియువెడ్క జంచరీ ।
కముగనొనర్చుభంగికుతు ♦ కంబునశిష్యులదుర్గుణంబులన్ ।
క్రమమునబాయజేసితన ♦ కార్యములన్గొనుచుండిబిమ్మటన్ ।
తమవలెజేయునట్టివర ♦ దాతలుగుర్వులులోకమందునన్ ॥

సద్గురువులు లభించుటయే దుర్లభము అట్టివారున్నను సచ్ఛిష్యులు దొరకుటయు దుర్లభమే.

బం. జ్ఞానోపదేశమున కందరర్హులేనా.

మ-కు. ‘‘నహిజ్ఞానేనసదృశం వినామోక్షేనసిధ్యతి’’ జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిర్నభజతిజనస్మితేన భజగోవిందం’’ జ్ఞానసంతుకు కానిది మోక్షము సిద్ధించదు



జ్ఞానులన్నివర్ణములలో నుండియున్నట్లు వాల్మీకి మొదలయ్యినవారి చరిత్రలవల్ల దెలియుచుండుటలేదా.

గీ॥ వామనుడుగానిమాదిగ ♦ వాడుగాని । శబరకంకకిరాతక ♦ చయముగాని ।
బాలబాలికయువకులు ♦ మాలగాని । యర్హుడౌజ్ఞానమొందగ ♦ నమ్మలార ॥

హా. ‘‘ఖర్వోహ్రస్వశ్చవామనః’’ ఓహో వామనుడన పొట్టివాడా. పొట్టిఅయితేనేమి పొడవైతేనేమి ప్రజలందరు జ్ఞానోపదేశమునకర్హులే. నేనిటుల బ్రతికితేజాలును ఉపదేశముకాగానే గురువులొచ్చి యింటిమీద కూర్చుంటారు ఆతంటాలునాకెందుకు తోచినవరకు కృష్ణా రామ గోవిందా యనుకుంటాను. ఆపైన స్వర్గమో నరకమో కర్మనుబట్టియుండును.

అం-పు. వామను డదితికుమారుడుగాదా.

మహా. ఔను.

గీ॥ దేవతలమాతయదితిసా ♦ ధ్వీమతల్లి । కశ్యపునిభార్యవామను ♦ గనుటకేమి ।
కారణమొవింటివమ్మబం ♦ గాళదేవి । కర్ణములకింపుగానుండు ♦ గాంచధాత్రి ॥

బం. అటులయిన విన వేడుకగుచున్నది జెప్పవమ్మ.

మహా. బలిచక్రవర్తి యుద్ధమందు దేవతలచే యోటువడి శుక్రునియనుగ్రహంబున విశ్వజిద్యాగమొనర్చి యగ్నిభట్టారకువల్ల కవచతూణాది సాధనంబులంగొని సేనావృతుడై యమరావతి ముట్టడించ భయమొంది దేవతులు పలాయితులైరి బలి యింద్రసింహాసనం బధిష్ఠించి రాజ్యపాలనముజేయుచు శతక్రతువులొనరించుచుండె అదితి తనబిడ్డలు రాజ్యభ్రష్టులై యిడుముల బడుచుండుటకు సహించక పతియనుమతిన బయోభక్షణవ్రతమాచరించి శ్రీహరినిదర్శించి వరము గైకొనియె నంత నారాయణుం డదితిగర్భంబున వామనుడై జనించి మూడడుగుల దానము బలినడిగి గైకొని ముల్లోకంబు లాక్రమించుకొని దేవతలకు రాజ్యమొసంగె.

బం-గీ॥ అదితిదేవియదృష్టమే ♦ మనగవచ్చు । నలపయోభక్షణవ్రత ♦ మాచరించి ।
పదియురెండగుదినములు ♦ భక్తిమీర । దేవదేవునిదర్శించె ♦ దిగులుమాని ॥

హా. పాపము బలి పట్టిపిచ్చివాడు శుక్రాచార్యుడు వామనుని కపటవృత్తినంతయు జెప్పినను ముల్లోకములదారవోసె. అయితేనేమి పాతాళంబున యింతకంటె సుఖముగానెయున్నాడు వానిద్వారమున శ్రీహరి సదాబడియుండవలసివచ్చె యెవరికర్మవారిది. అయినా భక్తరక్షణపరాయణుడుగాన తనభక్తునింటనటు లున్నను తప్పులేదు.

బం. నీకిక సందేహమేలనమ్మ.

గీ॥ అదితియట్టులనీవునో ♦ యాంధ్రదేవి ♦ భక్తవత్సలుడైనశ్రీ ♦ వాసుదేవు ।
గూర్చివ్రతమొనరించుము ♦ కుతుకమలర । నతడవతరించికరుణకా ♦ మితములొసగు॥

మహా. నిజము సోదరీ భాగ్యభోగ్యంబులు జయాపజయంబులు దైవాధీనంబులగుటచే భిక్షుకునిగా నొనరించినను బెన్నిధిగాజేసినను ఈశ్వరుడే యొనరించవలె గావున నీవీ దినంబు మొదలుకొని బదరీనారాయణు నారాధించు మాదేవుడు నీసుతులరక్షించగలడు పూర్వము నాబిడ్డడు భవాని సేవించి యామెయనుగ్రహంబున దేశపాలన మొనరించియుండలేదా.

బం. ఆహా వాస్తవము.

కవిరాజవిరాజతము.

హృదయమునందిదిబాగుగనున్నది ♦ యీశ్వరునాత్మనివాసునియం ।
బుదతనుసద్వ్రతమున్ననిబూనుచు ♦ ఘూర్ణతరంబుగజేసినయా ।
సదమలుడౌహరిదీనదయాళుడు ♦ చక్కగగన్పడిభాగ్యములన్ ।
పొదలగజేయునుదుర్దశలార్పుచు ♦ పుత్రులకందరికిస్థిరణిన్ ॥

ఆంధ్రి. అక్కలారా విశ్వసనీయములైన మీవచనము లమోఘములుగావచ్చును సందియములేదు నేనీదినంబునుండి భారతఖండాధినాథుడైన బదరీనారాయణునిగూర్చి వ్రతమొనర్చి యారాధించెద ముంచినను యతడేముంచవలె తేల్చినను యతడే తేల్చవలె. పతియాజ్ఞ యెటులుండునో.

హా. దినములు మంచివైతే బుద్ధితగినట్లు నడుచుచుండును ఇదియొక మంచిమార్గమే.

బం. పుత్రులారా.

మానినీవృత్తము.

మీరునుమీదగుసోదరులందరు ♦ మిక్కిలిభక్తినిచిత్తములన్ ।
చారణసిద్ధమునీశ్వరవందితు ♦ చారుగుణార్ణవుకేశవుసా ।
కారుననారతమున్భజియించుడు ♦ గల్గునుభాగ్యముకోటకముల్ ।
దీరు సుభిక్షముగానలరారుచు ♦ దేశముగాంచుసమున్నతమున్ ॥

మ-కు. సంతోషము సంతోషము.

సీ॥ తల్లులమాటలు ♦ తలనిడుకొనసట్టి, పాపడుగనపెద్ద ♦ బండగాడె ।
తల్లులమాటలు ♦ తలనిడుకొననట్టి, కొమరుడెన్నగరాతి ♦ గుట్టగాడె ।
తల్లులమాటలు ♦ తలనిడుకొననట్టి, తనయుడుగాంచపా ♦ తకుడుగాడె ।
తల్లులమాటలు ♦ తలనిడుకొననట్టి, సూనుడారయపెద్ద ♦ మానుగాడె ।



గీ॥ తల్లిమాటలనేప్రొద్దు ♦ నుల్లమలర । వినిజరించనిబిడ్డడు ♦ వెర్రిగాడె ।
తల్లిమాటలనేప్రొద్దు ♦ తలనిడుకొని । పుడమిదిరుగనిసుతుడెంచ ♦ జడుడుగాడె ॥

తల్లులు. బిడ్డలారా మేము గెరుపవలసిన విషయములు మీరే గ్రహించితిరి దీర్ఘాయుష్మంతులరై భాగ్యసంపన్నులరై వర్ధిల్లుడు మాతసేవాపరులరై యశోవంతులరై యలరారుడు సుఖీభవ, సుఖీభవ, సుఖీభవ. (ఆంధ్రినుజూచి) సోదరీ నీసంతతుల దుర్దశలకు జింతిల్లక భక్తిశ్రద్ధలతో మనతండ్రి బదరీనారాయణు నారాధింపుము ఆదేవుడు తప్పక నీసుతుల రక్షించగలడు.

ఆం. మంచిదమ్మలారా మీరరుదెంచుటచే నేధన్యురాలనైతి మరలెన్నిటికో మిమ్ముల జూచుభాగ్యము.

మాతలు. ఈశ్వరానుగ్రహమున్నయెడ యెప్పుడైనను జూచికొనగలము సంతోషముతోనుండుము పోయివచ్చెదము. (నిష్క్రమింతురు)

హా. (అటుయిటు పారజూచి) జనకుడు వచ్చుచున్నట్లున్నది నాహాస్యమిక సాగనేరదు యిచ్చటున్నయెడ రెండుచీవాట్లతో నోటికిబుద్ధిజెప్పుచాడు. జననీ శలవొసంగుము పోయివచ్చెద (నిష్క్రమించును)

ప్రవేశము – ప్రబుద్ధి.

ప్ర. ఉ॥ మక్కువమీరనీదగుకు ♦ మారులనేమములెల్లవేడ్కనీ ।
యక్కలుజెప్పుమంచనిద ♦ యన్ననిగోరిరెప్రాణనాయకీ ।
చక్కగనీవువారిసుత ♦ సంతతిసత్కుశలంబువింటి వా ।
ఫక్కినెరుంగవీనులకు ♦ పండువుగావెసదెప్పుమంతయున్ ॥

ఆం. ఏమెు రాకరాక మాయక్కలు వచ్చినందుకు సంతోషముగా కాలముబుచ్చునట్టి యదృష్టము లేకబోయెనుగదా నాసంతతి కష్టములు వారికిజెప్పి విచారమందడము నామనోవ్యాకులంబుగని వారు చింతించడముతోనే కాలముబోయినది దిగులుతో యేమేమెు జెప్పుచున్నంతలో యీకుమారులు ప్రవేశించి కొంతవరకు సోదరకష్టములు పూసగ్రుచ్చినటుల జెప్పియుండిరి మధ్య పాంచాలసోదరీపుత్రుడే తెంచి యచ్చట పాలనాధికారుల నిరంకుశప్రభుత్వదురంతములు నిర్హేతుకముగా ప్రజలను పేల్చినవిషయములుజెప్పి జనెను. నాకష్టములేగాక యీమె సంతతికష్టముల వినినంతనె గుండెపగిలిపోయినది.

ప్ర. పాంచాలాధికారులు గావించిన ఘోరకృత్యములు దెలియవచ్చుచునే యున్నవి స్వాతంత్ర్యమునకై యెదురుజూచుచుండ కష్టములెదురొక్కనుచున్నవి అయనను ‹‹ కష్టేఫలే ›› కష్టముపడనిది యేఫలమునందలేము.

గీ॥ కష్టపెట్టియునామీద • గాచుభక్త । వితతికృపతోడనాహరి • వేడ్కమీర ।
స్వపరిపాలనమనకల్లె • శక్తిజూచి । యొసగబూనిరొ ప్రభువులు • కుసుమనేత్రి ॥

వాస్తవముగా కష్టపడిసంపాదించిన ధనమునిలచునుగాని, ఊరకేవచ్చిబడినది నిలువనేరదు మనము స్వపరిపాలనకొరకెంతకష్టమైనను బడవలసినదే మీరు మాట్లాడినవి పుట్టమీది పురముమీది వార్తలే నాకుమారసోమరితనములు అన్నవస్త్ర కష్టనివారణోపాయములేమయినా ఆలోచించితిరే.

ఆం. గీ॥ ముచ్చటలలోనవామన • మూర్తినదితి । వడసిసంతతికష్టము • బాపినట్టి ।
చరితమెల్ల్వ డెనట్టులే • సల్పివ్రతము । కలిమిపుత్రులకొసగగా • బలికెచెలులు ॥

ప్ర. ఓహో అదితికశ్యపునాజ్ఞచే ద్వాదశదివస పయోభక్షణవ్రతమొనరించి రాజ్యము గోలుపోయిన సుతులకు మరల రాజ్యపదస్థుల జేసినది యదార్థమే.

ఆం. అదితి యట్లేనను బదరీనారాయణునిగూర్చి వ్రతమాచరించి ప్రత్యక్షమొనరించికొని ఏవిధమునైనా మనసంతతుల కష్టములదొలంగించుటకు వేడికొని కృపవడసెద నాకనుజ్ఞయొసంగుము.

ప్ర. గీ॥ సుతులకష్టమువాపగా • జూచుకంటె। నెక్కువైనట్టిసత్కార్య • మేదిగలదు ।
వనితరోనీవుకోరిన • వ్రతముసల్ప । గాననుజ్ఞనొసంగితి • గలుగుమేలు ॥

ఆం. సంతోషము నావ్రతప్రయత్నమున కేగుచున్నాను.

ప్ర. మంచిది. (అంధ్రినిష్క్రమించును)

ఉ॥ నందనులారమీరుసుగు • ణంబులగాంచియశంబుమీరము ।
న్నందుగవస్తునిర్మితసు • బోధమెరింగియుకర్మశాలలం ।
దందునవిల్పిసోదరజ • నాళికిసేర్పుచునెల్లవిద్యలన్ ।
పొందునుగల్గిసర్వమత • పుర్షులకెల్లసుఖంబొనర్చుడీ ॥

(అందరు నిష్క్రమింతురు)

ఇయ్యది వైశ్యకులపారావారసుధాకర శత్రువర్గభీకర గ్రంధివంశ కౌండిన్యసగోత్ర పవిత్ర తాతయార్యదుహిత్ర బసవయ సుబ్బమాంబాప్రియపుత్ర సజ్జనమిత్ర బంధుజనాప్త వెంకటసుబ్బరాయగుప్త విరచితాంధ్రిమాత నాటకంబున చతుర్థాజ్కము.

---

# ఆంధ్రమాత - పంచమాజ్కము.

---

(బదరికాటవీప్రదేశము. ప్రవేశము - బదరీనారాయణుడు)

బద. ఇకనైనా సాక్షాత్కరించకుండుట ధర్మముగాదు. ఆపుత్రిక స్త్రీకరణశుద్ధిగా నావ్రతంబు సల్పుచున్నది సైశమప్రత్యక్షమై నాకుమాంశ యభీష్టంబు లొసంగవలయును ఆచిన్నది బహుశా పుత్రకష్టముల బాపుటకేయని దోచుచున్నది. (చప్పుడు నాలకించి) ఎవరోవచ్చుచున్నట్లున్నది. (యోగకుండును).

ప్రవేశము - వ్యాసుడు. (స్వామియెదుటనిలచి)

పాదసవృత్తము. శ్రీధరభక్తవ • శీకరలోకా । రాధితమూర్తివి • రాజితధీరా ।
మాధవకేశవ • మానివిచారా । శోధితవైరివి • శుద్ధచరిత్రా ॥

పద్మనాభవృత్తము.

నారాయణాదేవదేవాపరేశాజ • నస్తుత్యమానేంద్రపద్మోద్భవాసా
ధీరాహృషీకేశమార్తాండసంకాశ • దివ్యప్రభాపానిరాధారసారా ।
నారాయణారీజయానంతనిర్లేప • సర్వాత్మవేదాంతహృద్యాత్రిలోకా ।
ధారాధరేశాగణాతీతసద్దివ్య • ధామాసుపర్ణాణపాలాధురీణా ॥

(మౌనములోనిలిచియుండును) ప్రవేశము - సూతుడు.

[illegible]. పరమపూరుషవాసుదేవప్ర • పంచనాయకశ్రీధరా ।
[illegible]నార్దనపద్మనేత్రమ • హాత్మభూరిగుణార్ణవా ।
[illegible]యాకరము క్తిదాయక • వాదభేదనివారణా ।
[illegible]గణునీకిదెపాపనాశన • [illegible]ంఖచక్రగదాధరా ।

సాష్టాంగనమస్కారమొనరించి నిల్చబడియుండును.

(ప్రవేశము - శౌనకుడు చేతులుజోడించుకొని)

సుగంధి వృత్తము.

శ్రీరమాహృదబ్జవాస • దివ్యశ్రీకాకోకేశవా । భూరిభావదీప్యమాన • [illegible]
పారమార్థచింతన ప్రప • [illegible] । [illegible]భీకరా [illegible]

బద. (నవ్వి) శా॥ పుత్రీ యేనవతారమెత్తుటకు సం ♦ పూర్ణంబులౌ కార్యముల్ ।
ధాత్రీమండలమందు లేపు మరియోర్ ♦ ధర్మంబు రక్షింపగన్ ।
పుత్రాధీశుల దేశభక్తులను సం ♦ పూర్ణప్రభాభాసులన్ ।
పాత్రాపాత్ర విచారదీక్షు పరులన్ ♦ ప్రావీణ్యులన్నిచ్చితిన్ ॥

హైందవభూమికి సేవ జేసెడి పెద్దరబర్ హ్యూము సర్ విలియం కాటన్ మొదలగు ఆంగ్లేయ ప్రముఖుల బ్రసాదించియుంటిని నీ సంతతులు బాగుపడి వృద్ధికి రానున్నారు ఈ స్వల్పకార్యమునకే నవతరించబని లేదు.

సీ॥ భేషజపద్ధతుల్ ♦ బెంపొంద జేసెడి, పుత్రులు కొందరు ♦ బుట్టియుండె ।
ఘనతర చిత్రలే ♦ ఖనములు వ్రాసెడి, పుత్రులు కొందరు ♦ బుట్టియుండె ।
పన్నెం బెట్టుచు భాష ♦ వ్యాపింప జేయగ, పుత్రులు కొందరు ♦ బుట్టియుండె ।
శిశుపోషణము జేయ ♦ క్షీరదాన మొనర్చు, పుత్రులు కొందరు ♦ బుట్టియుండె ।

గీ॥ దేశదేశంబులను కీర్తి ♦ దెచ్చునట్టి । ఘనుడు వైమానికుడొకండు ♦ గల్గియుండె ।
భక్తి నీ సేవ జేసెడి ♦ ప్రాభవ సుతులు । బుట్టియుండిరి మీదటు ♦ బుట్టగలరు ॥

కుమారీ ఆంధ్రసామ్రాజ్యము నుద్ధరించుటకై నీ సూనులలో కొందరు ప్రయత్నమొనరించుచున్నారు కొందరు స్వార్థత్యాగ పరాయణులు బయలుదేరి సోదరుల మేల్కొల్పి కర్తవ్యాంశముల నుపదేశించుచున్నారిక నీకేమి కొదువ నీ సంతతులభివృద్ధి జెందగలరు విచారపడవలదు నీబిడ్డలయవచాట్లు భూదేవి నాకప్పుడప్పుడు దెలుపుచున్నేయున్నది. పుత్రక్షేమాభిలాషివై యుండుము.

ఆం. గర్భసంతతులు దుర్భరంబగు కష్టములంబడి జిక్కుచుండ నాకెట్లు నిద్దురబట్టును భవదీయ కరుణాకటాక్షములు మాపైనున్నయెడల మేము సురక్షితముగా నుండగలము.

బద. గీ॥ పుత్రికలపైన తండ్రికి ♦ పూర్ణకరుణ । లేకయుండునె జూడ నీ ♦ లోకమునను ।
దలచకటులెన్నటికిమది ♦ ధర్మమగునె । ప్రేమలేని దిబిడ్డల ♦ జెంచుటెట్లు ॥

---

ఈ యద్వైత వ్యాపనమొనర్చినది పండిత డి. గోపాలాచార్యులు చిత్రలేఖనమున పేరందినది. ఆష్టూరి రామమోహనాదులు ఆంధ్రభాషనలంకరించినవారు పిఠాపురం మహారాజా మొదలగువారు బిడ్డలకు పాలధర్మము జేసినవారు. కలువల రామానుజ తణ్ణున్ సోదరులు వైమానికుడు సిరాం వెంకటసుబ్బయ్యశాస్త్రి.



ఆం. ఈనిడ పెద కుమారికా వ్రతంబునను మెచ్చి ప్రత్యక్షమై కామితంబులొసంగితివి నా సంతతులకై లౌకికత్వదశలందు సూచనల బ్రసాదించితివి నా విచారమును బాపి రక్షించితివి పరమానందము.

బద. సుఖీభవ సుఖీభవ సుఖీభవ (అనుచు నిష్క్రమించును).

ఆం. గీ॥ తండ్రి జెప్పిన యట్టుల ♦ తనయులికను। నిద్రమేల్కొని విద్యల ♦ నేర్చిమాత నైన నాదగు దుఃఖంబు ♦ నార్పవచ్చు । బాగుపడవచ్చు దుర్దశల్ ♦ బాసి ధరణి ॥
సర్వసంతతులకు శుభమగుగాక ఇదియే నా యాశీర్వాదము. (నిష్క్రమించును)

(ప్రవేశము.- నవీనకర్త, సనాతశాస్త్రి.)

స. నవీనా మన ఆంధ్రప్రముఖుల శక్తిసంబు లేమి.

న. నీ వెరుగని సంగతు లేమున్నవి మొదట యే మాత్రమైన తలకెత్తదమని కొందరు దేశభక్తులాశలజూపించి యున్నతోద్యోగములు లభించగనే వెనుకటికృత్రిమ మంతయు బయల్పడ బ్రవేశించి పాలలో విషము గల్పినట్లు ప్రజలను భంగపరచు మహానీయులు గలరు గదా.

స. ఒక పక్షములోనుండి వేరొక పక్షమున సహాయమొనర్చు విమర్శను లందందు గలరు అయినా నా పంచాంగము లేమి నా దేవతార్చన లేమి నా కెవ్వియు బట్టనేరవు. ననవ నాగరికులకు యిాపిల్లగోచులు పిలకాపిరేఖలు యిాజట్లు యిాబొట్లు యిాసంధ్యలు బనికిరావందురేగాక పరిహాసము జేయుచుందురు ఏను కొంతవారికి వెరచియే వీధులకే బయలుదేరుటలేదు (మానేనకలహం నాస్తి) ఎవరేమనుచున్నను తలవంచుకొని బోవుచున్న యే దిక్కులేదు దోసము లేని వారికి మోసము లేదు.

స. పాఠశాలలందు పరమతబోధనావ్యాసంగములుండుటచే మనవిద్యార్థుల కీబుద్ధులు బుట్టుచున్నవి. న్యూ-లేడ్ బాయస్ (పాఠశాలవిద్యార్థు) లనిన మహామహులు వారే భయపడుచున్నారు. భటువర్గములిక వస్త్రములందే మాత్రవిస్తరణ మొనరించుకొనుచున్నారు. మంచిగాని చెడుగాని విద్యార్థులంతా ఒకకట్టు బడయుత్వముగానిక ఎట్టి కార్యమైనను కరతలామలకముగదా.

సనా. గీ॥ ఎంచిచూసినను జెల్లమువంచిదైన । యితఁగు లేమిచేయఁగలఁడు క్షీతితలమున ।
మార్గములమన బాలురు మంచివార । లైన రొండనొరు లేమి జేయంగనొప్పు॥

పరమత ధర్మబోధనలవల్ల మన బాలుర కీబుద్ధులు గల్గుచున్నవని వివరించితివి సరే మనబాలుర సాంగత్యమువలన మనయాచారప్రవర్తనాదులు వారికేమయినా బట్టుబడుచున్నవా.

నవీ. లేదు మనకుబట్టిన దుర్దశ లనేకములున్నవి మనపెద్దలుమాత్రము మంచివారా.

గీ॥ మనదుపంచమసోదర జనులబట్టి । మాయ జేసియు క్రైస్తవ మతమునందు।
కలుపుకొను చుండె మనవారు గనులజూచి। సంఘబలమును గాపాడ జాలరైరి॥

సమస్తావయవములలో నొకటి లేకున్న నెంత వెలితిగానుండునో మనవర్ణములతో నేరులేకున్న నంతస్థాలిత్యమనుటకు సందియము లేదు.

స. నీవుతికూడా కొద్దికొద్దిగా తిరుగుచున్నట్లున్నదే పలువురవిద్యార్థుల మానసశక్తులు నిన్నారికర్షించుచున్నవి పాపము నీవేమిచేయగలవు.

నవీ. వాస్తవముగా వారు మనబాలుర జుట్టు నుంచుకొనవద్దని లేబొట్టుపెట్టుకొనవద్దని శాస్త్ర కార్యక్షింగు లుంచుకొనవలనిబోధించిరా బలవంతముగా బైబిలును చదివి మతభ్రష్టులగమ్మనిరా లేదు మనయున్నతోద్యోగులు గొప్పవేతనముల వడయుటకు దొరల స్నేహితము సంపాదించుటకు ఆంగ్లేయ వేషముల ధరించు చున్నారు. వారినిజూచి విద్యార్థులనుసరించుచున్నారు. పాపము శీతలదేశములోధరించు దుస్తుల నిచ్చటధరించి భరించలేక యుడికి దేహముల బాధు చేసికొనుచున్నారు.

స. అటులనా ముందుమనవారికి బుట్టినగుణమేనా సరే.

గీ॥ క్రీస్తుమండలి నెవరైన । బ్రిస్తుతమున।మనదుమాయకులర సెడి । మార్గములను।
గలసిసాయంబుజేయఁగా । దలచినారె । వినదలంచితి జెప్పుము । వీనులలర ॥

నవీ. మొన్ననమొన్న నే మహాత్మగాంధికి మిస్ పీటుర్సను వ్రాసినదివింటె తెలియఁగలదు.

స. వినదలచితే యడిగితిని.

నవీ. అటులనా క్రైస్తవులుకూడా మీతో చేయులుగలపి దేశగౌరవమును క్రీస్తుగౌరవ



మును నిలువబెట్టిన యెంతబాగాయుండును నాకు తుర్కీ విషయమై అభిమానమంతగాలేదు గాని హిందూదేశముకొరకు నేను పరితపించుచున్నాను సహాయనిరాకరణమవలంబించుటదప్ప హిందూదేశమునకు వేరొకమార్గము గనుపించదు నిజమగు క్రైస్తవులెల్లరును హిందూదేశముతో సానుభూతి జూపెదరనుటకు సందియములేదు.

స. మిస్‌పీటర్సన్ అను యువతిజెప్పిన వాక్యములా.

నవీ. ఔను.

స. మనభారతభూమిపై నిప్పుడిప్పు డాంగ్లేయస్త్రీలకుకూడా సానుభూతి జనించుచున్నట్లున్నదే.

నవీ. సత్యము గోచరమైనపిమ్మట దయారసజ్ఞు లూరక నుండరా పంజాబు ఘోర దురంతము లొనరించినవారిని కొందరాంగ్లేయప్రముఖులు చీవాట్లు పెట్టియుండలేదా.

స. అటులనా సరే మంచిది. ఆంధ్రప్రముఖుల వర్తనంబుల నడిగితిని దానిని మరచినట్లులున్నదే.

నవీ. (జ్ఞాపకముదెచ్చికొని) ఓహో ఔను.

గీ॥ ప్రముఖులొకకొందరాంధ్రులు । భక్తిమీర । తల్లినరయఁగతపములు । దానములను।
త్రివిధదీక్షలబూనుచు । దృష్టిమీర । సల్పుచున్నట్లు దెల్లసెడి । శాస్త్రివర్య ॥

స. ఇప్పటితపములు దీక్షలవల్ల ప్రయోజనమేమి. ఆచారలోపము విప్రభోజనశూన్యము

నవీ. మనబాపలకేబేటమని శాస్త్రమా.

సనా. "బ్రాహ్మణానామనేకత్వం" మనలోమనకే యిటులుండ నితరజాతులనగు ద్రొక్కుట ఆశ్చర్యమా నిన్ననినఫలమేమి గౌతమశాపము మనలవేధించుచున్నది.

నవీ. పూర్వాచారపరాయణులను నూతనాచారపరులకిదియే భేదము మానవులందరు సహోదరులే త్సరబ్బ భాపిడితు డేజాతివాడైన నన్నోదకంబు లొసంగవలసినదే. "అంత్యజాతిర్ద్విజాతిశ్చ ఏక ఏవసహోదరాః ఏకయోనిప్రసూతత్వాత్ ఏకశాఖేనజాయతే" అదిమాంతవాతు లెల్లరును మాత్రయోనిజనితులైనందువలన సహోదరులే ఒక్కజాతివారే వర్ణభేదములేదు "సర్వేజనానాంమనుఃపితా" సర్వులకు మనవు పితరుడని యీవెరింగినదేగదా.

---

ఉపనిషత్సారరత్నావళి పు 182.

సహా. చం॥ దనరెడుజాతులన్నియు నయ ♦ భావిధిగా ధరమాత్రయోనిసం ।
జనితులటంచుబల్కితివి జాలు ? ♦ సహోదరులొక్క శాఖవా ।
రనిమదిలోదలంచియటు ♦ లారసి ప్రేమసమానబుద్ధితో ।
గనిభుజియించుచుంటివెస ♦ ఖా? భయమందక వారిగేములన్ ॥

గీ॥ తమ్ముతేరైనసీళ్లుసా ♦ దమునుపాలు । నేతులను డాకవెందుకు ♦ నీతియేన ।
పుడమివాక్యములొకవంక ♦ నడతలొక్క । భంగిగన్పడుచుండును ♦ ప్రజలయందు॥

న. పూర్వాచారపరాయణుల నిర్బంధనవల్లను జాతిశిక్షణచేతను ద్విజేతరులు చాలా వరకు మద్యపాన మాంసాహారులగుటచేతను వారిండ్లగుడుచుటకు వెరచుచున్నాను వారును మధుపానమాంసభక్షణముల వదలినప్పుడు సమానముగా గౌరవించవలసినదే. సత్యముచేతగనిన పంచమసహోదరఘృతాదులు మన యుదరకోశంబుల జేరుచునేయున్నవి.

స. గీ॥ అందియందక మనకుపు ♦ పొందిపొంద । కుండ జెప్పితివీవున ♦ టుండనిమ్ము ।
మాలమాదిగనేతులు ♦ మనయుదరము । లందెటులజేరు నాశ్చర్య ♦ మానిజంబు ॥

స. గీ॥ ముసలమానులు కావిళ్ల ♦ మోసి దెచ్చు ఘృతము లెచ్చటవో కొనీ ♦ మతి నెరుంగ ।
నంతుబట్టనుబుధవర ♦ పంతగించి । వాదమొనరించ లాభము ♦ లేదుసుమ్ము ॥

స. మహమ్మదీయులు దెచ్చునట్టినేతులు పంచములవి గాదైనా మనము కండ్లతో జూచుట లేదుగదా.

నవీ. (నవ్వి) మహమ్మదీయులు మనయెదుటనే పంచముల నేతులుగొనుటయు యది మనము జూచుచుండగనే పటణంబులందు విక్రయించుటయు గోచరమే కదా. వైవాహికార్యాదులందు తరుచుగా వాడునదంతయునదియే ముసల్మానుల హస్తగతమై పవిత్రమగుచున్నది గాబోలు. "జ్ఞానదండా జ్ఞానయజ్ఞోపవీతినః శిఖా జ్ఞానమయీయస్య ఉపవీతంచతన్మయం బ్రాహ్మణ్యంసకలంతస్యేతి" శాట్యాయనీయుపనిషతు బ్రహ్మమే నేను నేనే బ్రహ్మమను ఐక్యజ్ఞానమే ఏకదండము లేక త్రిదండముగాను ఇదియే శిఖగాను జందెముగాను ధరించినవారే బ్రహ్మజ్ఞానులుగాని నూలుపోగుల జందెమును వెండ్రుకల శిఖలు ధరించినవారు బ్రాహ్మణులుగాజాలరు.

సహా. [illegible] ఇప్పటి నవనాగరికులు [illegible] పెద్దను నెద్దైనని యెద్దనుని పెదరములవ దీయుచుండుదు వారికి దూరముగా తొలగు చుండినమేలు శాస్త్రబోధనమొనర్చి వినుపించుట దుర్లభము లేక నతిశయము

---

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్య స్త్రయోవర్ణాద్విజాతయః



నమవెళ్లిన తూకుంత యనిన తూకుంత యనుకొనవలసినదిచ్చు "క్త్వా పంచసహస్రాణి జాయతేవర్ణసంకరః" జెప్పవలసినదేమి. ముందు నమ్రత్వముగుపరచి పిమ్మట చీవాట్లుపదిగుచుందురు. (నిష్క్రమించును)

నవీ. చం॥ అడిగినశాస్త్రిసంచయము ♦ లారసి ధర్మము వెల్లడించరో ।
బుడిబుడికోపగించుకొని ♦ బోవుచునుందురు [illegible] ।
వినుపరు హేతువాదమున ♦ వీసమలేస్థులు ధీరవంతులే ।
యెడ నిజమాడ నిష్ఠురము ♦ లెల్లపయింబడుచుండు నిట్టులన్ ॥

(నిష్క్రమించును)

(ప్రవేశము — రామ హనుమంత భుజగేశ కృష్ణులు)

అందఱులేచి నిలువబడి జననీ కలుషహీనులగు మాసహోదరులు దుర్దశలపాలై నింగ కష్టములబొందుచుండుట గనలేక విచారగ్రస్తులమై నిన్ను సందర్శించి మాకష్టముల బాపికొనుటకనేకదినంబులనుండి ధ్యానమొనర్చుచుంటిమి మేము శక్తులము భక్తిహీనులము అజ్ఞానులము కొంచెంతయునైన కొంచెపు తపశ్రీ నొసంగి బూజించనేరము పత్రం పుష్పం ఫలంతోయమనినట్లు కించిత్పూజావిధానముచే తృప్తినొంది దయార్ద్రహృదయవై మాకయ్యాలించి ప్రత్యక్షమై మాకష్టముల కడముట్టించి దుర్దశలను బాపి రక్షింపుము తల్లీ భక్తజనకల్పవల్లీ మమ్ముకావు రక్షింపుమన్న నింకెవ్వరొనరించగలరు ఈ బీదపుత్రుల పూజలకు మెచ్చి ప్రసన్నవై మావిలాపము వినుము నీచల్లనిచూపుల చేదీర్చుము.

మత్తకోకిల॥ నీదుప్రార్థన జేయుచుంటిమి ♦ నమ్రతంబున భక్తితో ।
నీదుపూజలు సల్పుచుంటిమి ♦ నిశ్చయంబుగ మాతరో ।
నీదుగీతము లెల్లబాడుచు ♦ నిల్చియుంటిమి వేడ్కతో ।
నీదురూపముజూపి బ్రోవవె ♦ నమ్మికంక మొసంగగన్ ॥

తేవారము॥ శైలకాననప్రశస్తా ♦ శక్తిసామర్థ్యదీప్తా ।
పూలపూజలనొనర్చి ♦ పూర్ణమౌభక్తిబూని ।
శీలమొప్పగ సునీదు ♦ సేవజేసితిమి తల్లి ।
మేలుచేకూర్చి ప్రేమ ♦ మీరగనుబ్రోవరావ ॥

సుగంధివృత్తము॥ దాతవీ వెదైవమీవె ♦ తల్లివీవె చూడగన్ ।
ప్రీతిగాంచుచుట్టమీవె ♦ ప్రేమరూపివీవెవి ।
ఖ్యాతధర్మరాసివీవె ♦ ప్రాలుసత్యమీవెయో ।
మాతనీదుదర్శనంబు ♦ మాకొసంగి బ్రోవవే ॥

మాతా నేటిదినము నిన్నుదర్శించక మేమాహారంబులగొనము నీరంబులగ్రోలము మాప్రాణంబులైనా నీకర్పింతుము మాకు ప్రత్యక్షముగావేని మాతనువుల జాలించె

దము సహోదరుల దుర్దశాకష్టములు గననేరక యీకె నీగర్భంబున మననేరము ఇదిరో మానిశ్చయము. (అంతరంగధ్యాన మొనర్చుచు కనులు మూసికొనియుండును.)

ఆంధ్రిమాత (ప్రత్యక్షమై) పుత్రులారా మీభక్తికి సంతసించితి. (అందరు కన్నులుదెరచిచూచి చేతులు జోడించుకొను)

దండకము.

శ్రీమన్మహాపట్టణోపేత సుక్షేత్ర సౌభాగ్య సామ్రాజ్య సందీప్త నీయాంధ్రిమాతా గుణోపేత గాంగేయసద్భూషణీ పుణ్యచారిత్రిణీ సత్యసంశోభినీ కూపవాప్య ప్రసంకాశనీ కృష్ణగోదావరీ ప్రవాదినీ పావనీ ధర్మమాణిక్యనీలాంచితరత్న వైక్రాంత దేదీప్యకాకీరిణీ దివ్యచాంపేయ రాజత్ఫణీవేణి నీదివ్యతేజంబు భావంబులన్నిల్పి స్తోత్రంబు గావించి పూజించి సేవించుచున్నాము యత్యల్పమౌ భక్తికిన్మెచ్చి ప్రత్యక్షమై రూపమున్జూపితమ్మా కటాక్షించి నీపుత్రులన్పుత్రపుత్రాదులన్ పుత్రికాపుత్రులన్ ప్రేమవీక్షించి దారిద్ర్యముల్బాపి శ్రేయంబులన్గూర్చి భావంబులేకంబుగాజేసి స్వాతంత్ర్యపుష్టుల్ ప్రసాదించి విఖ్యాతచారిత్రులన్జేసి వైమానికాధూమనౌకాది నిర్మాణశక్త్యాదులంగూర్చి సంగ్రామ శూరత్వశౌర్యాదులంబొందు విద్యల్గ్రహించన్మహోమేనలన్జేర్చి రక్షించుమమ్మా నమస్తే నమస్తే నమస్తే నమః ॥

మాతా నిన్నుదర్శించి ధన్యులమైతిమి మాదారిద్ర్యము తొలంగగలదు మా కష్టములికనుండనేరవు తల్లీనిన్నెంతిధ్యానించినను తనివిదీరకున్నది నీమహిమల వినుతించుటకెరికి తరము.

మూర్తికలు.

శ్రీమన్మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన బుద్ధ కల్కి . సీతారామలక్ష్మణోమాశివ కృష్ణాగమనిలయా భద్రీనారాయణతనయా మాతరం వందేమాతరం.

శృంగి భరద్వాజ గాలవ శాండిల్య కౌశిక తపస్వినీగోత్ర సంతానాపస్తంబ విద్యారణ్యాది మహాపుణ్యజనకలితే మాధుర్యవాక్యలలితే మాతరం వందేమాతరం.

నానావిధపుష్ప లతావితాన కానన మహీభృద్గహ్వరసదనే కందరసదనే యాంధ్రిమాతరం వందేమాతరం.

వైశాఖరాణ్మహేంద్ర విజయవాడ గుళికపుర ప్రతిష్ఠాన కందనోల్పుర్యాది మహానగర విరాజితవేణీకిసలయపాణి మాతరం.

చోడకళింగపల్లవశిబి కాకతీయ ప్రతాపరుద్ర రాజనరేంద్ర కృష్ణదేవరాయ భూపాలాది కుమార కీర్తివిస్తారిణీ నవరత్నసత్వనిధారిణీ మాతరం వందేమాతరం.

ద్రవిడ కర్నాట హిందుస్థానీయాంధ్రి పూర్వసముద్రాంతరణీ మాధుర్యవాక్యసరణీ కల్మషహారిణీ మాతరం.



శ్రీశైలద్రాక్షారామ కాళేశ్వర త్రిక్షేత్ర సంతానాశేషవందితే పుత్రపోషణానందితే మాతరం.

వేదాద్రి మంగళాద్రి భద్రాద్రి వేంకటసింహాద్రి మహాపర్వతవిరాజితే మహాభక్తసంపూజితే మాతరం.

సౌందర్య హర్మ్యసౌధ సదన విభ్రాజితోద్యాన వాయుపూరిత వేణుగాన మధువ్రత శుకపికకోకిల నినాదే బహురమ్యతరాది నాటకవినోద సునాదే ప్రమోదేమాతరం

చం॥ బహువిధదుర్దశల్బొలగి ◆ బైకొనిబిల్చగ క్షామదేవతన్ ।
గ్రహముపవిరోధమందిచిర ◆ కాలనివాసముజేసిపొంగుచున్ ।
దహనమొనర్చుచుండెమము ◆ దారకొనెసోమరభూతమెల్లెడన్ ।
అహహాయిదేమిచిత్రముగ ◆ దుష్టమమున్గనుమాంధ్రిమాతగో ॥

తల్లీ సహోదర దుర్దశాకష్టములగని మేమోర్వలేక నిన్నెనేకదినంబులనుండి పూజించి నిన్నారాధించుచు అహోరాత్రములు నీస్మరణగావించుచు నీసందర్శనాపేక్షితులమై యుంటిమి మాదుర్దశలదొలంగ మాకీదినంబున ప్రత్యక్షమైతివి తల్లీ నిర్భాగ్యులమగు నీసంతతులగని కడతేర్చుము మాతా విదేశముల వారైశ్వర్యవంతులై సుఖంబులనుభవించుచుండుటయు మేమిట్లు నిర్ధనులమై యగచాట్లుపడుచుండుటగని యూరకుండుట భావ్యమా నిన్ను సేవించగానక యధోగతిపాలైతిమి బిడ్డలతప్పులు తల్లి క్షమించవలదా అమ్మా మేముచెడుచున్నకొలది నీకువిచారమేగదా మేము సౌఖ్యముగానుండుటే నీకుసంతోషము గాన మాదారిద్ర్యముదీర్చి రక్షించుము. సహాయనిరాకరణ మహామంత్రోపదేశమొనర్చి సర్వసహోదరులనుద్ధరించునటులనుగ్రహింపుము.

ఆంధ్రి. బిడ్డలారా వ్యసనమొందవలదు ఏను మీనిర్భాగ్యదశలను సోదరవైరమార్గములనుగని చింతించి మనోవ్యధనొందికృశించి సోదరీమణుల యుపదేశంబున నిరాహారవ్రతనిష్ఠనుబూని బదరీనారాయణుని సందర్శించి మీకష్టముల నివేదించి మిమ్ముద్ధరించమని యనేకభంగుల వినుతించ నాతడు దయామయుడై కొందరు దేశారాధనపరులుద్భవించి యుండిరనియు వారు స్వార్థత్యాగులై దేశసేవజేయనున్నారనియు నిక మీదుర్దశలన్నియు దొలంగగలవనియు నేనిప్పుడవతరించవలసిన యవసరములేదనియు జెప్పి నన్నుయోదార్చి యంతర్థానమొందియుండెను.

అందరు. సంతోషము సంతోషము సంతోషము ఆంధ్రిమాతకు జయ్. తల్లీ.

ఉ॥ తిట్టినకొట్టినన్మిగుల ◆ తిప్పలుపెట్టినబొంగిపొర్లినన్ ।
బెట్టినబెట్టకుండినను ◆ బేరునుగాంచినగాంచకున్ననే ।
పట్టునభక్తిజూపకను ◆ బారలవేసినతల్లికడ్డునన్ ।
బుట్టినవారిప్రేమగని ◆ పోషణజేయకనుండునేధరన్ ॥

తల్లీ సంతతులున్నందుకు సౌఖ్యములేదుగదా మాకై నీవనేకవ్రతంబులాచరించి బదరీనారాయణుని యనుగ్రహమువడసి ముందు మాకు మంచికాలము ఏతెంచునట్లొనరించితి విక మాకై దుఃఖమందవలదు. ఏమిక నీసేవాతత్పరులమై సంచరించగలము. దారిద్ర్యదేవత కెప్పుడు భారతభూమియే నివాసముగాదు. ఇష్టమువచ్చినపుడు వేరొండు భూమికరిగి నివాసమేర్పరచుకొనుచుండును. నీసంతతులిక కర్తవ్యకార్యంబుల నుపక్రమించగలరు. నాంక్షేమాభిలాషివై సుఖంబుననుండుము. నీయాజ్ఞాతిక్రమణాపరాధముల క్షమించుము.

ఆంధ్రి. సంతతులారా.

గీ॥ నందనులు సౌఖ్యమందు టే ♦ నాదుసుఖము । సుతులు దుఃఖమునొందుటే ♦ జూడ నాకు ।
దుఃఖముగు మీ విచారము ♦ దూరముగుటె । నావిచారమడంగుట ♦ నమ్ము డిదియు ॥

గీ॥ తల్లిదుఃఖమడంపగ ♦ తనయులెల్ల । భేదభావంబులూనక ♦ ప్రియముతోడ ।
తమ్ములక్ష్మణభార్తి బాపుడు ♦ ధర్మమెసగ । నైకమత్యంబునన్దూగి ♦ యలరసిరులు ॥

అందరు. నీయాజ్ఞ శిరసావహించి వర్తించగలము తల్లి సత్వరస్వరాజ్యప్రాప్తిగానున్న భారతదేశము నామావశిష్టము కాగలదమ్మ.

ఆం. సూనులారా స్వరాజ్యమెక్కడనున్నది గాలిలోదీపము బెట్టగంగానమ్మ నీమహిమయనిన సార్థకమేమి సోదరులందరేకీభవించి వర్తించిన మీకోరిక ఫలించును.

సీసమాలిక.

అద్భుతయాగంబు ♦ హాసనులు గిడ్వానీ, సయ్యదహమ్మదు ♦ సరిసనుసర
సింహచింతామణి ♦ సేలమువిజయరా, ఘనకృష్ణనాయరు ♦ ఘనుడెలహార ।
సర్వోత్తమార్యుడు ♦ శ్యామసుందరరాజ, గోపాలబెనర్జీరు ♦ కోపిదులును ।
కస్తూరిరంగాఖ్య ♦ ఘనుడు మోతీలాలు, శారదాశంకర ♦ స్వామిచెంత ।
చిత్తరంజనదాసు ♦ శ్రీవెంకటప్పయ్య, బాలసుబ్రహ్మణ్య ♦ బాలకుండు ।
ఆలిసోదరులుగ్ర ♦ ధ్యానందలజపతి, రాయాదిఘనులువి ♦ భాగ్రిజిబుత్వి ।
జులు గాంధియాజకు ♦ డల్లనైకమత్యశా, లాహింసశాంతద ♦ యాగ్నులొనర ।
దేశవిద్రోహమణ ♦ దివ్యాజ్యములరార, సమిధలు దుష్టశా ♦ సనములును ప ।
హాయనిరాకర ♦ ణాదిపన్నంబులు, జాతీయగీతముల్ ♦ మాతనుతులు ।
సద్వ్యాసములుయజు ♦ స్సామబుగ్వేదాది, మంత్రరాజంబులై ♦ మహిమనొప్ప ।
నార్యయశముయూప ♦ మలనిరంకుశపాల, నముపశుపుగనతి ♦ విమలమైన ।
ధైర్యసాహసములు ♦ దగసృక్స్రువంబులై, తేజరిల్లగపర ♦ దేశములకు ।
ప్రవహించుధననది ♦ యవభృథస్నానము, నొనరించననుకూల ♦ మాచుదనర ।
గౌరవపదవుల ♦ గాంక్షించుమాయరా, క్షసులవిఘ్నంబుల ♦ వసనడంచి ।



గీ॥ వెలదిసత్యాంబతోగూడి ♦ విజయుడేస్వ । దేశసవన మొనర్చగా ♦ దీక్షబూన ।
తోడ్పడకునారులెల్లరు ♦ దుర్లభంబె । సుఖకరస్వతంత్రపదవి ♦ సోమమబ్బ ॥

హ. అబ్బా విశ్వామిత్రయాగవిఘాతకులైన మారీచసుబాహు లట్టిదేశవిద్రోహుల విఘ్నముల నెవరరికట్టగలరు.

కృ. ఆయాగము రాముడు సంరక్షించి కడతేర్చగల్గెను ఇప్పు డీయాగ మెవరు సంరక్షించగలరు.

ఆం. అందరేకదీక్షతో నిర్వహించిన యాగము సాంగముకాగలదు విద్రోహులు కొందరుండినను విఘ్నముకానేరదు.

సీ॥ రథముధర్మంబుధీ ♦ రపరాక్రమంబులు, శౌర్యసాహసములు ♦ చక్రములలి ।
శాంతదయాహింస ♦ సత్యములశ్వముల్, దేశభక్తులుమహా ♦ ధీరసైని ।
కులు గాంధిసారధి ♦ గురుసహాయనిరాక, రణముకోదండంబు ♦ రాజిలువర ।
భారతీయాశయ ♦ పత్రికలుశరంబు, లు, గానొనరించుక ♦ ఘనుడువిజయ ।

గీ॥ డఖిలజయభేరినినదము ♦ లమరవెడలి । ప్రాణిహింసనమునులేని ♦ బాటద్రొక్క ।
శాంతసంగ్రామమొనరించ ♦ జనములెల్ల । స్వపరిపాలనమబ్బువ ♦ త్సరములోన ॥

ఘ. ఈరథములాగుటకుకూడా మిట్టపల్లములులేని బాటజేసి యొక్కపట్టున లాగవలెగదా.

ఆం. ఒక్కపట్టుబట్టిన మేలుబొందగలరు పుత్రులార.

గీ॥ దేశభక్తసుమనసవి ♦ ద్వేషకోటి । భూరికీర్తిపయోదధి ♦ ధీరశైల ।
కవ్వమునునిల్పి హైందవ ♦ కాంక్షయనెడి । త్రాడుజుట్టిమధించస్వ ♦ రాజ్యమనెడి ।
సుధలభించదెసత్వర ♦ సూనులార ॥

కృ. సాగరమధనమున వైరభావముగల దేవదానవులందరొక్కపెట్టున నిర్వహించియుండుటచే కొనసాగె నిప్పుడట్లు మనవ్యతిరేకవర్తనులు తోడ్పడకుండుటయేగాక కార్యసఫలముగానిత్తురా.

హ. కానివ్వనిమాట సత్యము. ఎద్దియు చేతగాకున్న తల్లియే మొనర్పగలదు.

ఆం. మరియొకమార్గము జెప్పెదవినుడు.

గీ॥ హాలికుడు గాంధివాడిగా ♦ ద్వాళికమున । దుష్టశాసనకంటక ♦ ద్రుమములెల్ల ।
నరికిసీమనుబాగుగ ♦ నప్రవాహా । మాపిధిరతోశయక్షేత్ర ♦ మారనింపు ।
ఆర్యధరహలంబునిం ♦ డారబన్ని । ధీరశౌర్యవృషంబుల ♦ దృష్టిగట్టి ।
విత్తబాగుగవిజయాది ♦ వితనముల । ఫలముగల్గునుస్వారాజ్య ♦ పదవిభువిని ॥

హ. గాంధి కృషిచేయుచునేయున్నాడు.

కృ. "కృషితోనాస్తి దుర్భిక్షం జపతోనాస్తి పాతకః" గాంధి కృషీవలునిచే ప్రస్తుత దుర్భిక్షము తీరగలదు.

భు. నాతివిస్తీర్ణమైన భారతభూమి కృషిసల్పుట కొకరిద్దరుజాలుదురా.

రాం. మీకెందును పట్టుదల గాన్పించుటలేదు కడసారి యుపదేశమింకొక్కటి వినుడు

సీ॥ అన్యదేశములసా ♦ మాన్యవస్తువులైన, జూడకకన్నుల ♦ వీడునాడు ।
దివ్యంబుగానుస్వ ♦ దేశవస్తువులను, మించివాడగనుద్రే ♦ మించునాడు ।
కూటికిగుడ్డకు ♦ కొదవలేకుండగ, ధనికులబీదల ♦ దనుపునాడు ।
సర్వకారాగార ♦ సమితిని నెలకొల్పి, మంచిసామగ్రిని ♦ రక్షించునాడు ।
గీ॥ భేదమునులేక నొకతల్లి ♦ బిడ్డలమని । యెంచి భారతమాతసే ♦ వించునాడు ।
కూరులైవర్తనంబుల ♦ జూపునాడు । రాకయుండునె దివ్యస్వ ♦ రాజ్యపదవి ॥
గీ॥ మధురగానంబు మీరగ ♦ మందిరముల । గాత్రములతెట్టినాలు బా ♦ కలసుదీయ ।
[illegible] ॥

కృష్ణ. సోదరులారా మనతల్లి జెప్పినట్లు నడచుకొనగలిగిన బాగుపడగలము.

చం॥ గురుతరకౄరచట్టముల ♦ కుఖ్యయమందక దీక్షబూని ని ।
బ్బరముగ నాలి సోదరుల ♦ వాక్యములట్టుల గాంధిబోధనల్ ।
మరువక హైందవుల్మసల ♦ మానులువైరము బాసి యొక్కటై ।
కరముపవిత్రమంచుసహా ♦ కారనిరాకరణంబొనర్పగన్ ॥

భుజ. ఆహా.

మ॥ మునిసీమ్ హైందవులొక్కటౌచు నమహా ♦ మోదంబుతో శాంతమా ।
నసులై దల్చకహింసనంబు పురుషు ♦ ల్నారీమణుల్భక్తితో ।
నసహాయోద్యమమే స్వధర్మమనిబా ♦ హాటంబుగా బూనగా ।
బొసగున్ సౌఖ్యము భారతాననికిసం ♦ పూర్ణంబుగా నెంతయున్ ॥

ఆం. మనోవాక్కాయకర్మలచే అసహాయోద్యమము బూనినజాలు నదొక్కటిగో మిమ్ముల కడతేర్పగలుగును.

హ. అందరేకముగావలెగదా. కాలము మంచిదిగాని దటులేలపొసగును.

ఉ॥ భేదముజూడక న్నిమతుల ♦ ప్రేమతో భారతమాత సేవన ।
మ్మోదముతోడ చేయుచున ♦ మాన్యగుణాలి మహాత్ముడీయులన్ ।
సోదరులంచు హైందవులు ♦ జూచుచు శాంతముగోరి ధాత్రిమ ।
ర్యాదమెలంగ సౌఖ్యమును ♦ హాయనిరాకరణంబొనంగగదే ॥

భు. అన్నిటికంటె ప్రాముఖ్యము స్వదేశీవ్రతము.



రామ. అసలు స్వదేశీవ్రతానుష్ఠానము దేశమునకు బోధించిన మహానీయులెవరై యుండవచ్చును (జ్ఞాపకము దెచ్చుకొనుచుండును)

కృ. సీ॥ మహిత భారతపితా ♦ మహుడు దాదాభాయి, సౌగోజిబీజంబు ♦ నాటెమొదట ।
రాష్ట్రతయాబ్జిబ ♦ ద్రుష్టినుపేమ్మటం, మొలకెత్తగాజేసె ♦ పూర్ణముగను ।
కృపతోడగోపాల ♦ కృష్ణగోఖ్లేజెంచె, దారిద్ర్యదేవితన్ ♦ దాహ్యానిసను ।

కృ. పాపము గౌర్నమెంటువారు రాయల్ కమిషనరుగా నిర్ణయించినపుడు యేర్పరచిన గొప్పబహూకరవేతనమును విసర్జించి దరిద్రదేవతనే కోరియుండెను.

చెలగంగాధర ♦ తిలకుమహారాజు, దయతోడగాపాడె ♦ ధర్మగతిని ।
గీ॥ లాజపతిరాయి మిక్కిలి ♦ లక్ష్యముంచె । పెద్దరుబరను హుల్యాములు ♦ వృద్ధిగోర ।
వేగఫలమివ్వగాస్వరా ♦ జ్యాగమంబు । నరయుచుండెను గాంధిమ ♦ హాత్ముడెలమి ॥

రాము. ఎవరెన్ని జెప్పినను మూలసూత్రరహస్య మొకటున్నది.

కృ. అదియెద్ది.

రా. ఉ॥ సత్యముగాంచదేహములు ♦ సాధనజేసి పరిశ్రమాదులన్ ।
సత్వరదేశసేవలను ♦ సల్పుచు ధీరముతోడ పాలవా ।
తత్వరహస్యముల్దెలసి ♦ ధర్మము కెంతయు బద్ధులౌచు నే ।
కత్వముబూనకున్నయెడ ♦ దాస్యవిమోచనమెట్టులయ్యెడిన్ ॥

కృ. ఇటువంటిది ప్రస్తుతము వెల్లడిజేయకూడదు మరియొకరహస్యము.

రా. చెప్పకూడదనుచునే మరల రహస్యమును వెల్లడించెదవేల.

కృ. ఇదియొక్కటి మెల్లగా జెప్పెదను మనసు మన తల్లియే గద.

చం॥ లలితవితీర్ణమాపదవు ♦ లన్విడిపించిన మేటిభాగ్యవం ।
తులు బ్రతుకంగవచ్చునటు ♦ దుర్లభమానొనరించబీదవా ।
రలుతగుజీవనంబులకు ♦ రాబడియుండుగానభూరివ్ర ।
త్తులగలిపించుకార్యముల ♦ తోడ్పడధర్మము గొప్పవారికిన్ ॥

హ. సంపత్తులు శాశ్వతంబులని తలంచుచున్నపుడు ద్రవ్యముగూర్చిపెట్టినను దుర్దశబట్టనప్పుడు యుండనేరదు మహాత్ములందులకే ఐశ్వర్యమును తృణప్రాయముగా జూచుచుందురు.

భు. సందేహమేమి.

చం॥ మరణములేక వెల్గసుర ♦ మండలివేడ్క సుధన్ గ్రహించెనా ।
సరవిని గోరకీశుడువి ♦ షంబును దాల్చియు బ్రోచెలోకముల్ ।
గురుతర భాగ్యలక్ష్మినిల ♦ కోరుదురెల్లరు బూనకట్టులన్ ।
కరము దరిద్రదేవతకు ♦ కాపురమిచ్చినవారె పూజ్యులౌ ॥

కృ. భాగ్యలక్ష్మిని [illegible] దేవతను [illegible]
ఖండచేతనే గాంధిమహాత్ముఁడైనది.

ధా. ముమ్మాటికి సత్యము.

భు. ఈశ్వరుఁడు వట్టిఅపాయకుఁడు లక్ష్మి ఐరావతాదుల హరిదేవేంద్రాదులు [illegible] యుండె విషమును తానుగైకొనియుండె.

హ. దేశోపద్రవమును బాపుటకు సమకట్టినవారు ధనములకాసింతురా.

ఆం. కుమారులారా వాస్తవము.

గీ॥ సోదరులభంగిసాదగు • నూనుతెల్ల । నైకమత్యంబుబూనుచు • నంటువిడుప ।
స్వపరిపాలనమబ్బును • సత్వరమున । హీనులైననుభక్తుల • నేలుశౌరి ॥

అందరు. తల్లీ మేమాప్రయత్నమునే జేయుచున్నాము పూర్వాచారపరాయణులు మమ్మేమొనర్చిన నొనర్చుగాక నంటుతనమును ముఖ్యముగా మానునట్లు సోదరులకు బోధించుచున్నాము.

ఆం. సంతోషము మదీయసంతతులెల్లరు సుఖముగావర్ధిల్లుదురుగాక.

(నిష్క్రమించును)

రా. సోదరులారా మనతల్లి ఆంధ్రమాత జెప్పినట్లు మనము దేశసేవకులమై సహోదరుల నిద్రనుండి మేల్కొల్పి బాగొనరించవలయును.

కృ. అనఁబా "కృషితోనాస్తిదుర్భిక్షం జపతోనాస్తిపాతకః" మనము శ్రద్ధతో కృషిసలిపినయెడ శోకములు ఫలించకపోవు మనతల్లియాజ్ఞ శిరసావహించెదము భేదభావములువదలి యందరి సమానముగాప్రేమించి ఐకమత్యమును బోధించవలయును.

హను. వాక్శూరులై మహాసభలందు ప్రగల్భ్యములువలికి మాయోపాయములతో ధనార్జనమొనరించి తమసౌఖ్యమే స్వర్గముగాభావించుట ఘనముగాదు దేశభక్తుఁడుగాడు ప్రజలసౌఖ్యమునకై శ్రమపడినవాఁడే నిజమైన దేశాభిమానపరుఁడు కార్యశూరుఁడు మానవశ్రేష్ఠుఁడు.

భుజ. గీ॥ కష్టమొనరించిదినమెల్ల • కాయమమ్మి । జీవనమునకుబాలక • చెడినజనంబు ।
మొర్రిత్తుకొనుకూలివారలు • మొరనువినరు ధనికులెంతెంతలాభము • దాముగనిన ॥

సంపద లస్థిరము లాయువుస్వల్పము యముఁడు దయాపరుఁడుగాడని దెలిసియు సుగతిహేతువైన ధర్మమునాచరించరు "ధర్మస్యత్వరితాగతిః" యనువాక్యార్థమే గ్రహించరు.



గీ॥ పిడికెఁడన్నముబిక్షగా • బెట్టలేక । యాత్రలన్నధనవ్రయ • మాచరింత్రు ।
దక్కునాపున్నెముట్టికి • నెక్కలేని । వారుస్వర్గమునెక్కుట్కు • వసుధలోన॥

సత్యము.

మంగళమహాశ్రీవృత్తము.

సూనృతవచనంబులకు సజ్జనులకెల్లనుసురి చారుగుణవర్తనులకెల్లన్ ।
నిత్యమగుదేశజన నీచంపుసేవలను నేర్పుగనుజేయుప్రజకున్న ।
దృఢభృత్యజనులన్మనుచు పెన్నిధులుగాంగికి బీదలకుసాధులకుభూమిన్ ।
ప్రత్యహరమాత్మగను ప్రాజ్ఞులకునాంధ్రిజన బాలకుమంగళముగాతన్॥
"స్వస్తిసర్వేజనాస్సుఖినోభవన్తి.

(నిష్క్రమింతురు)

గద్య.

ఇయ్యది వైశ్యకులపారావారసుధాకర శత్రువర్గభీకర గ్రంధిసంశ కౌండిన్యసగోత్ర పవిత్ర తాతయార్యదుహిత్ర బసవయ సుబ్బమాంబాప్రియపుత్ర సజ్జనమిత్ర బంధుజనాప్త వెంకటసుబ్బరాయగుప్త విరచితాంధ్రిమాత నాటకంబున పంచమాంకము సర్వము సంపూర్ణము.

మంగళమ్ మహత్.




తనియాంబాళ్ విలాస ముద్రాక్షరశాల, 1/380, టంకసాలవీధి, మదరాసు.

